

ఆచంట జానకిరామ్

★

ఒక్క తెల్లగులాబీ పువ్వూ

ఒక్క ఎర్రగులాబీ పువ్వూ;

అంతులేని ఆపేక్షకు ఆనవాలు ఎర్రగులాబీ,

స్వచ్ఛమైన స్నేహానికి సంకేతము తెల్లగులాబీ.

జానకిరామ్

★ ★

# 'మొదటి మజిలీ'

"నా స్మృతిపథంలో" అనే వ్యాసపరంపరను 'ఆంధ్రప్రభ'లో ప్రచురించిన శ్రీ ఆచంట జానకిరామ్ తమ 55 వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని వ్రాసిన వ్యాస మిది.

ఎడిటర్, ఆంధ్రప్రభ

తిరుపతికొండ ఎక్కుతూ, చంద్రగిరిదృశ్యము వద్ద కాసేపు ఆగి, వెనక్కు తిరిగిచూస్తే, మనము నడచివచ్చిన బాట అంతా మెలికలు తిరిగిన ఒక పెద్ద చారలా కనిపిస్తుంది. 'అబ్బ! ఇంతదూరము నడచామా!' అనిపిస్తుంది. ఇక నడువవలసిన దూరముకంటే, నడచి వచ్చినదే ఎక్కువ అని తోస్తుంది. అలాగే, ఈ జీవితమూనూ. ఈ జ్యేష్ఠ బహుళ విదియకు నాకు ఏబదిఐదుఏళ్ళు నిండుతాయి. నా జీవ యాత్రలో మొదటి మజిలీ ఇది.

అబ్బ! ఎన్ని కొండలు దాటాను! ఎన్ని లోయలలో విశ్రమించాను!! కొంతమేర స్నేహితులతో ఆడుతూ పాడుతూ, చకచకా నడక సాగింది. కొంతమేర, ఎంతోమేర, ఏ తోడూలేక ఒక్కడనే - కాళ్లీడుచుకుంటూ ముందుకు వెళ్ళవలసివచ్చింది. కొన్ని రాత్రులు నక్షత్రాలే త్రోవచూపాయి. చాలాదూరం, నలిగిన బాటనే యాత్ర సాగినా, అప్పుడప్పుడు మాత్రం మలుపు అవతలఉన్న సుందర దృశ్యంలో లీనమైపోవాలనే ఆత్రుతతో అడ్డదారిని రాళ్ళపై పరుగులెత్తాను - కాలుజారి, నల్లరాతిని తల మోదుకొంది. రక్తం కారుతూన్న నుదురు తుడుచుకుంటూనే రమ్యాలోకనము!

నా చిన్నతనంలో మా హైస్కూల్‌కూ, కాలేజీకీ కలసి ఏటేటా జరిగే స్పోర్ట్స్‌లో రన్నింగు రేస్ చూచాను ఒకపేడు. పందెము ప్రారంభమైన రెండు నిమిషాలలోనే ముగ్గురు విద్యార్థులు తటిమర్మ్రా వారినందరినీ వెనక్కు త్రోక్కి ముందుకు సాగారు. ఇక కాస్సేపటిలో ఆ మిగతా వారంతా పరుగెత్తడం మానివేశారు. గెలుస్తూన్న ఆ ముగ్గురిలో ఒకతను అవలీలగా మరీ ముందుకు సాగిపోయాడు. రెండవ అతను గట్టి ప్రయత్నం చేసి అతనిని సమీపించాడు. మూడవ అతను మరీ దూరాన ఉన్నాడు, కాని ఇంకా పరుగెత్తుతూనే ఉన్నాడు. మొదటి ఇద్దరూ గమ్యస్థానం జేరగా, పిల్లలంతా వారిని పేరుపెట్టి పిలుస్తూ వారి గెల్పుకి హర్షధ్వానాలు చేశారు. మూడవ అతను ఇంకా పరుగెత్తుతూనే ఉన్నాడు. అతన్ని చూచి చప్పట్లు కొడుతూ పిల్లలంతా హేళన చేశారు. కాని, అతను లక్ష్యపెట్టక, ఇంకా పరుగెత్తుతూనే ఉన్నాడు. అతను గమ్యస్థానానికి ఇంకొక ఏభై గజాలదూరానఉండగా ఆ స్పోర్ట్స్‌లో తరువాత అంశము "స్లో సైకిల్ రేస్" ప్రారంభించారు. అప్పుడు తెలిసింది అతనికి ఆనాటి రన్నింగు రేస్‌లో రెండే బహుమతులనీ, మూడవ బహుమతి లేదని. కప్పకూలినట్లు కూలిపోయాడతను... నేను గబగబా అతనివద్దకు వెళ్ళి, అతని ప్రక్కన కూర్చుని అతని చేయి నా చేతులోకి తీసుకున్నాను. ఆయాసంతో వగురుస్తూ కళ్లు మూసుకునిఉన్న అతను నా చేయి తాకినంతనే కళ్లువిప్పి నా వైపు చూచి చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వు నా కొక గుణపాఠమైంది.

జీవితమే ఒక 'రనింగ్ రేస్.' అందరికీ మొదటి రెండు స్థానాలు ఎలా వస్తాయి? మూడవ బహుమతీ లేదాయె! కాని, యత్నము ముఖ్యము. ఫల మెలా పరిణమించినా మనము పాటింపకూడదు అని తెలుసుకున్నాను. ఏది చేసినా చాలా బాగా చెయ్యాలి, మనస్సుంచి

విరివిగా ఉన్నవి. `ఆకలి దప్పులతో తాళలేనివారు వాటిలో ఎట్టి అభ్యంతరమూ లేకుండా ప్రవేశించవచ్చును. ఈ నవగ్రామమందలి మెడికల్ స్టోర్సుకు చేరువలో అన్నిటి కంటె శ్రేష్ఠమైన టీ, మిఠాయి షాపు కలదు. పల్లెలో ఈ మెడికల్ స్టోర్సును వెతుకనక్కర లేదు. ఈ స్టోర్సు తళతళలాడే చక్కని గృహంలో అమర్చబడి ఉన్నది. మేజా, బల్లలూ, కుర్చీలూ వగైరా సామగ్రి విరివిగా అందమర్చబడి యున్నవి. విభిన్న ఔషధముల రంగు రంగుల విజ్ఞాపనలు ఎల్లరదృష్టిని ఆకర్షించు చుండును. బుష్ కోటూ, ప్యాంటూ ధరించిన డాక్టరు మెడలో స్టెతెస్కోప్ వ్రేలాడుచున్నది. అతడు కూర్చున్నప్పటికీ ఈ వైఖరి అట్లే అగపడుచుండును. ఒక తేనీటి అంగడి మన దృష్టిని ఆకర్షించుచునే యుండును.

ఇక్కడనుండి మరల ఉత్తరదిశగా పోవు శాఖాపథము ఒకటి కలదు. ఇది వెడల్పైనది కాదు. ఒక బండి మాత్రము దీనిగుండా పోవచ్చును. రెండు వైపుల నుండి వేర్వేరు వరుసలలో తెరువరులు యథేచ్ఛగా నడువవచ్చును. ఛాయాచ్ఛన్న మార్గమునుండి ఇంచుకదూరము—రెండు ఫర్లాంగులు—పొందు. తెన్నున దోవ కిరువైపులలో నాలుగైదు పుష్కరిణులు అగపడును. తటాకతీరములందు మామిడి, జామ, చింత చెట్లు కలవు. వీని నడుమ శిరీషతరువులు విలసిల్లుచున్నవి. కనులకు విందొనరించు శాఖోపశాఖలు పల్లవములతో విస్తరించుటచే పథ మంతయు ఛాయా వృతమై ఉన్నది. ఒక సరస్సు చక్కని ఘట్టములతో ఒప్పుచున్నది. ఇందుండి అవ్వలికి పోయిన ఒక విశాల ప్రదేశము మీకంట పడును. అచ్చటి దృశ్యము మిగుల విచిత్రమైనది.

క్రొత్త యుగపు ఫేషన్‌లో కట్టబడిన ఇళ్ళు ఇందున్నవి. వాటి నిర్మాణ ములో ఈ కాలపు ఇంజనీరింగ్ నేరిమి గోచరించుచున్నది. నవీన పద్ధతిలో ఆఫీసులు తయారైనవి. ఇందందు వసతి గృహములు కూడా ఉన్నవి. కాలువలు త్రవ్వబడుచున్నవి. ఇంచుక దూరములో వేరురీతి ఇండ్ల వరుస కలదు. చిన్ని కట్టడముల చుట్టూ పెద్ద భవంతులు లేచుచున్నవి. వీటి నిర్మాణములో నలుదిక్కు లందు కర్రబొట్ల చెంత తాపీ మేస్త్రీలు పనిచేయుచున్నారు. ఆడువారు కూలి పనిలోనుండి ఉల్లాసముతో పాటలు పాడుచు దరువుల కనుకూలముగా సమ్మెట వేయుచున్నారు. హేటు, కోటూ, ప్యాంటూ ధరించిన ఇంజనీరు చేత సైకిల్ పూని, నలువైపులకు సంచరించుచున్నాడు. చిన్నయిండ్ల గుంపులో ఈనాటి ఆసుపత్రి అలరారుచున్నది. డాక్టర్లూ, కాంపౌండరులూ నివసించే బసలు దాని కంటియున్నవి. నర్సుల వసతులు ఎంతో దూరములో లేవు. కొంచెం దూరములో

"ఇతనితో చెపితే, ఈ పని తప్పకుండా అవుతుంది"అనే నమ్మకం కలిగించాను పెద్దవారిలోనూ, చిన్నవారిలోనూ కూడా. అనేక విష యాలలో నా చర్యలను తీవ్రంగా ఖండించేవారు సైతము, తాము తప్ప కుండా కావాలి అనుకున్న పనికి నన్ను పురమాయించడము పరిపాటి ఐపోయింది. ఇక నా ఐదేళ్ళ మేనల్లుడు మరీను! తను ఏది కావలసినా నన్నే అడుగుతాడు కృష్ణాజీ: రంగు పెన్సలు మొదలుకొని రామఢోలు వరకూ ఏదైనా సరే మామయ్యను అడిగితే చాలు ఇట్టే లభిస్తుంది తనకు అనే నమ్మకము కలిగింది ఈ చిన్నారి మెదడులో. రాత్రివేళ, చల్లగాలికి, పై డాబామీద, అతనిని నా ఒళ్లో పెట్టుకు కూర్చుండగా ఉన్నట్టుండి "మామయ్యా! ఆ నక్షత్రాలు తెచ్చి ఇయ్యవూ నాకు?" అంటాడేమో! అప్పుడు నే నేమి చెయ్యగలను అనుకుంటూ ఉంటాను. సర్వశక్తిమంతుడు తన మామయ్య అనే అతని నమ్మకము వృథా ఐతే ఎలా?

నిజానికి నక్షత్రాలూ నా ఒళ్ళో రాలిన సమయాలూ ఉన్నాయి. కలలోనైనా సాధ్యము కాని సంఘటనలు జరిగాయి ఈ జీవితంలో. ఏ విధంగా చూచినా, నా జీవిత ప్రాంగణములో అడుగు పెట్టడానికి ఏ మాత్రమూ వలనుకాని వ్యక్తులు ప్రవేశించారు నా జీవితంలోకి— చీకటింటిలో దీపం పెట్టడానికి. ఎన్నేళ్ళ క్రితమో స్నేహితుడన్నట్లు: మనసార వాంఛించిన విషయము నిజముకాక తప్పదు!

ఎంత ప్రేమ అనుభవించాను! సంస్కృత కావ్యాలు చదువు తూంటే అతిశయోక్తి ఉత్ప్రేక్షగా కనిపించే అతి సుకుమారమైన, అతి లలితమైన, అతి గాఢమైన ప్రేమస్పర్శ అనుభవింపకలిగాను ఈ జీవి

తంలో. కాని, ఈ అపరిమితానందానుభూతి ఎంత ఉత్కృష్టమైనదైనా అది అనిత్యమని మరువలేకపోయాను:

Ecstacy must be paid for—
It's inevitable price is that
It comes to an end.

(Farjeon)

ఐతే, అచ్చపు అమృతాన్ని ఆస్వాదించిన కొన్నాళ్ళకే, కాలకూట విషమూ రుచిచూచాను—రుచిచూడక తప్పినదికాదు. విధిలీల అటువంటిది. ఎందుకీ బ్రతుకు! – అనిపించింది ఆ ఘడియ. వాయువేగంతో పరువెత్తి పోతూన్న రైలుబండి తలుపు కాస్త తెరచుకొని శూన్యంలోకి అడుగుపెట్టితే? చిటికెలో బాధ తీరుతుంది.

ఎంతో ధైర్యం కావలసివచ్చింది ఆ నిమిషం – చనిపోవడానికి కాదు, బ్రతుకుతూ ఉండడానికి.

మళ్ళా ఆశాలత, మళ్ళా క్రొత్త చిగురు. శిథిల శిశిరమ్ములో తొలివసంతం తొంగి చూచింది. నేనొక క్రొత్త మనిషిని. ఆనందం అనుభవించాను, ఆనందం పంచిపెట్టాను. సంఘంలో, సాహిత్యరంగంలో, లలితకళా ప్రపంచంలో నా కొక వ్యక్తిత్వం కలిగించారు సహృదయులు. అంతేకాదు, దైవదత్తమైన నా సహజ ప్రతిభను వెల్లడి చేయడంకంటే ఎన్నోరెట్లు ఎక్కువ ముఖ్యమైనది, కవులు, గాయకులు, చిత్రకారులు ఐన ఇతరుల ప్రతిభను లోకానికి తగురీతిని వెల్లడిచేసే మహదవకాశం కలిగింది నాకు—ఏ పురాకృత సుకృతంవల్లనో.

అది కళానిధులతో, మంత్రివర్యులతో, నాట్యాచార్యులతో, నట నటీమణులతో, చిత్రకళా నిపుణులతో, ప్రఖ్యాత విమర్శకులతో

కిటకిటలాడుతూన్న బ్రహ్మాండమైన పౌరమహాజనసభ. మద్రాస్ మేయర్ కోరగా, ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నార్ నా చేతిలో ఉన్న పదహారు కాసుల సింహతలాట ఆభరణాన్ని అందుకుని, పుష్పాలంకృత పీఠము నలంకరించియున్న నాట్యకళానిధి శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రివారి మణికట్టున తొడిగారు. సమకాలిక లలితకళాభిజ్ఞులందరి తరపున ఆ కూచిపూడి నాట్యకళోద్ధారకునికి ఈ మర్యాద చేయించే భాగ్యము నాకు లభించింది. ఎంతటి పుణ్యము !

ఆ రోజులలో నా కలము వింతగా సాగినది. ఎన్ని కథలు ! ఎన్ని నాటికలు ! ఎన్ని విమర్శలు !

నా "కచదేవయాని"లో దేవయాని అంటుంది :

కచమయమైన ఈ ప్రదేశాన్ని ఎలా విడిచి వెళుతానంటావు కచా ! నా కచా ! !...కచా ! కొంచెము జ్ఞప్తికి తెచ్చుకో...మన జంట హృదయాలను తనలో కలుపుకున్న సెలయేరు నీ ప్రయాణానికి సెలవు ఇస్తుందా ? అదుగో ! స్రోత వినబడుతూనే ఉన్నది : వద్దు ! వెళ్ళొద్దు ! అంటూనే ఉన్నది. కచా ! నా కచా !...

"తోటమాలి"లోని నా తోటమాలి తనను ప్రేమించిన రాజకుమార్తె తన కిచ్చిన ముద్దుటుంగరంకేసి తన ఎర్రని కళ్ళతో అలాగే చూస్తూ ఉంటాడు :

తన తోటలోని పువ్వులన్నీ నిద్రపోతాయి...తన తోటలోని పక్షులన్నీ నిద్రపోతాయి... మేలుకొని, మేలుకొని, పెంపుడు లేడి అతని పాదాలపైన తలవాల్చి నిద్రపోతుంది. కాని, తోటమాలికి

మాత్రం నిద్దుర లేదు. ఉదయభానుని చూస్తూ, వజ్రపుటుంగరంతో తన ఎర్రని కళ్ళను తుడుచుకుంటూ ఉంటాడు, ఇప్పటికీ, ఎప్పటికీని — తోటమాలి !

ఈ తోటమాలే రాజకుమార్తె రూపాన్ని చంద్రశిలా ప్రతిమగా చిత్రిస్తాడు, వారిద్దరూ కలసి అనుకున్న వాగులో—నదీగర్భాన — తాను నెలకొల్పిన చలువరాతి మందిరంలో. ఇది తెలిసిన రాజమాత అక్కడకు వస్తుంది రాజమాత ప్రవేశింపరాని స్థలం లేదు. కాని ఇక్కడమాత్రం బెదురుతూ బెదురుతూ, హృదయాన్ని అరచేతితో ఒత్తి పట్టుకుని మందిరంలో ప్రవేశిస్తుంది ఆమె :

"పైనున్న గవాక్షమునుంచి రెండు జంట కిరణాలు వెలుతురు బాణాలలా వేదికపైకి ప్రసరిస్తున్నాయి. ఆ వెలుతురుకు ఒక్కక్షణం కళ్లు మూసుకుంది రాజమాత !...

కళ్లు విప్పి చూచింది రాజమాత.

వేదికపైన ప్రతిమ లేదు. జీవకళ ఉట్టిపడుతున్నదనుకొన్న తన కూతురి విగ్రహం లేదు. విగ్రహము ఉండవలసినచోట గుండ్రని కాంతిలో ఉన్నవి రెండు దోసిళ్ళ పారిజాతపు పుష్పాలు.

దగ్గరకు వెళ్ళి చూచింది రాజమాత :

తెల్లటి రేకలపైన మంచు ముత్యాలు వేడి కన్నీటి చుక్కలు. పారిజాతపుగొట్టాలన్నీ ఆమెకేసే చూస్తున్నాయి— వేయి ఎర్రని సూది మొనలలాగ !

రాజమాత పెదవులు అదరినవి.

ఇంతటి త్యాగమా! ఇంతటి త్యాగమా!! అన్నది రాజమాత.

"నా వడ్డాణం" కథలో సుకుమార్ తల్లి అతని నాలుగవ యేటనే చనిపోతుంది. చనిపోయే ముందు, వణకే చేతులతో, తన వడ్డాణముతీసి అతని మెళ్లో వేస్తుంది అమ్మ "నీవు పెరిగి పెద్దవాడయాక, నీ పెండ్లాం నడుమున పెట్టకుందువు గాని ఈ వడ్డాణము" అని కళ్లు మూసు కుంటుంది. కాని, అతని భార్య ఆ వడ్డాణము పెట్టుకోదు సరిగదా, అనేక విధాల అతని మనస్సును గాయపరుస్తుంది. వారు విడిపోతారు. తరువాత కొన్నేళ్ళకు సుకుమార్ ప్రాణస్నేహితుని భార్య మంగళం అతని తల్లికి ప్రతిగా నిలిచి తన వడ్డాణము అతనికి పంపుతుంది. సుకుమార్ అంటాడు :

"వడ్డాణాన్ని రెండు చేతులతో పూలదండను పుచ్చుకున్నట్లు పుచ్చుకున్నాను. ఎవరి మెడలోనో పూలహారం వేస్తూఉన్నట్లు ముందుకు నడిచాను. కిటికీముందు నిలచి చిత్రకారుడు చిత్రాన్ని చూచినట్లు వడ్డాణాన్ని బారెడుదూరాన ఉంచుకు చూచాను.:

బంగారపు చక్రం ! మధ్య ఆకాశం...ఆకాశం...అంతే ! !

  

చిన్నప్పుడు నాకు చిత్రలేఖనం నేర్పించడానికి ప్రయత్నించారు నాన్నగారు. కాని, వారి ప్రయత్నము కొనసాగలేదు. పెరిగి పెద్దవాడ నయాక ఎందరో సుప్రసిద్ధ చిత్రకారులు స్నేహమయ్యారు నాకు. మా గురువులు సుప్రసిద్ధ కళావిమర్శకులు జేమ్స్ కజిన్స్. నేను చదివే పుస్తకా లన్నీ చిత్రకళ గురించే. స్నేహితులతో జరిగే సల్లాపమంతా చిత్ర కళను గురించే! శాంతినికేతనము వెళ్ళినప్పుడు పూజ్యులు నందలాల్ బోస్, అవనీంద్ర టాగోర్ల పరిచయ భాగ్యం కలిగింది. ఇదివరకే నాలోనున్న సౌందర్య పిపాస ఇనుమడించినది. చిత్రకళాసంస్థకు కార్య

దర్శిగానూ, తదుపరి ఉపాధ్యక్షునిగానూ విశేష కృషి చేయసాగాను. పలువురు అజ్ఞాత చిత్రకారుల ప్రతిభను లోకమునకు చవిచూపే సదవకాశం లభించినది నా కప్పుడు.

ఒకనాడు, ఎవరో అన్నారు: "ఇంత చేస్తున్నావు, ఇంత చెపుతున్నావు, నీవు ఏవైనా బొమ్మలను చిత్రించావా?" అని. లేదు.

ఆ మధ్యాహ్నమే బజారుకు వెళ్ళి ముప్పావలాపెట్టి ఒక కలర్ బాక్స్ కొనుక్కున్నాను. సాధారణ కాగితంపైన బొమ్మగీసి రంగులు వేశాను. నా కృషికి నేనే ఆశ్చర్యపోయాను! రెండుచెట్లు; ఎదుట, ప్రవహిస్తున్న నది; దూరాన పర్వతశ్రేణి; వినిర్మలాకాశాన మబ్బుతునుక. చక్కగానే కుదిరింది బొమ్మ. ఆ బొమ్మ తరువాత ఇంకో బొమ్మ – ఆ తర్వాత ఇంకో బొమ్మ; ఇలా ఇదే వ్యాపకమైంది – తతిమ్మా అన్నిపనులూ మాని.

ఊరికెళుతూ మా బావ రైలుస్టేషన్‌లో బుక్‌స్టాల్ వద్ద పుస్తకాలు చూస్తూ ఖరీదైన కలర్ బాక్స్‌చూసి అది కొని నాకు బహుమతి చేశాడు. ఇంటికివచ్చి కుంచెతో రంగులుకలిపాను. ఏమిరంగులు! ఏమి రంగులు!! అరచేతిలో హరివిల్లు!! ఇంకేమి కావాలి!

ఒక వారం పదిహేనురోజులు పాటుపడి, నే చిత్రించిన ఐదారు బొమ్మలనూ తీసుకు వెళ్ళి ఆప్తస్నేహితుడు దేవీప్రసాద్ రాయ్‌చౌధురీకి చూపాను భయపడుతూ, భయపడుతూ. చౌధురీ వెంటనే తన కుంచె, కాగితము తీసుకుని చూపారు నేను చిత్రించిన బొమ్మలు నిజమైన చిత్రకారుడు ఎలా చిత్రించాలో. నా 'తామరపూవులకు' ప్రతిగా వేయిరెట్లు అందమైన ఆయన 'తామరపూవులు,' నా 'ఆదర్శజీవి'కి ప్రతిగా లక్షరెట్లు అందమైన ఆయన 'ఆదర్శజీవి' – ఇల్లా ఆయన

చిత్రించి చూపారు ఎన్నో బొమ్మలు నా కొరకు. స్నేహితులు దేవీ ప్రసాద్ రాయ్‌చౌధురీ నాకంతట గురుతుల్యులై చిత్రకళారచనలో క్రమపద్ధతిని బోధించారు. ఆయన ఋణము నే నెన్నటికీ తీర్చుకోలేను.

ఏడాది ఐనాక నేను చౌధురీవద్దకు తీసుకుని వెళ్ళిన 'ఆలోచన' అనే బొమ్మనుజూచి "ఇక నావద్ద నీవు నేర్వవలసినది ఏమీలేదు. ఇక స్వయంకృషివల్లనే నీవు చిత్రకారుడువు కాగలవు!" అన్నారు. అది వారి ఆశీర్వచనము.

ఆమధ్య పెద్దమనుష్యులు నలుగురువద్దకు వెళ్లి ఒకొక్కరినీ ప్రశ్నించాను: "మీ జీవితపరమావధి ఏమిటి?" అని. ప్రతిభావంతులు, అనుభవజ్ఞులు, కార్యసాధకులు, ధర్మశీలురు వారు నలుగురూ నాలుగు విధాలా చెప్పారు. వారివద్ద సెలవుదీసుకొని ఇంటికివస్తూ, నన్ను నేనే ప్రశ్నించుకున్నాను జీవితపరమావధి ఏమిటని. ఏవేవో సమాధానాలు స్ఫురించాయి. ఇల్లుజేరి, బల్లపైన చూచాను శ్రీరంగంనుంచి స్నేహితుడు వ్రాసిన ఉత్తరము :

"మీరు వచ్చి వెళ్ళి ఎన్నో నెలలైనా మీరు తెచ్చి ఇచ్చిన గులాబీపువ్వుల పరిమళము ఇంకా వీస్తూనే ఉన్నది" అని స్నేహితుడు వ్రాశాడు.

అవును; నూతన వధూవరులు, వారి కొత్తకాపురం చూసి వద్దామని శ్రీరంగం వెళ్లాను. స్టేషన్‌నుంచి తిన్నగా పూలతోటలోకి వెళ్ళి ఒక సజ్జనిండా గులాబీపువ్వులు నింపుకొని వారింటికి వెళ్ళాను. పూలకానుకను అందుకొని అతనూ శాంతా చాలా సంతోషించారు. ఒకరిముఖంకేసి ఒకరు చూచుకొని ఎంతో మురిసిపోయారు. "ఒకొక్క పువ్వూ ఒక కోరిక, మీ ఇరువురికోరికా తప్పక ఫలిస్తుంది" అన్నాను.

ఆమె అతనివైపు సాభిలాషగా, ఎంతో విలాసంతో చూచి చిరునవ్వు నవ్వింది.. ఇద్దరూ ఆనందంతో ఉప్పొంగిపోయారు. వారి ఆనందమే నా ఆనందము.

ఇది జరిగి ఆరునెలలైనా, ఇంకా ఆ పువ్వుల పరిమళమువీస్తూనే ఉన్నదట వారి హృదయాలలో !

ఇదేనా నా జీవిత పరమావధి ? ఆనందాన్ని పంచిపెట్టడమేనా నా లక్ష్యము ?

కాని, ఆనందం పంచిపెట్టడానికి నే నెవర్ని ? నేను మాత్రము సంపూర్ణమైన ఆనందానుభూతిని పొందగలుగుతున్నానా ? ఎన్ని పర్యాయాలు చిన్న విషయాలకూ, పెద్ద విషయాలకూ కలతపెట్టుకుని మనస్సు పాడుజేసుకోలేదు ! ఎంత బాధపడ్డాను ఒకొక్కప్పుడు ! ఎంత ఆశాభంగము, ఎంత నిరాశ, ఎంత నిస్పృహ !

మన చేష్టలపై మనకు ఒక కొంత అధికారము ఉండవచ్చును. కాని, మనలను అనుసరించినవారు ఎంతదగ్గరివారైనా వారి చర్యలపైన మన కేమి అధికారమున్నది? వారు తలపెట్టిన పద్ధతి మన కెంతో బాధ కలిగిస్తుంది అని తెలిసి తెలిసీ వారు ఆ పద్ధతినే అవలంబిస్తే గతి యేమిటి ? బాధపడడమే !

ఐతే ఎప్పుడో నాన్నగారివద్ద నేను నేర్చిన గుణపాఠంవల్లనో ఏమో, 'శతపత్రపత్రనిక్షిప్త జలబిందువు'లా అంటీఅంటకుండా ఉండిపోయి ఈ బాధ నేనుకాదు అనుభవిస్తూంట, నా పేరుగల మరో వ్యక్తి అనుకుంటూ ఉంటాను ఇప్పుడిప్పుడు :

These things are not happening to me...
They touch a remotely related Ego bearing only the name by which I am known.
The gnawing, gnawing pain of Hope defeated, and
The piercing agony of the irrevocable hurt the other being;
I only watch the suffering, in powerless aloofness.

కాని, అర్ధరాత్రిని నిశాచర భూతగణము గుమిగూడినప్పుడు, అద్దఃములోవలె నా నిజరూపమును నేను చూచుకున్నప్పుడు మాత్రము, వేయి గాలాలతో పొడుచుకున్నట్టు ఉంటుంది, ఆ బాధ. సప్తసముద్రాలూ కట్టతెంచుకు పెల్లుబికివచ్చే ఆ కన్నీటితరంగాలను ఆప శక్యం గాదు మనుష్యులకుగాని, దేవతలకుగాని. ఆ భగ్నహృదయ వినిర్గత ఆక్రోశాన్ని మాటుపరుపలేదు ఏశక్తిన్నీ! కాని, మళ్ళీ అనుకుంటాను: ఈ బాధ నేనుగాదు అనుభవిస్తూంట, నా పేరుగల మరెవరో!

But, at dead of Night,
When the wandering ghosts are met for their weird tryst,
I face my mirror-image
To be tortured by more than physical pain;
Now, no power on Earth (or in Heaven)
Can stop the sudden avalanche of unleashed tears
Or silence the piteous wail of an agonised Soul !
Yet, these things are not happening to me...

ఆలోచించినకొద్దీ మనస్సు తత్వచింతలో పడుతుంది. 'తత్వమసి' వట్టి ఊతపదంకాదు; ఎంతో అర్థమున్నది ఆ ఒక్క-మాటలో. ఉపనిషత్సారమును ఆస్వాదిస్తూ, అన్నిమతముల భావమూ తెలుసుకోయత్నించాను. ఉపనిషద్వాక్యాలూ గీతా సువచనమూ నన్ను ఎంతో ఎక్కువగా ఆకర్షిస్తాయి. జీసస్ వ్యక్తిగత జీవితము, బుద్ధుని సాధన, నన్ను భక్తిపారవశ్యుణ్ణిచేస్తాయి. కేవలం మానసికంగా ఆలోచిస్తే శంకరుని

అద్వైతవాదన ఎంతో సహేతుకంగా కనిపిస్తుంది. మన ద్వైతసిద్ధాంతాలకు ఎంతో సన్నిహితంగా ఉంటుంది నేటి పాశ్చాత్యులను వింతగా ఆకర్షిస్తూన్న ఎగ్జిస్టెంటలిజమ్. కాని, ఒక ఆయుఃపరిమాణము చాలా, ఈ వివిధ మతములనూ సమన్వయించుకోడానికి ?

అది అలా ఉండగా, తరుచు నా మనస్సు ఒకవైపు చూపుతూ ఉంటే, హృదయం మరోవైపు లాగుతూ ఉంటుంది. మనస్సుకూ హృదయానికీ సంఘర్షణ వచ్చినప్పుడల్లా హృదయమే జయిస్తుంది. ఇక తత్వచింత ఎలా సాగుతుంది ?

ఐతే, మహాత్ముడు నడచి పునీతముచేసిన నేలపై మసలుతూ ఉండడమువల్ల అతి సులభగ్రాహ్యమైన సత్యము ఇట్టే గోచరిస్తుంది. మానవుని లక్ష్యము సంపూర్ణ మానవత్వమే! తోటిమానవుని నన్నుగా భావించుకోగలిగితే ఇక మతములెందుకు, మహిమలెందుకు! 'ఆత్మవత్సర్వభూతాని'- ఇది నావంటివాడు సైతము సాధింపగల విషయమే అనుకుంటాను.

నా దృష్టిలో అందరూ నావారే. ముఖ్యంగా, కీర్తికోసం కాదు- పదవికోసంకాదు- తాము నమ్మిన ఆశయంకోసం, సర్వమూ ధారపోయడానికి వెనుదీయనివారు నాకు ఆత్మీయులు. వారే నేను; నేనే వారు. అందువల్లనే కాబోలు, ఆధునిక ఆంధ్ర నవలారచనలో మేటి యని పేరుపొందిన స్నేహితుడు, 'బుచ్చిబాబు' తన గ్రంథాన్ని నాకు అంకితమిస్తూ నన్ను 'సౌందర్యంకోసం సౌకర్యం త్యాగం చేయగల సాధకుల ఆప్తుడు, కళాజీవి' అని వర్ణించాడు. అంతులేని ఆపేక్షవల్ల ఈ వర్ణనలో కొంత అతిశయోక్తిఉన్నా, లవలేశమైనా సత్యముంటే ఇక కావలసినదేమున్నది !

★

# ప రి చ య ము

అపురూపమైన ఈ లోకపు మహోత్సవములో
పాల్గొనమని నన్ను ఆహ్వానించావు.
నా జన్మ తరించింది; ఉత్సవాన్ని కళ్ళారా చూచాను;
ఆనందగీతమును చెవులారా విన్నాను.
ఈమహోత్సవములో నా వాద్యమును
నాచేతనైనంత అందముగా వినిపించాను....

రవీంద్ర

"మీ 'సాగుతున్నయాత్ర' చదువుతూంటే, నా అరవై ఏండ్ల జీవితాన్ని పునశ్చరణచేసినట్టు ఉంటుంది. మీ యాత్రలో నేనూ మీతోకూడా ప్రయాణంచేస్తున్నాను" అని, ఒక విదుషీమణి వ్రాశారు, ఆంధ్రప్రభలో వారంవారం కనిపించిన నా వ్యాసాలను చదువుతూ. ఇలాగే తెలుగుదేశమంతటా పిన్నలూ పెద్దలూ ఈ వ్యాసాలకోసం ఎంతోగా ఎదురుచూస్తూ, వానిని చదువుతూ ఆనందిస్తూన్నట్టు తెలియవచ్చింది.

జీవితంలో కొన్ని కొన్ని శుభములు మనము ఎంత ప్రయత్నించినా అవి చేకూరవు. ఉన్నట్టుండి, ఒకానొక మంచి ముహూర్తాన, అయాచితంగా, మన ఒడిలో ఊడిపడుతుంది, మనము కలలోనైనా ఆశింపని వరప్రసాదము! ఈ తీరుగా, రవీంద్రశతవార్షికోత్సవ ప్రత్యేకాధికారిగా ఆంధ్రదేశమంతటా పర్యటిస్తూ ఆ మహనీయుని దివ్య సందేశాన్ని, పట్టణాలలోవారికీ, పల్లెలలోనివారికీ కూడా అందజేసే మహాభాగ్యము కలిగినది, నాకు, ఇటీవలనే. ఈసందర్భములో నే వెళ్ళిన ప్రతిచోటా స్త్రీలూ పురుషులూ పెద్దవారూ చిన్నవారూ కూడా నన్ను 'స్మృతిపథాల జానకిరామ్' అనీ 'సాగుతున్నయాత్ర జానకిరామ్'

అనీ గుర్తించడము నాకు అపరిమితమైన ఆనందాన్ని కలిగించింది. వారితో కలిగిన అనిర్వాచనీయమైన ఆత్మీయతాభావమూ వర్ణింప నలవికాని ఆప్యాయతా నా జీవితానికి మెరుగులు దిద్దినవి అనడము అతిశయోక్తి కాదు.

ఒకరన్నారు: "ఆమధ్య, నేనూ మావారూ ఒక పెద్ద పూల తోటకు వెళ్లాము. ఒకవైపున అతి విశాలమైన గులాబీవనము; మరో వైపు మైళ్ళపర్యంతమూ చేమంతితోట – వెంటనే, మీరు జ్ఞాపకము వచ్చారు. మీకు పువ్వులంటే చాలా ఇష్టముగా!" అని. ఈవిధంగా, అనేకుల హృదయాలలో రమ్యమైన సౌందర్యానుభూతితోసహా నన్ను గురించిన జ్ఞాపకమూ మిళితమై ఉండడము నా అదృష్టము. నా ఆత్మ కథా వ్యాసములద్వారా నాకు లభించిన అమూల్యమైన కానుక.

అసలు ఈ వ్యాసాలు ఎలా అవతరించాయో వానిని ఏరీతిగా ఆంధ్రప్రభ ద్వారా ఆంధ్ర పాఠకలోకానికి అందజేయగలిగానో 'నా స్మృతిపథంలో' ని పరిచయవాక్యాలలో వివరించాను. ఈ సందర్భంలో మిత్రులు శ్రీ నార్ల వేంకటేశ్వరరావూ, శ్రీ నీలంరాజు వేంకట శేషయ్యా నాకిచ్చిన సహకార ప్రోత్సాహములు మరువరానివి. వారితోటి స్నేహము నిత్యానందకరము.

'నాస్మృతిపథములో' లాగే, ఈ 'సాగుతున్నయాత్ర' మొదటి ప్రతిన్నీ కైలాసవాసి ఐనా, మన అందరి హృదయమందిరములలోనూ నిత్యనివాసమేర్పరుచుకున్న నెచ్చెలి కొంపెల్ల జనార్దనరావుకు అందిస్తున్నాను చంద్రునకో నూలుపోగుగా. అతడు మనస్ఫూర వాంఛించిన ఆశయాన్నే ఈ నా రచనలద్వారా కొంతవరకైనా సాధింపకలుగుతున్నానేమో అనే సంతుష్టి నా కెంతో ధైర్యాన్నిస్తూంది.

ఆచంట జానకిరామ్

చిలుకలు కొరికిన పండొక్కటి
చేతులబడె నోదేవా,
తెలియు నెట్లు తీయనిదో విషమో
తినకుండగ నోదేవా !
త్రోవ బోవుచుండ దండవీడిన
పూవొకటి దొరికె నోదేవా
తావి కమ్మనిదో తలనొప్పిడునో
యేవిధి తెలియును దేవా !!

బసవరాజు అప్పారావు

"ఏ వారు ఎవరి అబ్బాయిలు ?"
"ఆచంట లక్ష్మీపతిగారి అబ్బాయిని."
"అన్నదమ్ములు ?"
"ఇద్దరము."
"అప్పచెల్లెళ్లు ?"
"ఒక అక్కగారు, నలుగురు చెల్లెళ్లు."
"వారికి పెళ్లిళ్లయినాయా ?"
"ఒక చెల్లెలికి పెళ్ళయినది."
"మీ ఉద్యోగం ?"
"ఇన్సూరెన్సు కంపెనీ సెక్రటరీగా ఉంటున్నాను."
"మీ జీతము ?"

–ఇంతవరకూ ఓపికతో సమాధానాలు ఇస్తూన్న నేను ఈ ప్రశ్నకు రిచ్చపడ్డాను. "నా జీతమెంతైతే నేమి ?" అన్నాను, కొంచెం కటువుగానే.

పాపము ! ఆ బ్రాహ్మడు తెల్లబోయాడు. ఏదో అనబోయి, ఏమీ అనకుం డానే, కిటికీలోంచి బయటకు చూస్తూ ఉండిపోయాడు ఆయన.

ఆఫీస్ పనిమీద ఏలూరు వెళ్ళివస్తున్నాను. 1934 లో ఒకనాటి ఉదయం. నూజివీడు స్టేషన్‌లో ఎక్కారు, ఇద్దరు లాయర్లు, నేనున్న కంపార్ట్‌మెంట్ లోకి వారిలో కాస్త పెద్దఆయన నామీద ప్రశ్నలవర్షం కురిపిస్త. ఆయనతో అల్లా కటువుగా ఉన్నానని మనస్సులో బాధగానేఉంది.... కృష్ణా పత్రిక చదువుతూ కూర్చున్నాను.

గన్నవరం స్టేషన్‌లో ఆయన దిగిపోయారు. దిగుతూ దిగుతూ ఆ రెండో లాయర్‌వైపు చూచి చిరునవ్వు నవ్వుతూ "వెళ్లొస్తానోయి పట్టాభిరామయ్యా !" అన్నారాయన. రైలు కదిలాక పట్టాభిరామయ్యా నా వైపు చూస్తూ, ఎంతో స్నేహ భావంతో అన్నారు :

"నేను చెరుకుపల్లి పట్టాభిరామయ్యను. నన్ను మీరు ఎరుగరుకాని, నేను మిమ్మల్ని యెరుగుదును. క్లబ్‌కి వస్తూంటారు మీరు. పైగా నా స్నేహితుడు గుడి పాటి వెంకటచలం కూడా తరుచు చెపుతూ ఉంటాడు మిమ్ములను గురించి..."

"అల్లాగా! చాలా సంతోషం. వెంకటచలం నాకు ఆప్తుడు" అన్నాను నేను.

"ఆ దిగి వెళ్ళారే ఆయన సూర్యనారాయణ. చాలా మంచివారు. మిమ్మల్ని అనవసరప్రశ్న లడిగి చికాకు పరుపాలని ఆయన ఉద్దేశ్యంగాదు. మిమ్మల్ని చూడ గానే మీతో పరిచయం కలుగజేసుకోవాలనే ఆసక్తితో ఆయన అలా ప్రశ్నించారు, అంతేగాని, మీ వ్యక్తిత్వానికి భంగం కలిగించాలని కాదు—"

నేను ఆయన మాటలకు అడ్డమువచ్చి "ఆయన కుటుంబవిషయాల గురించి ఆయనను అడుగలేదుగా నేను!" అన్నాను.

"మీరు తప్పకుండా అడిగి ఉండవచ్చు; ఆయన సంతోషంతో సమాధానం చెప్పి ఉందురుకూడ. మేము కాస్త పూర్వకాలము వారము; మీరు కాస్త పాశ్చాత్య

సంప్రదాయముల మధ్య పెరిగిన వారు. ఆ సంప్రదాయంలో సమష్టి జీవనంకంటే వ్యక్తిగత జీవనానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. మనసంప్రదాయ మదికాదు. అందరూ ఒకటే మనకు. ఒకరికష్టాలు ఒకరు పంచుకోయత్నిస్తారు. ఒకరిపైన ఒకరు ఎంతో ఆధారపడి ఉంటారు. మీకు తెలుసునో, తెలియదో, మన ఊళ్ళల్లో అనగా మన పల్లెల్లో ఎవరింటైనా పెండ్లి జరిగితే ఊరిలోని బ్రాహ్మణ్యమంతా-ఆబాలగోపాలమూ- ఆ ఐదురోజులూ పెండ్లివారింటనే భోజనాలూ, ఫలహారాలూనూ. ఏఇంటిలోను వేరే పొయ్యి రాజయ్యకూడదు. అన్ని ఇళ్ళవారూ పూనుకుని ఆ శుభకార్యం తమ ఇంటిలో శుభకార్యమనే పాటించి, దిగ్విజయంగా సాగిస్తారు. ఇలాగే అన్ని విషయాలూ. నేను బి. ఏ., బి. ఎల్. ప్యాసయ్యానంటే మా ఒక్క కుటుంబానికే కాదు గౌరవం; మా ఊరు ఊరందరిదీనూ ఆగౌరవం...''

అంటూ, ఆ ధోరణిని చెప్పసాగారు పట్టాభిరామయ్య. నేను చాలా సిగ్గుపడిపోయాను, నాఒంటెత్తు గుణానికి. తరువాత తరువాత నాకు ఆయన ఆప్తస్నేహితులయారు. నే నాయనకు ఒక కొంత సాయపడ్డాను అవకాశము కలిగి; ఆయన నాకెంతో సాయపడ్డారు. రైలులో కలిగిన ఈ మా మొదటి పరిచయమును గురించి ఆయన మరచిపోయి ఉండవచ్చు, ఈ పాతిక ఏళ్ళలోనూ. కాని, నేను మరచిపోలేదు. నా జీవితదృక్పథంలో అతిముఖ్యమైన ఒకభావనకు దోహదమిచ్చింది వారి బోధన. "వసుధైక కుటుంబమ''నే ఇప్పటి నా దృఢ విశ్వాసానికి త్రోవ చూపినవి అప్పు డాయన అంత మనఃపూర్తిగా ఆడిన మాటలు.

ఇది జరిగిన కొన్ని నెలలకు నేను మళ్ళా. ఓ రాత్రి, రైలులో వెళుతూ ఉండగా, ఒక ముసలిరైతు నాతో ప్రస్తావింప మొదలుపెట్టాడు. "బాబూ! ఎందాకా వెళుతున్నారు ?'' అనే అతనిప్రశ్నతో ప్రారంభించిన మా సంభాషణ కంపార్ట్మెంట్‌లో తతిమ్మావారంతా నిద్రించాక కూడా చాలా రాత్రి వరకూ సాగింది. అతని పొలం విషయం, కూతుళ్లూ, కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ- వీరి విషయం, దూడలవిషయం, ఎన్నో వివరాలు తెలుసుకున్నాను. నా సంగతీ సవిస్తరంగా చెప్పాను. అతను అడిగినవిషయాలూ అడుగనివిషయాలూ కూడా ఏమినహాయింపూ లేకుండా. నే నసలు పల్లెటూరి వాడననీ, పాడిపంటలు గురించీ,

పాపము! ఆ బ్రాహ్మడు తెల్లబోయాడు. ఏధో అనబోయి, ఏమీ అనకుండానే, కిటికీలోంచి బయటకు చూస్తూ ఉండిపోయాడు ఆయన.

ఆఫీస్ పనిమీద ఏలూరు వెళ్ళివస్తున్నాను. 1934 లో ఒకనాటి ఉదయం. నూజివీడు స్టేషన్‌లో ఎక్కారు, ఇద్దరు లాయర్‌లు, నేనున్న కంపార్ట్‌మెంట్‌లోకి వారిలో కాస్త పెద్దఆయన నామీద ప్రశ్నలవర్షం కురిపిస్త. ఆయనతో అల్లా కటువుగా ఉన్నానని మనస్సులో బాధగానేఉంది.... కృష్ణా పత్రిక చదువుతూ కూర్చున్నాను.

గన్నవరం స్టేషన్‌లో ఆయన దిగిపోయారు. దిగుతూ దిగుతూ ఆ రెండో లాయర్‌వైపు చూచి చిరునవ్వు నవ్వుతూ "వెళ్లొస్తానోయి పట్టాభిరామయ్యా!'' అన్నారాయన. రైలు కదిలాక పట్టాభిరామయ్యా నా వైపు చూస్తూ, ఎంతో స్నేహ భావంతో అన్నారు :

"నేను చెరుకుపల్లి పట్టాభిరామయ్యాను. నన్ను మీరు ఎరుగరుకాని, నేను మిమ్మల్ని యెరుగుదును. క్లబ్‌కి వస్తూంటారు మీరు. పైగా నా స్నేహితుడు గుడిపాటి వెంకటచలం కూడా తరుచు చెపుతూ ఉంటాడు మిమ్ములను గురించి...''

"అల్లాగా! చాలా సంతోషం. వెంకటచలం నాకు ఆప్తుడు'' అన్నాను నేను.

''ఆ దిగి వెళ్ళారే ఆయన సూర్యనారాయణ. చాలా మంచివారు. మిమ్మల్ని అనవసరప్రశ్న లడిగి చికాకు పరుపాలని ఆయన ఉద్దేశ్యంగాదు. మిమ్మల్ని చూడగానే మీతో పరిచయం కలుగజేసుకోవాలనే ఆసక్తితో ఆయన అలా ప్రశ్నించారు. అంతేగాని, మీ వ్యక్తిత్వానికి భంగం కలిగించాలని కాదు–''

నేను ఆయన మాటలకు అడ్డమువచ్చి "ఆయన కుటుంబవిషయాల గురించి ఆయనను అడుగలేదుగా నేను!'' అన్నాను.

''మీరు తప్పకుండా అడిగి ఉండవచ్చు; ఆయన సంతోషంతో సమాధానం చెప్పి ఉందురుకూడ. మేము కాస్త పూర్వకాలము వారము; మీరు కాస్త పాశ్చాత్య

సంప్రదాయముల మధ్య పెరిగిన వారు. ఆ సంప్రదాయంలో సమష్టి జీవనంకంటే వ్యక్తిగత జీవనానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. మనసంప్రదాయ మదికాదు. అందరూ ఒకచే మనకు. ఒకరికష్టాలు ఒకరు పంచుకోయత్నిస్తారు. ఒకరిపైన ఒకరు ఎంతోఆధారపడి ఉంటారు. మీకు తెలుసునో, తెలియదో, మన ఊళ్ళల్లో అనగా మన పల్లెల్లో ఎవరింటైనా పెండ్లి జరిగితే ఊరిలోని బ్రాహ్మణ్యమంతా-ఆబాలగోపాలమూ- ఆ ఐదురోజులూ పెండ్లివారింటనే భోజనాలూ, ఫలహారాలూనూ. ఏఇంటిలోను వేరే పొయ్యి రాజయ్యకూడదు. అన్ని ఇళ్ళవారూ పూనుకుని ఆ శుభకార్యం తమ ఇంటిలో శుభకార్యమనే పాటించి, దిగ్విజయంగా సాగిస్తారు. ఇలాగే అన్ని విషయాలూ. నేను బి. ఏ., బి. ఎల్. ప్యాసయ్యానంటే మా ఒక్క కుటుంబానికే కాదు గౌరవం; మా ఊరు ఊరందరిదీనూ ఆగౌరవం...''

అంటూ, ఆ ధోరణిని చెప్పసాగారు పట్టాభిరామయ్య. నేను చాలా సిగ్గుపడి పోయాను, నాఒంటెత్తు గుణానికి. తరువాత తరువాత నాకు ఆయన ఆప్తస్నేహితులయారు. నే నాయనకు ఒక కొంత సాయపడ్డాను అవకాశము కలిగి; ఆయన నాకెంతో సాయపడ్డారు. రైలులో కలిగిన ఈ మా మొదటి పరిచయమును గురించి ఆయన మరచిపోయి ఉండవచ్చు, ఈ పాతిక ఏళ్ళలోనూ. కాని, నేను మరచిపో లేదు. నా జీవితదృక్పథంలో అతిముఖ్యమైన ఒకభావనకు దోహదమిచ్చింది వారి బోధన. "వసుధైక కుటుంబమ''నే ఇప్పటి నా దృఢ విశ్వాసానికి త్రోవ చూపినవి అప్పు డాయన అంత మనఃపూర్తిగా ఆడిన మాటలు.

ఇది జరిగిన కొన్ని నెలలకు నేను మళ్ళా. ఓ రాత్రి, రైలులో వెళుతూ ఉండగా, ఒక ముసలిరైతు నాతో ప్రస్తావింప మొదలుపెట్టాడు. "బాబూ! ఎందాకా వెళుతున్నారు?'' అనే అతనిప్రశ్నతో ప్రారంభించిన మా సంభాషణ కంపార్ట్మెంట్‌లో తతిమ్మావారంతా నిద్రించాక కూడా చాలా రాత్రి వరకూ సాగింది. అతని పొలం విషయం, కూతుళ్లూ, కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ- వీరి విషయం, దూడలవిషయం, ఎన్నో వివరాలు తెలుసుకున్నాను. నా సంగతీ సవిస్తరంగా చెప్పాను. అతను అడిగినవిషయాలూ అడుగనివిషయాలూ కూడా ఏ మినహాయింపూ లేకుండా. నే నసలు పల్లెటూరి వాడననీ. పాడిపంటలు గురించీ,

సేద్య విషయాలను గురించీ నాకూ ఎంతో కొంత అనుభవమున్నదనీ తెలిసి అతను పరమానందభరితు డయ్యాడు. ఏదో మాటవచ్చి, పూర్తిగా నా వ్యక్తిగత జీవితానికిసంబంధించిన వివరము, తీవ్రమైన ఒక ఆశాభంగము- తీరని ఒక లోపమును గురించి అతనితో నేను మనస్సు విప్పిచెప్పగా నా కొరకు అతను చాలా చింతించాడు. కాని, ఆ తత్వవేత్త నాకు కొండంత ధైర్యము చెప్పాడు. "అన్నిటికీ ఆ పరమేశ్వరుడే ఉన్నాడు నాయనా ! మంచివారి కెప్పటికైనా మంచే చేకూర్చక మానడు !'' అన్నాడు. ఆ ముసలిరైతు స్వగ్రామం బెజవాడకు సమీపాన ఉన్న తోట్లవల్లూరు. తోట్లవల్లూరులో డాక్టర్‌గా ఉన్న తాడిమళ్ల గంగరాజు నాకు దగ్గర బంధువనీ, చిన్ననాటి స్నేహితుడనీ తెలిశాక, అతనిసంతోషానికి మేరలేదు. "ఇంత దగ్గరవాడవా, నీవు, నాయనా, మాకు: ఎవరవో ననుకున్నా!'' అని, పోలవరంలో ఉన్న తన కడసారి కుమార్తెను పురుటికి వల్లూరు తీసుకురావడానికి వెళుతూన్న తాను తిరిగి స్వగ్రామంచేరాక, అనగా, ఒక వారంరోజులలో, నేను తప్పక వాళ్ళ ఊరు రావాలి అన్నాడు. "డాక్టర్‌గారు మా దొడ్డమనిషి. మిమ్మల్ని పదిరోజులైనా తమతో ఉంచుకోనిదే వెళ్లనియ్యడు. మీరున్న అన్నిరోజులూ పాలూ పెరుగూ కూరగాయలూ మా ఇంటినుంచే పంపిస్తాము. కర్రావు ఈనే రోజులు కూడా; జున్నుపాలు కూడా పంపుతాను; జున్ను నీ కిష్టమా బాబూ ?'' అన్నాడు ఆ వృద్ధు.

నేను దిగవలసిన నిడుదవోలు స్టేషన్ వచ్చింది. ఎంతో అయిష్టం మీద, విడువలేక, విడువలేక, అతనిని విడిచి వెళ్ళాను. ఇది జరిగి పాతికేళ్లయినా అతని అమాయకత్వమూ, అతని ఆప్యాయతా అలా శాశ్వతంగా ఉండిపోయాయి నా మనోవీధిని.

ఆ రోజులలో బెజవాడలో సాంఘికంగా ఎంతో కృషిచేస్తున్నారు బారిష్టర్ తుర్లపాటి వేంకటేశ్వరరావూ. ఆయన భార్య రాజేశ్వరమ్మా. వీరిని నేను చిన్నప్పటినుంచీ ఎరుగుదును. బారిష్టర్ పరీక్షకు చదువుతూ ఆయన డబ్లిన్‌లో ఉండగా, ఆమె పుట్టింట, అనగా, మా స్వగ్రామమైన మాధవరంలోనే రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా ఉన్న తండ్రిగారిఇంట ఉండేది. వారు మా ఇంట్లోనే ఒక భాగాన కాపురముండేవారు. పేరుకు రెండు కాపురాలుగాని, వారూ మేమూ ఎంతో కలసి మెలసి

ఉండేవారము. ఆమె కడసారి తమ్ముడు సూర్యప్రకాశరావు మా తాతగారి బొజ్జపైన గాని నిదురపోయేవాడుకాదు. నేను మూడు పూటలూ రాజేశ్వరమ్మతో కబుర్లు చెపుతూ వారి ఇంటనే అన్నము తినేవాడను. అస్తమానం ఆమెతో ఈమాటా ఆ మాటా మాట్లాడుతూ ఉండేవాడను. నాకు పదేళ్ళ వయస్సు. ఆమెకు పద్దెనిమిది ఏళ్ళకు లోపు. ఐనా, దూరదేశాన ఉన్న తన భర్త తనకు వ్రాస్తున్న ఉత్తరాలలోని విశేషాలు నాకు చదివి వినిపించేది ఆమె. భర్త స్వదేశానికి వచ్చాక తామిద్దరూ కలసి చేయదలచిన సంఘసేవను గురించి ఎంతో ఉత్సాహంతో చెపుతూ ఉండేది ఆమె నాతో.

వారు అనుకున్నట్టుగానే, బెజవాడలో ఆయన ప్రాక్టీస్‌పెట్టినాక, వారిద్దరూ కలసి ఆదర్శరీతిని సంఘసేవ చేయనారంభించారు. అన్నివిధాలా ఉత్తమ గృహస్థులనే పేరు తెచ్చుకున్నారు. వేసేవిస్తరీ తీసే విస్తరీ సదా వారింట. అన్నీ ఎంతో చక్కగా అమరిఉండేవి వారింటిలో. కచ్చేరి సావడిలో బారిష్టర్‌గారు కోర్టు విషయాలు చూస్తూ, పురజనుల లైబ్రరీ విషయాల గురించి శ్రమపడుతూ ఉండగా, లోపల ఇంటిపనులన్నీ చూస్తూ రాజేశ్వరమ్మ మహిళాసభ విషయాలూ హరిజన బాలికా శరణాలయ విషయాలూ, ఇంకా ఏవో ఏవో సంఘసేవ సంబంధమైన అత్యవసరమైన విషయాలు చూస్తూ ఉండేవారు. గవర్నరైనాసరే, కాంగ్రెస్ అధ్యక్షులైనాసరే బెజవాడవస్తే తుర్లపాటివారికి తెలియందే ఏ విషయమూ జరుగదు. కలెక్టరూ వీరిసలహా, సహాయం పొందేవారు. కాంగ్రెస్ సంఘమువారూ వీరి సలహా, సహాయం పొందేవారు. ఆ ఊళ్లో, ఆ రోజులలో సాంఘికంగా కాని, రాజకీయంగా కాని, ఆధ్యాత్మికంగాకాని, పారమార్థికంగాకాని ఏ ఉద్యమం తలయెత్తినా, అది ఆ దంపతు లిద్దరి సంపూర్ణమైన తోడ్పాటుతో జరుగవలసిందే!

అటువంటివారి ఇంట ప్రవేశించాను నేను, ఢిల్లీనుంచి బెజవాడవచ్చీ రావడముతోనే. వారిని నేను కలసికొని ఎన్నో ఏళ్లు ఐనది. కాని, ఇన్నాళ్లూ అడుగడుగునకూ వారు నన్నుగురించి నాన్నగారిని అడిగి తెలుసు కుంటూనే ఉన్నారు. ఇప్పుడు ముఖాముఖి నా సంగతంతా తెలుసుకొన్నారు. ఢిల్లీలోఉన్న మా అక్కగారిని గురించీ, బెంగుళూరులో ఉన్న మా చెల్లెలినిగురించీ మరీమరీ అడిగారు

నన్ను వారింటిలోనే ఉండిపొమ్మన్నారు. నివాసము వేరైనా, ఎల్లప్పుడూ వారింటనే మసలుతూ ఉండేవాడను నేను. "కలెక్టర్‌గారి అమ్మాయి పుట్టినరోజు ఇవ్వాళ; ఆ పిల్లకు ఏమి కానుక ఇస్తే బాగుంటుంది చెప్పవూ ?" అని అడిగేవారు ఒకసారి ఆమె. "రైల్వేడాక్టర్ ఈవెన్, ఆయన భార్య, సాయంత్రం టీకి వస్తున్నారు మన ఇంటికి ఈ కిటికీ తెరలు బాగాలేవు; ఇవి తీసివేసి ఎటువంటి తెరలు వేస్తే బాగుంటుంది ?" అని అడిగేవారు ఒకప్పుడు నన్ను. "నాగపూర్‌లో జరుగుతున్న అఖిల భారత మహిళా సభలో ఆంధ్రదేశపు మహిళాసంఘాల తరపున నేను మాట్లాడాలి, నాకు తోచిన మాటలు వ్రాశాను. ఈ ఉపన్యాసం సరిజూసి పెట్టవా?" అనేవారు ఒకప్పుడు, రాజేశ్వరమ్మగారు. అన్ని విషయాలలోనూ సమర్థత అలవరచుకోవాలని ఉండేది ఆమెకు. గొప్ప కార్యనిర్వాహకురాలు ఆమె. సహచరులలో విపరీతమైన కార్యదీక్ష ఆవహింపజేసేవారు. ఆమె నిరంతర కృషివల్లనే బెజవాడలో చక్కని భవనముతో గొప్ప మహిళాసమాజము వెలసి బాలికలకూ స్త్రీలకూ ఉన్నత విద్య అభ్యసించడానికి అద్భుతమైన అవకాశము కలిగినది. తీరికసమయాలలో అనవసరమైన "పెత్తనాల" తో కాలము వృధాపుచ్చక, తమకు మానసిక వికాసమూ ఆహ్లాదమూకలిగించే ఉత్తమ వ్యాపకాలలో నిమగ్నులు కాసాగారు ఆఊరి స్త్రీలు రాజేశ్వరమ్మ ప్రోత్సాహమున. ఆమె ధన్యజీవి. కీర్తిశేషురాలైన ఆమె సేవను ఎన్నటికినీ మరువరాదు ఆ ఊరివారూ ఆంధ్రవనితాలోకమూ.

నేను ప్రతిరోజూ టెన్నిస్ ఆడటానికి విధిగా జింఖానా క్లబ్‌కు వెళుతూ ఉండేవాడను. బెంగుళూరులో అలవాటైన టెన్నిస్‌ఆటలో తిరిగి నిమగ్నుడనైనాను. క్లబ్‌లో డాక్టర్ చాగంటి సూర్యనారాయణ, పాటిబండ అప్పారావు, ఆయన సోదరులు సుందరరావు, శివరామకృష్ణ— ఇటువంటివారి పరిచయం కలిగింది. వీరికి సాహిత్య విషయాలలోనూ ఎంతో అభిరుచి అంచేత మాపరిచయం క్లబ్‌లో తటస్థమయ్యే ముఖపరిచయము మాత్రమేగాక క్రమేణా స్నేహంగా పరిణమించింది. వీరితో కూడా మరో లాయరూ క్లబ్‌లో కనిపిస్తూ ఉండేవారు, ఆయన లాయరైనా దుస్తులు కోరా ఖాదీ దుస్తులు. ముఖాన ఇంత కుంకుమబొట్టు, పళ్లు కాస్త ఎత్తు; నవ్వుమొఖము. మనిషిలోనూ, మాటతీరులోనూ సౌజన్యం వెల్లివారుతూ ఉండేది.

ఎప్పుడూ నవ్వుతూ ఉండేవారు ఆయన. అందరితోనూ అతి చనువుగా మాట్లాడే వారు. ఎక్కువగా సాహిత్య విషయమయ్యే ప్రసంగిస్తూ ఉండేవారు. నన్నెవరూ ఆయనకు పరిచయం చెయ్యలేదు కాని ఆయనే నావద్దకు వచ్చి, "మీ తండ్రిగారిని నేను బాగా ఎరుగుదును. మద్రాస్‌లో చదువుకుంటూండగా తరుచు మీ ఇంటికివస్తూ ఉండేవారము. మీ రప్పుడు చాలా చిన్న పిల్లలు'' అంటూ పలుకరించి, మా నాన్న గారిని గురించీ జైలులోఉన్న మా పిన్నిగారిని గురించీ ఎంతో ఆప్యాయతతో కుశలప్రశ్న చేశారు. ఎంతో పూర్వస్నేహితునిగా ఆదరించారు నన్ను. ఆయన పేరు మాత్రము తెలియదు నాకు-అడగాలని తోచలేదు కూడా.

స్నేహితుడు తెలికిచర్ల కృష్ణమూర్తి నాకు ఉత్తరంవ్రాస్తూ, ''బెజవాడ నీకు కొత్తఊరు. ఏమైనా తోస్తోందా? సాహిత్యగోష్టికి ఎవరైనా స్నేహితులున్నారా?" అని అడిగి, ''బసవరాజు అప్పారావును తప్పకుండా కలుసుకోవాలి, నీవు. ఇంత వరకూకలుసుకొని ఉండకపోతే, ఈసారి నేను బెజవాడవచ్చినప్పుడు మిమ్ముల్ని ఇద్దరినీ ఒకరితోఒకరికి పరిచయంచేస్తాను" అని వ్రాశాడు. "బసవరాజు అప్పారా వును నేను ఇంకా కలుసుకోలేదు; ఆయనను నాకు పరిచయంచేయడానికైనా నీవు వెంటనే బెజవాడరావాలి'' అని వ్రాశాను.

కృష్ణమూర్తి వచ్చాడు. వచ్చీరావడముతోనే నా టూసీటర్ కార్‌లో ఎక్కి బసవరాజు అప్పారావు ఇంటికి వెళ్లాము. తలుపు తట్టగానే ఆయన భార్య, కవ యిత్రి రాజ్యలక్ష్మమ్మ తలుపుతీశారు. పనస తొనలు నిండిన వెండి పళ్ళెము చేత బుచ్చుకొని క్లబ్‌లో నేను రోజూచూస్తున్న కుంకుమబొట్టు సౌజన్యమూర్తి నన్ను లోనికి ఆహ్వానించారు, సహజమైన చిరునవ్వుతో. మేము ఒకరి నొకరు ఇంత ఆప్యాయతతో పలుకరించుకోవడము చూచి ఆశ్చర్యపడుతూ కృష్ణమూర్తి అడిగాడు: ''ఇదేమిటి! నీవు అప్పారావును కలుసుకోలేదన్నావుకదా!'' అని.

"వీరిని రోజూ క్లబ్‌లో కలుసుకుంటూనే ఉంటాను. కాని ఈయనే బసవ రాజు అప్పారావు అని నాకు తెలియదు, ఈ నిమిషంవరకూ!'' అన్నాను నేను. అందరమూ నవ్వుకున్నాము.

నాకూ పనసపండు చాలా ఇష్టము. రాజ్యలక్ష్మమ్మ- సౌదామిని- దయతో అమర్చిన ఫలహారం పూర్తిఐనాక అప్పారావును కార్లోఎక్కించుకొని ఏలూర్ రోడ్ వైపు షికారు తీసుకువెళ్ళాము. అక్కడ కాలువగట్టున కార్ ఆపి నీటిఅంచుకువెళ్ళి కూర్చున్నాము.

నా తరపున కృష్ణమూర్తి కోరగా అప్పారావు తన గేయాలు కొన్ని పాడారు- గొంతెత్తి, ఎంతో మనఃపూర్తిగా. కొంతసేపయాక నాకు మిక్కిలిఇష్టమైన పాట వారి చేత పాడించుకున్నాను :

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దు కృష్ణా
జంటగా నను బిల్వాదగదోయీ !
కంటికంతా జలమయుంబై
మింటివరకును నేకరాశై
జంట దొరుకని మహా ప్రళయపు
టింటిలో వటపత్ర డోలిక
నొంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా
జంటగా నను బిల్వాదగదోయీ !
జగము లన్నియు కాలయోనిని
మొగము లెరుగక నిద్రబోవగ
నగుమొగము గల ముద్దు బాలుడ
నగుచు జోలల బాడుకొంటూ
వొంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దు కృష్ణా
జంటగా నను బిల్వా దగదోయీ!

రూపకల్పన విషయంలోనూ భావస్ఫురణ విషయంలోనూ ఈ రచన ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో మహోన్నత పదవి నలంకరించి చిరస్థాయిగా ఉండిపోతుంది. ఆ సాయంత్రం ఆకాశాన మొదటి నక్షత్రం మిణుకు మిణుకు మంటూ ఉండగా గొంతెత్తి గానముచేసిన ఆయన అమరకవియే: నా తన్మయతను గుర్తించి తనే ఇంకో గేయమున్నూ పాడారు అనుకంపంతో హృదయము నిండిపోయే ఆర్ద్రితతో:

లేపనైనా లేపలేదే
మోము
చూపనైనా చూపలేదే.
కోపకారణ మేమొ
యే పాప మెరుగనే!
లేపనైనా లేపలేదే...
హృదయతల్పము పైన
సొదమరచి హాయిగా
నిదురదోగేనన్ను
వదలిపోయేవేళ
లేపనైనా లేపలేదే...
మబ్బు కన్నెల కింత
ఉబ్బు తబ్బిబ్బేలో?
ఆకాశమున కంత
ఆనంద మెందుకో
లేపనైనా లేపలేదే...
మాధవీలత కింక
కుంటి కౌగిలి యేన?

2)

సాగుతున్న యాత్ర

మాపటింతల నింట
దీప మిక వెలిగేన
లేపనైనా లేపలేదే...
ద్వారమా! నాథు
డేదారిబడి పోయెనే?
కన్నిబాబా! నీకు
కలలైన రాలేద
లేపనైనా లేపలేదే!
మోము
చూపనైనా చూపలేదే!

మహాకవి కీట్సు ఇంకా కొన్నేళ్ళు ఉండిఉంటే ఎటువంటి గొప్ప కవిత అవతరించేదో అనడము పరిపాటి. బసవరాజు అప్పారాయకవి కొన్నేళ్ళు మనతో ఉండడానికి మనము నోచుకొని ఉంటే ఇటువంటి అందమైన నగలు ఎన్ని తొడుక్కునేదో మన తెనుగుతల్లి!

ఒకచో నేలను బవ్వళించు, నొకచో
నొప్పారు బూసెజ్జపై,
నొకచో శాకము లారగించు, నొకచో
నుత్కృష్ట శాల్యోదనం
బొకచో బొంతధరించు, నొకొక్కతఱిన్
యోగ్యాంబర శ్రేణి, లె
క్కకు రానీయడు కార్యసాధకుడు
దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

భర్తృహరి : ఏనుగు లక్ష్మణకవి

భర్తృహరి ఈ మాటలు ఇన్సూరెన్స్ ఏజెంట్లకు చాలా చక్కగా వర్తిస్తాయి. భర్తృహరి వివరించిన ఈ గుణాలకు తోడుగా, అపరిమితమైన ఓర్పు ఎంతో మాటనేర్పరితనమూ అవసరము. ఈ సంస్థల పేరే "చావు కంపెనీలు!"

అయితే, ఇన్సూరెన్స్ పద్ధతి సదుపాయాలను గురించి వివరిస్తూ, ఆ మాట ఎత్తడానికి వీలులేదు– అశుభము. ఏ చీకూ చింతా లేక, పండువంటి సంసారంతో, జీవయాత్ర సాగిస్తున్న ఒక గృహస్థు ఇంటిలో అడుగుపెడుతూ అతనివల్ల అతిథి సత్కారాలు పొందుతూ "మనము అనుకోని ఏదో అనివార్య పరిస్థితి ఏర్పడినప్పుడు, మన కుటుంబానికి రక్షణగా..." అంటూ ప్రస్తావన మొదలుపెట్టడానికి ఎంతో ధైర్యంకావాలి. ఇది వారి శ్రేయస్సుకే కావచ్చు. "అవసరమైన ఖర్చులు ఎన్నో ఉంటయి. వానిలో ఏదో ఒక ఖర్చు తగ్గించుకొని, ఈపైకం మనది కాదనుకొని, సాలీనానో, ఆరునెలల కొకసారో, ఇంత ప్రీమియమ్ చెల్లిస్తూంటే అనుకోని పరిస్థితిలో కుటుంబాన్ని ఆదుకుంటుంది, పెద్దమొత్తము; లేదా, అంతా సవ్యంగా నడిస్తే, మనమే తీసుకోవచ్చు అన్నివేల రూపాయలూ" అంటూ నచ్చజెప్పాలి. ఇది చాలాకష్టము. మనవారు కార్యరూపంలో ఎలాఉన్నా మాటలలో

మాత్రం గొప్ప తత్వవేత్తలు. "అన్నిటికీ ఆ పరమాత్ముడే ఉన్నాడు. మొక్క నాటినవాడు నీరుపొయ్యడా? దైవయత్నమేకాని, పురుషయత్నం ఎందుకు పనికి వస్తుంది?" అనేస్తారు, అవలీలగా. ఈమాటలకు ప్రతిగావారితో మనమువాదిస్తున్నాము అనే భావము వారికి కలుగకుండా, ఏవేవో చెప్పి, వారిని ఒప్పించాలి. ఇందుకు ఎంతో చాకచక్యం కావాలి. ఒక్కొక్కప్పుడు, వారికి ఏదో గొప్పసహాయంచేయగా కృతజ్ఞతా సూచకంగా వారు మన కంపెనీలో పాలసీ పుచ్చుకోవచ్చు. కాని, ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండానే పరోపకారం చెయ్యాలనుకునేవారు ఏదో ఆశ పెట్టుకుని ఎలా మేలుచేస్తారు? పైగా, చేయతగిన సహాయమూ ఉంటుంది, చేయకూడనిదీ ఉంటుంది మరి.

ఒకసారి, రాజమహేంద్రవరంలో నేను క్యాంపులో ఉండగా, నేనున్న బంగళా వద్దకు ఒక సరికొత్త టూసీటర్ మోటార్‌కార్ వచ్చి ఆగింది. ఆ ప్రాంతంలో పనిచేస్తున్న మా ఏజంట్ వెంకట్రావూ అతనితో కూడా విలువైన విదేశీ దుస్తులు ధరించిన ఒక యువకుడూ కార్‌నుండిదిగి, నావద్దకు వచ్చారు. ఈయన ఫలానా ఎస్టేట్ జమీందారుగారి అబ్బాయి అని వెంకట్రావు అతనిని నాకు పరిచయం చేశాడు. జమీందార్‌గారిని నేను ఎరుగుదును. "అల్లాగా! సంతోషం!!" అంటూ, అతని తండ్రిగారిని గురించి కుశలప్రశ్న వేస్తూ, ఈ మాటా ఆ మాటా మాట్లాడాను వారిద్దరితోనూ.

కాస్సేపు ఇలా గడచినాక, ఆ అబ్బాయి తనచేతిగడియారమువైపుచూస్తూ, "నేను టెన్నిస్‌కు వెళ్ళాలి. ప్రస్తుతానికి సెలవు తీసుకుంటాను." అని ఎంతో వినయంతో లేచాడు. నేనూ లేచి కార్‌వరకూ అతనిని సాగనంపాను. ఉండిపోయిన వెంకట్రావు నాతో కలసి హాల్‌లోకి వచ్చి, జమీందారుగారి అబ్బాయి విషయం చెప్పాడు. "తండ్రికి పంచప్రాణాలూ ఇతని మీదనే. ఇతని మాట కాదనరు ఆయన. ఇతనిని మనకంపెనీలో ఒక పాతికవేలకు ఇన్సూర్ చెయ్యడానికి ఒప్పించాను. ఇతను చేరితే, ఇతని క్లబ్‌లో ఇతని స్నేహితులు చాలామంది మనకంపెనీలో చేరుతారు. ఎంతలేదన్నా, ఒక లక్షరూపాయల బిజినెస్ లభిస్తుంది" అన్నాడు. "అల్లాగా! చాలా మంచిమాట!" అన్నాను నేను.

ఆ తర్వాత ఓ నిమిషం ఆగి, వెంకట్రావు అడిగాడు: "మీకు ప్రిన్సిపాల్ స్వామీ చాలా బాగా తెలుసునుకదా?" అని. "తెలియకేమి? మా కిద్దరికీ ఎన్నేళ్ళ నుంచో స్నేహము" అన్నాను నేను, ప్రిన్సిపాల్‌కూ ఈ ఇన్సూరెన్స్ విషయానికీ ఏమిటి సంబంధం చెప్మా అని ఆలోచిస్తూ. "ఎన్నేళ్ళనుంచో స్నేహమా? ఐతే ఇంకేమి! మీరు ఒక్కమాట అంటే చాలు!" అన్నాడు వెంకట్రావు. ఆ ఒక్క మాటా ఏమిటో కూడా చెప్పాడు: "ఏమీలేదు; ఈ అబ్బాయి మొన్నటి బి. ఏ. పరీక్షకు వెళ్ళాడు. అన్ని పేపర్లూ బాగానే వ్రాశాడు. ఒక్క ఇంగ్లీష్‌లోనే కాస్త సందేహం. ఆ పేపర్లు ప్రిన్సిపాల్ స్వామి వద్దకు వచ్చాయి." అని.

నేను నిర్ఘాంతపోయాను. నా స్నేహితునితో మాట్లాడి జమీందార్‌గారి అబ్బాయిని ప్యాస్‌చేయిస్తే, మా కంపెనీకి ఒక లక్షరూపాయల బిజినెస్ రావచ్చు. ఇదేమి వ్యాపారమో! కాని, వెంకట్రావు మంచివాడు; లోకపుతీరునే అనుసరిస్తున్నాడు. అతనిమీద కోపంరావడంబదులు నాకు నవ్వువచ్చింది. బిగ్గరగా నవ్వాను.

"అబ్బే! నవ్వడముకాదు. మీ మాటంటే ప్రిన్సిపాల్‌గారికి వేదవాక్కు. మీరు ఏమీ అనక్కరలేదు. అబ్బాయిపేరుచెప్పి, 'నేనతని శ్రేయోభిలాషిని' అని, ఓ ముక్క పడెయ్యండి, ఏదో మాటల సందర్భాన. ప్రిన్సిపాల్ అర్థం చేసుకుంటారు." అన్నాడు వెంకట్రావు.

ఆయన అర్థం చేసుకున్నా, చేసుకోకపోయినా, ఆ ప్రసక్తి ఆయనతో తేవడము నాకు ఏ మాత్రం ఇష్టములేదు. "ఇది నేను చేయలేని పని" అని కచ్చితంగా చెప్పివేశాను వెంకట్రావుతో.

"అల్లా అనకూడదు. ఒక లక్షరూపాయల బిజినెస్. ఆయన ఏమీ అనుకోరని నేను హామీఇస్తాను. ఆలోచించండి." అని వెంకట్రావు వెళ్ళిపోయాడు.

వేసవి సెలవల తర్వాత, ఒకసారి మద్రాస్‌వెళ్ళగా సినిమాహాలు ముందర జమీందారుగారిఅబ్బాయి తన టూసీటర్ కార్ దిగి గబగబా నడచివచ్చాడు నావైపు. వంగి నమస్కరిస్తూ, ఎంతో వినయంతో అన్నాడు: "మీదయవల్ల నేను పరీక్ష ప్యాసైనాను, మీ మేలు మరచిపోలేను!" అని.

"అలాగా! పరీక్ష ప్యాసైనందుకు చాలా సంతోషం.... మీ నాయనగారి ఆరోగ్యం బాగుగా ఉన్నదా ?'' అన్నాను నేను.

అతనికి ఈ నాటికీ తెలియదనుకుంటా, నేను ప్రిన్సిపాల్‌గారితో మాట్లాడ లేదనీ, తన కొచ్చిన ప్యాస్‌మార్కులు స్వశక్తి వలననే సంపాదించుకున్నాడనీ !

జీవిత భీమా సంస్థలో పనిచేస్తున్న నేను వ్యక్తుల జీవితంలో వింతగా కలుగజేసుకోవడము అగత్యమయ్యేది అప్పుడప్పుడు, అతి వింతగా. మా దుగ్గిరాల ఏజెంట్ సాంబయ్య చక్కగా చదువుకొన్నవాడు. మంచి మంచి ఆశయాలూ మంచి మంచి ఊహాలూ కలవాడు. అతను తెలికిచర్ల వెంకటరత్నం వద్ద చదువుకున్నాడు. కనుక, తెలుగుసాహిత్యంలో మంచి అభిరుచి. ఆ కారణంగా మాకిద్దరికీ వ్యవహారరీత్యా సంబంధమే గాక, స్నేహంకూడా ఏర్పడి, నానాటికీ అభివృద్ధి జెందింది, ఆ స్నేహము.

ఒకరోజు అతను తన స్నేహితుడు సీతారామయ్య వద్దకు తీసుకువెళ్ళాడు నన్ను. "మే మిద్దరమూ కలసి చదువుకున్నాము, కొన్నేళ్ళు'' అంటూ అతనిని నాకు పరిచయం చేశాడు సాంబయ్య. "ఇతను మంచి వ్యాపారస్తుడు; ఇదివరకే మన కంపెనీలో ఒక పాలసీ ఉన్నదట. కాని, అది ఏదో అజాగ్రత్తవల్ల అమలులో లేదు ఇప్పుడు. ఆపాలసీని అమలులోకితెచ్చి, ఇతనిచేత మరో పదివేలకు ఇన్సూర్ చేయించాలని నా ఆశ'' అన్నాడు సాంబయ్య.

"దానికేమి ? అలాగే చెయ్యవచ్చు'' అంటూ, ఆ కాగితాలన్నీ తీసుకు వచ్చాను. త్రోవలో సాంబయ్య చెప్పాడు: ''ఇతను తన పాలసీ భార్యపేర విలియా వేశాడు. పాలసీ కొన్నేళ్ళు అమలులో ఉన్నాక వారిద్దరి మధ్య ఏదో అభిప్రాయ భేద మేర్పడి, చినుకు చినికి గాలివానై, ఆమె తన మూడేళ్ళ పిల్లవానిని కూడా తీసుకొని పుట్టినింటికి వెళ్ళిపోయారు. పాలసీ ఆమె వద్దనే ఉండిపోయింది. దానిని పునరుద్ధరించాలీ అంటే వారిద్దరిమధ్య సఖ్యత ఏర్పడాలి. ఆపని మీవల్లనే కావాలి'' అన్నాడు సాంబయ్య.

నాలో నేను నవ్వుకున్నాను. నా సంగతి నేను సరిజూచుకో గలిగానా, ఇతరుల సంగతి చక్కబెట్టడానికి ? అనుకున్నాను. అయినా, అప్పటికీ ఇప్పటికీ కూడా ఇలా ఏదో కారణంగా స్నేహభంగము కలిగినవారి చెన నాకు కలిగే అపరిమితమైన సానుభూతివల్ల, నేను వెంటనే ఆ పనికి పూనుకున్నాను. అదృష్టవశాత్తు ఆమె పుట్టినింటివారిని నేను బాగా ఎరుగుదును. ఏదో సందర్భంలో ఆమె తమ్ముని కి నా చెన ఎంతో కొంత గౌరవాభిమానాలు కలిగాయి. చేబ్రోలువద్ద ఏదో ఊరు వారిది. నేను వస్తున్నాను అని తెలిసి ఎంతో సంతోషించారు వారు. నన్ను ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించారు.

భోజనాలైనాక, కచేరి సావడిలో నులకమంచంమీద కూర్చొని, తమలపాకులు వేసుకుంటూ, ఆమె తమ్ముని ఉద్దేశించి అన్నాను : "నేను పనిమీదవచ్చాను– ఒక ముఖ్యమైనపని మీద'' అని. అతను వెంటనే, ఎంతో ఆత్రుతతో "అయ్యో! అంతకంటేనా ? చెప్పండి, తప్పక చేస్తాను !'' అన్నాడు. "మీ అక్కయ్యగారిని ఒకసారి పిలుస్తావా, మీ ఇద్దరితోనూ మాట్లాడాలి నేను'' అన్నాను. మూడేళ్ళ పిల్లవాణ్ణి చంకలో వేసుకుని మహాలక్ష్మమ్మ వచ్చింది. భోజనాలవద్ద, మాకు వడ్డిస్తూండగానే నేను ఆమెనుచూచాను. సౌజన్యమూర్తి, ఎంతో క్షమ కనిపించింది ఆమె ముఖంలో. పిల్లవాడు ముద్దు వస్తున్నాడు. సీతారామయ్య జ్ఞాపకం వచ్చాడు. వీరి నిద్దరినీ విడిచి ఎలా ఉండగలుగుతున్నాడు ఆతను ! అనుకున్నాను.

ఎంత చనువు తెచ్చుకున్నానో, ఎలా మాట్లాడ కలిగానో ఆమెతో అప్పుడు! కానీ, ఆమె మనస్సు మార్చకలిగాను. ఇన్సూరెన్స్ పాలసీ ప్రస్తావనరాగా, ఆమె వెంటనే లేచివెళ్ళి, పెట్టె తెరచి ఆ పాలసీతెచ్చి, సంతకంచేసి నాచేతి కియ్యబోయింది. "ఇక్కడ తీసుకోను; బెజవాడలో మీ స్వగృహంలో తీసుకుంటాను. రేపు విదియ, ప్రయాణానికి మంచిరోజు, మీ తమ్ముణ్ణి తీసుకు ప్రొద్దుటి బండిలో బెజవాడ రండి. సీతారామయ్య స్టేషన్‌కి వస్తారు'' అని నేను వచ్చివేశాను. నేను సెలవు తీసుకుంటూ ఉంటే, ఆమె చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వులో ఎంతో మెప్పుదల, ఎంతో కృతజ్ఞతా కనిపించాయి నాకు.

పాలసీకి సంబంధించిన వ్యవహారమంతా సాంబయ్య చూశాడు. ఈసారి నేను మళ్లా వారింటికి వెళ్ళడము, వారిరెండవ కుమారుడు, చంటిపాప బారసాలకు. చంటిపాపను ఒళ్లోపెట్టుకుని వారిద్దరూ పీటలమీద కూర్చుండగా చూచి, ఎంతో సంతోషించాను.

సాంబయ్య సాహితీ ప్రియుడు కాబట్టి తరచు సాహిత్యసంబంధమైన సంభాషణే మా ఇద్దరికీ. ఆ రోజులలో గుంటూరు మనతెనుగు సాహిత్యపీఠంగా ఉండేది. తెలికిచర్ల వెంకటరత్నమూ విశ్వనాథ సత్యనారాయణా కొడాలి ఆంజనేయులూ నాయని సుబ్బారావూ విద్యార్థి బృందములలో తెనుగు సాహిత్యమందు ఆసక్తి అభిరుచీకలిగిస్తూ ఉండేవారు. ఆ బృందానికి చెందినవాడే సాంబయ్య. ఒకనాడు అతనూ నేనూ మరికొందరు స్నేహితులతో కలిసి సాహిత్య గోష్ఠిలో ఉండగా, దేశభక్తి పూరితమైన కవితలోనూ మంచికవిత చూపవచ్చుననే వాదనను బలపరుస్తూ సాంబయ్య "తెలుగుతల్లి" అనే పద్యాలు కంఠమెత్తి. ఎంతో ఉషారుతో చదివాడు :

కృతు లందుటకు పల్లకీమోయ దొరకొన్న
కృష్ణరాయడు రాజ్య మేలునాడు
మనుమ సిద్ధియును దిక్కన గన్న కావ్యంబు
కోరచూపులు జూచుకొన్ననాడు
తెలుగు రాయని యొప్పులోలుకు గుప్పిటిలోన
లేత కస్తూరి గుభాళించునాడు
ముత్యాల మందిరంబుల సత్కవుల మీద
బంగార మేరులై పారునాడు
కవుల పల్కులు వేదవాక్యంబు లగుచు
క్షితి తలంబును గంపింప జేయునాడు
గారవంబున నన్నేల గాంచవైతి ?
తెలుపగదవమ్మ ! ననుగన్న తెలుగుతల్లి ! ...

ఇవి ఎవరు వ్రాశారు అని నేను ప్రశ్నించగా, "జాషువా కవి; ఆయన మా గురువు; నా అభిమాన కవి" అని, వారి రచనలలోని మరికొన్ని పద్యాలు చదివాడు సాంబయ్య. జాషువా కవితతో అదే నా మొదటి పరిచయము. తరువాత, తరువాత, వారి ఇతర రచనలతోనూ, వారితోనూ కూడా పరిచయము కలిగినది నాకు. ఆ మధ్య "అమరేంద్ర" అనే విమర్శకులు జాషువాను గురించి ఇలా అన్నారు:

"....జాషువా కవితా ప్రభావంలో దేశభక్తి, సంస్కరణాసక్తి, సౌందర్యానురక్తి అంతర్వాహినులుగా గోచరిస్తయి. జ్ఞాపకముల వలె స్వీయానుభూతులనే కవనంలో వినిపించే ఆత్మాశ్రయ లక్షణం జాషువాలో ప్రబలంగా ఉంది."

సాంబయ్యకు మాత్రం ఇవ్వాళ, ఆనాడు తాను చదివిన పద్యాలు జ్ఞాపకం లేవు. అతను ఎంతోకాలం ఇన్స్యూరెన్స్ పని చేయలేదు. మరో పెద్ద ఉద్యోగం లభించింది అతనికి. ఆ తర్వాత అతను విదేశానికి వెళ్ళి వచ్చి చాలా వృద్ధిలోకి వచ్చాడు. ఈ మధ్య అతనిని చూడడము తటస్థించినపుడు తన పదవీ గౌరవం మరచిపోయి, అప్పటి సాంబయ్యలాగే ఎంతో వినయ విధేయతలతో నన్ను గౌరవించాడు అతను. "ఆనాడు జాషువా పద్యాలు చదివావు జ్ఞాపకమున్నదా" అని నేను అడుగగా, "మాటలు సరిగా జ్ఞాపకం లేదు కాని, మన స్నేహ విషయం ఎలా మరచిపోతాను! అదో పూర్వజన్మ!! అప్పటి మిమ్ములను గురించి సదా తలచుకుంటూ ఉంటాను, నేను" అన్నాడు.

ఒకనాటి ఉదయం మొక్కపాటి నృసింహశాస్త్రి నా వద్దకు వచ్చారు. ఇది వరకు నేను వారిని కలుసుకొని ఉండకపోయినా, సాహితీసమితి సభ్యులుగా వారు నాకు చిరపరిచితులు. ఆయన రచనలు నేను శ్రద్ధతో చదివాను. సమితికృషిలో ఆయన చూపిన శ్రద్ధాభక్తులు నాకు తెలియును. కాబట్టి ఎంతో అన్యోన్యంగా మాట్లాడుకో గలిగాము ఆ పూట పూటంతా. ఆయన ఎడిన్‌బరో నుండి తిరిగివచ్చి

కొన్ని ఏళ్ళయినా, అనేక విషయాలలో ఆయన పాటిస్తున్న కొలత బద్ద ఇంకా పాశ్చాత్య సంప్రదాయ సిద్ధమైనదే. విదేశానికి వెళ్ళకపోయినా నాకున్నూ అనేక విషయాలలో పాశ్చాత్య లక్ష్యలక్షణాలు రుచిస్తాయి. మేమిద్దరమూ కలిసి సమకాలిక ధోరణులను తీవ్రంగా విమర్శించేవారము. "లోకం మగమ్మత్తుకు పూనుకున్న"-పూనుకున్నామనుకున్న - వారము మే మిద్దరమూ ఆ రోజులలో.

మొక్కపాటి నృసింహశాస్త్రి మరికొన్నాళ్ళకి తాను నెలకొల్పబోయే "శక్తి" అనే క్రొత్తపత్రిక గురించి నాతో ప్రస్తావించారు. "లండన్ మెర్క్యూరీ", "రివ్యూ ఆఫ్ రివ్యూస్", ఇటువంటి పత్రికలే ఒరవడిగాగలనేను, వెంటనే "అవును; అన్ని విధాల సర్వాంగ సుందరమైన మాసపత్రికను వెలయించాలి మీరు" అన్నాను. "అందుకు కావలసిన సహాయము, నా చేతనైనంత చేస్తాను నేను" అన్నాను.

"శక్తి" రెండు మూడు సంచికలు కాబోలు నడచింది. పత్రిక అచ్చయి వచ్చేసరికి అది నృసింహశాస్త్రి ఆశించినట్టు రూపొందలేదు; నేను అనుకొన్నట్టూ లేదు. నా మనస్సులో నిర్మించుకున్న స్వరూపానికీ సంచిక స్వరూపానికీ గల వ్యత్యాసం చూడగా ఎంతో ఆశాభంగమైనది నాకు. కాని, తరువాత, తరువాత తెలుసుకున్నాను: ఒక చక్కని పత్రిక నెలకొల్పి సాగించడము మాటలు కాదనీ, ఒకరిద్దరు వ్యక్తుల అపారమైన ఆవేశంతో గానీ, నిరంతర కృషితో గానీ ఇటువంటి పనులు నెరవేరవనీ. ఆశలు ఆకాశాన్ని అంటవచ్చు, అవి ఆచరణలోకి వచ్చేసరికి లక్ష ఆటంకాలు వస్తాయి.

ఒకానొక ఇన్సూరెన్స్ కంపెనీకి కార్యదర్శిగా ఉన్నా, ఆ రోజులలో నా వ్యాసంగం అంతా ఎంతో సాహిత్యపరంగా ఉండేది. స్నేహితులందరితోను ఎక్కువగా సాహిత్యవిషయాలే మాట్లాడుతూ ఉండేవాడను. ముఖ్యంగా బండారు వీరరాజేశ్వరరావు తరుచు కవితా విషయాలను గురించి ఎంతో చెప్పేవాడు. అతడూ కవే. అందరు ఆధునిక కవులూ అతనికి సుపరిచితులు. వారి రచనలు చక్కగా అవగాహన చేసుకున్నాడు. పద్యమూ ఎంతో రక్తికట్టేటట్టు చదువగల

నేర్పరి. వృత్తిలో లాయర్ అయినా, సాహిత్యవిషయాలలో అభిరుచి ఎక్కువ అతనికి. చాలా మంచిమనిషి. మరి అలాటివాడు మనకు ఎందుకు దక్కుతాడు! పిన్నవయసులోనే అతడు పరలోకగతుడయాడు. అతనిలేమి ఒక తీరని వెల్తి.

సాహిత్యంతోపాటు, ఇతర రంగాలలోనూ ఆసక్తి ఉండేది నాకు. లలితకళా విషయంలో చిరకాలమునుండి అభిలాష నాకు. జేమ్సు కజిన్స్ పెట్టిన బిక్ష, తదుపరి అడవి బాపిరాజు వంటివారి సాంగత్యంవల్లా, కొద్దిరోజులు శాంతినికేతనంలో ఉండడమువల్లా, చిత్రకళ అంటే ఎంతో ప్రీతి కలిగింది నాకు. ఇది తెలిసి కాబోలు ఒకనాటి ఉదయం చిత్రకారుడు చేమకూర సత్యనారాయణ మా ఇంటికి వచ్చారు. అప్పుడాయన కాకినాడలో ఉంటూఉండేవారు. బొంబాయిలో చిరకాలము చిత్రకళ నభ్యసించి, తదుపరి ఆయన రాజమహేంద్రవరంలో కొన్నాళ్లు పూజ్యులు దామెర్ల రామారావుతో కలసి ఉన్నారు. తత్ఫలితంగా కొన్ని మంచిబొమ్మలు ఉదయించాయి చేమకూర సత్యనారాయణ కుంచెతో. వీని ఫొటోగ్రాఫులు చూపారు నాకు ఆయన. మేము చాలాసేపు చిత్రకళ గురించీ తెలుగుదేశంలో ఏలాగైనా చిత్రకళాభిరుచి వృద్ధి చేయవలసిన అగత్యం గురించీ ప్రస్తావించాము. మా ఇద్దరికీ అభిమతమైన చిత్రకళా సంప్రదాయాలలో ఎంతోకొంత వ్యత్యాసమున్నా, అప్పటి చిత్రకళాధోరణుల గురించి వివరంగా చర్చించడానికి అవకాశం కలిగింది. అప్పుడు, ఆయనా అనుకో లేదూ నేనూఊహించలేదు మరి కొన్నేళ్ళకి నేను స్వయంగా బొమ్మలు చిత్రించ డము నేర్చుకుంటాననీ నేను చిత్రించిన ఒక బొమ్మకు అఖిలభారత చిత్రకళా ప్రదర్శనము తరఫున ఆయన తన సంతకంతో నాకు సర్టిఫికేట్ ఇస్తూ, బహుమతి ప్రసాదిస్తారనీ! కొంతకాలము మే మిద్దరిమూ కలసి పని చేశాము. ఒక చిత్రకళా సంస్థకు కార్యదర్శిగా ఆయన, ఉపాధ్యక్షునిగా నేను, తరువాత కార్యదర్శిగా నేను, ఉపాధ్యక్షునిగా ఆయన. అప్పుడు అలవరచుకొన్న చిత్రకళా రచన ఫలితంగానే అవతరించినది "ముగ్ధ" అనే బొమ్మ, నాకు అత్యంత ప్రియమైనది. ఏదో వింత అమాయకత్వమూ, ఏదో వింత వర్చస్సూ జీవితంలో ఏదో వింత ఆసక్తీ స్ఫురిస్తాయి నాకు ఆ బొమ్మలో. నా మనస్సులో నేను ఊహించుకున్న ఆంధ్రబాలిక లావణ్యము ఎంతో కన్పిస్తుంది నాకు, ఆ చిత్తరువులో.

## సాగుతున్న యాత్ర

ఇక్కడ బెజవాడలో, చేసిన కొలదీ ఉండేది నాకు ఎంతోపని. ఎన్నో ప్రాపకాలు; స్నేహితులూ బంధువులూవస్తూ, పోతూఉంటారు. క్లబ్‌లో ఇట్టే ప్రొద్దు పోతుంది, టెన్నిస్‌తోనూ, కబుర్లతోనూ. నెలకు ఎంతలేదన్నా, ఒక పదిహేను రోజులైనా ఊరిప్రయాణాలలో గడిచిపోతుంది. ఎడతెరిపిలేని ఇట్టి జీవితంలో ఒంటరితనము ఉండకూడదు అసలు. కాని, ఉన్నట్టుండి ముంచుకొస్తుంది ఏదో బెంగ, ఎన్నడో అనుభవించిన మధురక్షణాల జ్ఞాపకం, భరింప నశక్యమైన ఏదో తీరని వెత్తి. కాలప్రవంతిలో జారిపోయిన ఒకానొక అమూల్యమైన వస్తువు కోసం వెర్రిగా వెతుక్కుంటూ ఉంటాను. పుష్కరపు జనసమూహంలా కళ్ళముందు సాగి పోతూన్న లక్ష ముఖాలలో ఆ ఒక్కముఖం కోసం నిర్నిమేషంగా కనులు విప్పుకు చూస్తూఉంటాను పగలనక, రాత్రనక, మేలుకొనీ నిద్రిస్తూ. ఈ ఒంటరితనము ఎలా భరించడము ?

...ఈ కుటీర ముఖద్వార
మిందే ప్రేవాడి సగము
వాకి, విరహ తోరణమ్మ్రైె,

వలవంత నడలి, నేల జీ
రాడి, ఎన్ని నాళ్ళు, మనుదునో !

ఇపుడు వత్తువా నీ కొర
కెదురు చూచు నీ వియోగి
ఎడద మంచు జడులు కురియును

మాపేమో, రేపటకో
వెడలి చనును, నిదురమునుగునో !

ఆరలేని నా కోరిక
కారు చూపు చొరగ, చీలి,
కాలి, కుములు ఈ చీకటిలో

## సాగుతున్న యాత్ర

క్రాగి క్రాగి, నీ కొరకై
కరవులోననే నశింతునో !

...ఆకస మాలోకనముగ,
లోక మెల్ల పీనుగ, కా
లాంతమునకు కాచియుందునా !

ఆసలేని ఆసకు, ప్రా
ణాంతమేని, వేచియుందునా !

చివురింపదో చైత్ర శుభో
త్సవ విభాత కల్యాణము
ఈ దరిద్ర హేమంతమున !

ఎంత బాధపడుతూ అన్నాడో ఈ మాటలు స్నేహితుడు కృష్ణశాస్త్రి ! అంత బాధా అనుభవిస్తున్నాను నేను. ఆకవితోపాటు నేనూ, ఆ రోజులలో, దరిద్రహేమంతంలో వసంతోదయానికై వేచియుండి, నిరీక్షిస్తున్నాను. ఎపుడు చివురిస్తుందో చైత్రము :

౩

వలపు నిండార విరిసిన పారిజాత
కుసుమములు నేలరాలు వేకువల యందు
ప్రసవ శయ్యాపదముల నీపాద యుగళి
కదలెనో, నాదు హృదయమే కలతపడెను!
కాని, పలుమారు నా కందరాని వస్తు
వేదియో దూరము నుండి వెలుగులెత్తు,
పరిమళ పరీతమైన నీ ప్రణయ వార్త
భూనభోంతరాళమ్ముల పులకరింప!
బహుళ మందార గంధలోభమున దిరుగు
మధుకరమువోలె హృదయమున్మత్తమయ్యె
పరవశమైన భావ ప్రపంచమందు
బందినై ఎన్నినాళ్ళుండవలెనో యేమొ!
దీపికలు లేని వాకిళ్ళు తెరచి నాదు
తలపు లొక్కొక్కటే నిన్ను దరియబోయి
తిరిగి వచ్చుచుండును పందిళుల క్రింద
కేళి, దిరుగాడు పెండ్లి చుట్టాల రీతి!

అబ్బూరి రామకృష్ణరావు

మిత్రులు రామకృష్ణరావుకు ఇప్పుడు ఈ పద్యము వినిపిస్తే "ఎంతో సున్నితమైన భావాలు; మాటలూ ఎంతో చక్కగా కుదిరాయి, ఎవరు వ్రాశారో!" అని ఆశ్చర్యపోవచ్చు - అంతగా మారిపోయింది, ఆయన జీవితము ఈ నలభై ఏళ్ళ లోనూ. ఐతే, ఒకటి: అతని కవిహృదయము మాత్రము మారలేదు. జీవన

సమస్యలనే చెరుకుమర సున్నితభావాలనూ, ఆర్ద్రతనూ, పీల్చి పిప్పిచేసి పార వేసినా.

అప్పటి నా మానసికావస్థను ఎంతోచక్కగా విశదపరచాయి ఈ కవి పలుకులు కాబట్టి ఇంతగా నిలిచిపోయాయి నా హృదయసీమను. అందరాని వస్తువు దేనికోసమో ఉవ్విళ్లూరుతూ ఉండడముతోనే కొందరి జీవితములో చాలా కాలము గడిచిపోతుంది. అందరిలాగా, అందుబాటులోఉన్న వస్తువులతో తృప్తిపడి సరిపెట్టుకో కలిగితే బాధేవుండదు. ఫలసిద్ధి కలిగినప్పుడు అవతరించే ఆ విపరీతపు తన్మయత్వాన్ని ఊహించుకోవడములోనే, కలుగుతుంది, అసంతృప్తి - ఆవేదన అంతే కాదు. ఎప్పుడో ఒకసారి, ఏ పురాకృత సుకృతంవల్లనో, ఇతరులెవ్వరూ సాధారణముగా అనుభవింపజాలని దివ్య నిముషముల ఆనందము అనుభవించి ఉండడము వలననే కలుగుతుంది ఇప్పటి ఈ ఆరాటము. ఆ అనుభవము ఉండి ఉండకపోతే ఈ "బహుళ మందార గంధలోభమున తిరుగు మధుకరపు ఉన్మత్తత" ఉండదు

కాని. ఇన్సూరెన్స్‌పనికీ, ఈ భావాలకీ చాలా దూరం. ఒక్కసారిగా వదలించుకోవాలనిఉంటుంది ఇటువంటి తలపులను - నీటినుండి ఒడ్డుకుచేరిన రాజహంస రెక్కలలదిని విదలించుకొన్నట్టు. అబ్బ: ఎంత వ్యత్యాసమూ, ఆ అనుభవానికీ, ఆ భావాలకీ, ఈ నిజపరిస్థితులకూ!

అన్ని వ్యాపారాలలోనూ కొద్దో, గొప్పోగా ఉంటాయేమోగాని, ఈ వృత్తిలో నాకు అప్పుడు కనిపించిన ఈర్ష్య మోసమూ చాలా బాధ కలిగించాయి. ఎటువంటి పరిస్థితులలోను లోకంలో మంచినేచూడాలి మనము, అనే అభిప్రాయంతో పెరిగిన నన్ను ఇది ఒక ముల్లులా గుచ్చుకుంది.

శ్రీ కాశేశ్వరరావు సత్యాగ్రహ ఉద్యమంలో వెల్లూరు జైలుకువెడుతూ తాను చాలా నమ్మినవ్యక్తి అనీ, అతను మరో భీమాసంస్థకు ఏజంట్ అయినా మా కంపెనీకిన్నీ దీక్షతో పనిచేస్తాడనీ రావుగారు అనే ఆయనను అప్పగించారు నాకు. రావుగారు బహుమాటకారి. ఎవరన్నా అతి నిర్లక్ష్యము - తనకున్న ఆత్మవిశ్వాసమువల్ల.

తానూ ఉడతాభక్తిగా స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్న కారణంగా తెలుగుదేశంలో ఉద్యమనాయకులను అందరినీ ఆయన బాగా ఎరుగును. పట్టాభి మొదలుకొని పేద వాలంటీయర్ వరకు రావుగారిమాట తప్పక పాటిస్తారట. "కాశేశ్వరరావు పేరనే వెల్తి ఉంచుకోకు నీ మనస్సులో! ఆయన ఎరిగినవాళ్ళందరినీ, ఇంకా ఎందరినో, నేనూ ఎరుగుదును" అంటూ, ఆయనకంటే పదిరెట్లు ఎక్కువగా తాను మా కంపెనీకి సహాయం చేయగలననే భ్రమ గలిగింప ప్రయత్నించారు రావుగారు, నామనస్సులో. నాకిది అట్టే మనస్కరింపలేదు. కాని, ఏ ఏర్పాటునూ ఇట్టే కొట్టివేయకూడదు అనే భావంతో నేను యేమీ అనలేదు.

నేను రోజూ సాయంత్రం నాలుగున్నరకు టెన్నిస్‌రేకెట్‌తో ఇల్లువెడలి, తిన్నగా క్లబ్‌కు వెళ్ళేవాడను. రావుగారి ఇంటిముందరనుంచే వెళ్లాలి. చాకలితెచ్చిన తెల్లపైజమా తెల్లమల్లు లాల్చీ వేసుకుని, జరీఖండువాతో సరిగపువ్వులు కుట్టిన ముఖమల్ చడావులతో వెళ్ళేవాడను వారి ఇంటిముందునుంచి కాలినడకను. ఒక నాడు నేను బయలుదేరుతుండగా కొమర్రాజు లక్ష్మణరావుగారి కుమారుడు, నా స్నేహితుడు వినాయకరావు వచ్చాడు. 'రావుగారు నాకు దగ్గరబంధువు; నేనూ వస్తాను పద, నీతో, వారింటిదాకా' అన్నాడు. సరేనని ఇద్దరమూ వెళ్లాము. రావు గారు ఎక్కడో లోపల పనిచూచుకొంటున్నారు. ఆయన మేనకోడలుగుమ్మంలోనే మమ్మల్నిచూచి, వినాయకరావును ఆప్యాయతతో పలుకరించి మమ్మల్నిలోనికి ఆహ్వానించింది. ఇంతట్లోకి రావుగారువచ్చి, మా రాక ఆయనకు ఎంతో సంతోష దాయకము అని చెప్పుతూ, తన మేనకోడలు ఇంగ్లీష్‌పరీక్షలు ఓమీ ప్యాస్‌కాక పోయినా, తెలుగులో మంచిఅభిరుచీ, ఆసక్తీ, ఉన్నవనీ, చక్కగా వ్రాయగలదనీ అన్నారు. నేను, "అలాగా, చాలా మంచిమాట" అంటూ నా సంతోషాన్ని తెలియ జేశాను. కాస్సేపుకూర్చుని క్లబ్‌కు వెళ్ళిపోయాను.

ఇది జరిగిన ఓ పది రోజులకు ఒక సోమవారం ఉదయం రావుగారు పని గట్టుకు మా యింటికివచ్చారు. చేతిలో కృష్ణాపత్రికఉంది. ఆ సమయానికి కాశేశ్వర రావుగారి అక్కగారు కోటమ్మగారూ నేనూ మధ్యహాలులో ఏవో కబుర్లు

చెప్పుకుంటున్నాము. కుర్చీలాగుకొని కూర్చుని పత్రికవిప్పుతూ "చూచారా నిన్నటి కృష్ణాపత్రికలో చక్కనికథ పడింది; తమాషాగాఉంది" అన్నారు. నిన్ననే నాకూ వచ్చింది కృష్ణాపత్రిక; నేనూ చదివాను ఆ కథను. కాని, ఆయన చదువుతూంటే పలుకకుండా విన్నాను; కోటమ్మగారూ విన్నారు.

కథానాయకునిపేరు మారుపేరైనా, ఆ కథంతా నన్నుగురించే; ఇదివరకు నా జీవితంలో జరిగినకొన్ని విషాదగాథలను ఏకరపుపెడుతూ, నన్ను ఏమాత్రమూ జాలి లేనివానిగా చిత్రిస్తూ, మరోవ్యక్తిని ఎంతో బాధపెట్టి, నే నిప్పుడు ఎంతో హాయిగా కాలము గడుపుతున్నానని ఉన్నది, ఆ కథలో.

"ఎవరెలాపోతే అతనికేమి? బెజవాడలోనే ఏదో కంపెనీకి మేనేజరుగా, టింగురంగాఅంటూ హాయిగా ఉన్నాడు చీకూచింతాలేక. సాయంత్రమయ్యేసరికి షికారుకు బయలుదేరుతాడు. మల్లెపువులాంటి తెల్లనిమల్లు కంటిమెడలాల్చి; పాము కుబుసములాంటి జరీ ఉత్తరీయము; కాళ్ళకు ముఖమల్ చెప్పులు; ముఖాన ఇంత పెద్ద ఆగరుచుక్క; గాలికి ముంగురులు ఎగురుతూఉంటాయి; చేతిలో టెన్నిస్ రాకట్; ఠీవిగా వెళుతూఉంటాడు జింఖానాకు" అంటూ ముగిసింది కథ.

"కథ ఎలా ఉన్నది?" అని మమ్మల్నిఅడిగి, బాగున్నది అనిపించుకొని, "మా మేనకోడలు వ్రాసింది ఈ కథ" అంటూ ఎంతో గర్వంతో అన్నారు రావు గారు. కోటమ్మగారు ఏదో పని ఉన్నదని లేచి లోనికి వెళ్ళిపోయారు.

కథనుగురించి నేను ఆయనతో ప్రస్తావించలేదు. ఆయనే మరొకసారి ఆ మాట తేబోతే నేను ఆయనమాటకు అడ్డువచ్చి, 'అమ్మాయికి పెద్దచదువు చెప్పించ రాదా? ఉత్తరోత్తరా చాలా మంచిది' అన్నాను. ఈ సలహా వినీ వినిపించుకో కుండా, లేచి నుంచొని, 'సరే, వెళ్ళొస్తాను' అని వెళ్ళిపోయారు రావుగారు ఎంతో ఆశాభంగంతో. కథ చదువగా విని నే నెంతో బాధపడుతాననీ, ఆ బాధచూచి సంతోషించాలనీ ఆయన అనుకున్నట్టు స్పష్టమైంది.

తరువాత, ఒక కారణముమీద మరో కారణంగా నేనూ ఆయనా మళ్ళా కలుసుకోలేదు. మరో కంపెనీలో పనిచేస్తున్న వారికి మా కంపెనీతో ఏ మాత్రమూ

జోక్యముండరాదని పై వారున్నూ అన్నారు. రావుగారి మాటసహాయం లేకుండానే ఏదో నాకు తోచినట్టు పని సాగించుకుపోతున్నాను. ఆయన మేనకోడలును విశాఖ పట్నంలోఉన్న ఒక పెద్ద ఉద్యోగస్తునికి ఇచ్చి పెళ్ళిజేశాడు. ఆమె వెళ్ళిపోయింది.

విమర్శ అత్యవసరమే. విమర్శవల్లనే మార్పు వస్తుంది ఎన్నటికైనా. కాని, మన తోటివారిని మనము విమర్శిస్తూ, వారి చర్యలను తీవ్రంగా ఖండించవలసి వచ్చినప్పుడు కాస్త సానుభూతితో పరిశీలించడము న్యాయము. నేరారోపణ అతి సులభము. కాని, ఎటువంటి పరిస్థితులలో అటువంటి నేరములకు తావు కలిగినది అని కాస్త ఆలోచించాలి. పరిస్థితుల ప్రభావమూ పాటించాలి. ఊరికే ఒకరిని మన్నులోకి దిగ లాగడమువల్ల ఏమివస్తుంది? ఇది ఒకరిని బాగుచెయ్యాలనే ఉద్దేశ్యం కాదు. ద్వేషమేమో అనిపిస్తుంది.

కాని, జరిగిపోయిన విషయాల గురించి నేను ఎంత బాధపడుతున్నానో వారికి తెలుసా? ఎలా తెలుస్తుంది? మల్లెపూవుల లాంటి ఆ తెల్లని బట్టలు, పాము కుబుసంలాంటి ఆ జలతారంచు ఉత్తరీయం ఎంతటి శోకభారాన్ని దాస్తున్నాయో వారి కేమి తెలుసుంది? ముఖాన ఇంతపెద్ద అగరు చుక్క చూచి 'ఎంత విలాసపురుషుడు!' అనుకుంటారు; తలలో మండిపోతూన్న ఆలోచనలు వారికెలా కన్పిస్తాయి? భరింప లేని పశ్చాత్తాపంతో నే నెంత కుమిలిపోతున్నానో వారు ఊహింపనైనా ఊహింప లేరు. చటుక్కున అనేస్తారు ఎంత మాటైనా.

కాని, అది ఆమె తప్పుకాదు. మేనమామ వ్రాయమంటే వ్రాసింది, అంతే. కొన్నేళ్ళయినాక ఆమెను మళ్ళా కలుసుకున్నాను. ఒంటినిండా నగలు; ధనకనక వస్తువాహనాలతో తులతూగుతోంది ఆమె. నలుగురుపిల్లల తల్లి. బోలెడు వ్యవహా రాలు. ఆమె మా బ్యాంక్ ఏజెంట్‌తో మాటాడుతుండగా నేను అక్కడకు వెళ్ళడం తటస్థించింది. ఇరవైఏళ్లు గడిచినా, నన్ను వెంటనే ఆనవాలు పట్టారు ఆమె, నా మస్తులవల్ల అనుకుంటాను. ఏజెంట్ నాకు స్నేహితులు. మమ్మల్ని ఒకరిని ఒకరితో పరిచయం చేయబోయారు. నేను నవ్వుతూ, "వారు రచయిత అని మీకు తెలియ

దనుకుంటాను, చక్కని కథలు వ్రాస్తాడు" అన్నాను. ఆమె ఎంతో సిగ్గుపడ్డారు నా కేసి చూస్తూ.

"ఏదో చిన్నప్పుడు వ్రాశాను; తెలివితక్కువ వ్రాతలు. ఎప్పటిమాట !" అన్నారు. నేను ఎంతో స్నేహపూర్వకంగా చిరునవ్వు నవ్వాను.

* * * *

అవి స్వాతంత్ర్య సమరపు రోజులు. సత్యాగ్రహ ఉద్యమము జోరుగా సాగుతోంది. పోలీస్ జులమూ అతిఘోరంగా ఉంది. ప్రతిరోజూ ఎవరో ఒకరు, ఆప్తులో బంధువులో స్నేహితులో విపరీతంగా లాఠీ దెబ్బలు తిని అరెస్టయి జైలుకి వెళుతున్నారు, సంతోషంతో. వారు చూపుతున్న సహనశక్తీ త్యాగసంపదా నన్ను వారి దెస భక్తిపరవశుణ్ణి చేశాయి. వారిని గురించిన వివరాలు వింటూఉంటే ఏ నిమిషాన ఉద్రేకంతో నేనూ ఆ గుండంలో దూకుతానో అనుకునేవాణ్ణి. కాని, నాన్నగారికి మాటయిచ్చాను, కాశేశ్వరరావుగారిస్థానే ఇన్సూరెన్స్ వ్యవహారం చూడడము అత్యవసరం కాబట్టి ఎటువంటి పరిస్థితులలోనూ ఉద్యమానికి దూరంగా ఉంటానని.

ఒకనాడు మా మేనత్త కొడుకు మల్లవరపు విశ్వేశ్వరరావు వచ్చాడు మా ఇంటికి. విశ్వేశ్వరరావు డాక్టర్ మల్లవరపు కృష్ణారావు తమ్ముడు. శాంతినికేతన్‌లో కొన్నేళ్లున్నాడు. మంచి కవి. అప్పటికీ, ఇప్పటికీ వట్టి ఆదర్శజీవి. కృష్ణారావు దెస నాకు గొప్ప స్నేహభావమూ ఆప్యాయతా ఉంటే, విశ్వేరరావు నా కంటే కొన్నేళ్లు చిన్న కాబట్టి, ఎంతో ప్రేమా, వాత్సల్యమూ ఎంతో చనువూ ఉన్నవి అతనంటే నాకు.

"నేను అరెస్టయి, జైలుకి వెళ్ళబోతున్నాను. నేను జైలులో చదువుకోడానికి భారతము కొనిపెడతావా, బావా ?" అని అడిగాడు నన్ను విశ్వేశ్వరరావు.

నేను, నవ్వుతూ, "భారతమెంత భాగ్యము ? తప్పకుండా ఇప్పుడే కొనిపెడ తాను, ఈ మాత్రానికి జైలుకు వెళ్లాలా !" అన్నాను.

విశ్వేశ్వరరావు "నవ్వుమాట కాదు, నిజంగానే బావా! నేను అరెస్టుకు సిద్ధమై వచ్చాను, ఎల్లుండి, పికెటింగ్‌చేసి జైలుకి వెళుతాను" అన్నాడు.

జాలితో నా గుండె నీరైంది. అతని అన్నగారు ఇది మూడవ పర్యాయం జైలుకు వెళ్లత. అతని బావగారు తల్లాప్రగడ నృసింహశర్మ తానూ జైలుకువెళ్లుతూ కబురుపంపారు నాకు: 'రేపో మాపో మీ వదినె విశ్వసుందరమ్మ తెనాలిలో అరెస్టు కానున్నది. నీకు మళ్ళా కబురు వస్తుంది. అప్పుడు నీవు వెళ్ళి రిమాండ్‌లో ఉన్న ఆమెను చూచిరావాలి. అశ్రద్ధ చెయ్యకు' అని. ఈవాళ ఇతనూ. ఇలా కుటుంబము కుటుంబమూ జైలులో కుములుతూ ఉంటే విశ్వేశ్వరరావు తల్లి మా అత్తయ్య ఎంత బాధపడుతుందో అనుకున్నాను. ఆ మాట అతనితో అంటే, కవీ ఊహాజీవీ ఇటువంటి రాజకీయాలతో సంబంధం పెట్టుకోడు అనుకున్న విశ్వేశ్వరరావు అతి ధీమాతో జవాబు చెప్పాడు: "వెళ్ళక తప్పుతుందా? ఇది మన జాతి చావుబ్రతుకులకు సంబంధించినది!" అని.

ఇద్దరమూ బజారుకువెళ్ళి భారతముకొనుక్కువచ్చాము. యుద్ధపంచకమున్న భాగము కొంటాడేమో అనుకున్నాను. నాకు ఉద్యోగపర్వము కావాలి అని ఆ సంపుటము కొనుక్కున్నాడు విశ్వేశ్వరరావు. "కీచకవధగాధ మా గొప్పగా వర్ణించాడు తిక్కన. నిజంగా, ఆయన భావకవిత్వంముందు మన భావకవిత్వం ఎంతో పేలవంగా ఉంటుంది" అంటూ కొన్ని పద్యాలు తీసి చదివాడు.

ఆ మధ్యాహ్నంబండికి గుంటూరు వెళ్ళిపోయాడు విశ్వేశ్వరరావు. వెళ్లుతూ, నా ఆల్బమ్‌లో "ఇదిగో! ఇది నా కానుక నీకు! నే వెళ్ళిపోయాక చదువుకోబావా!" అంటూ, పద్యంవ్రాసి వెళ్ళిపోయాడు.

ఆతను వెళ్ళిపోయాక చదువుకున్నా, చాలాసార్లు అతని జిలిబిలి పలుకులు. ముద్దొస్తూఉంటుంది అతని భాష, అతని భావము:

గడ్డి పువ్వుని! నన్ను ప్రేయసి!
గాలి తరగల తేలిపోతూ

## సా గు తు న్న యా త్ర

కళ్ళలో అద్దాల మెరుగులు
చల్లి కలచెద వెందుకే!
నీకు నేనే కావలిస్తే
నింగి వొదులుకు నీవే సీతా
కోక చిలుకవో, దేనివో అయి
రాగలవు!

నే నొ ద్దు క న కే

ముత్తెములో రత్నాలో యేరుతో,
చిత్రమవు నా మబ్బు కడలినె
అర్ధచంద్రుని దోనెలోనే
అడుకుంటావు!
గడ్డిపువ్వుని! రేకు రెప్పల
కలలు కంటూ కలవరిస్తో
కలత నిద్దురలోనె యెప్పుడో
కళ్ళు మూస్తాను!

ఎంతో జాలి కలిగిస్తాయి ఈ మాటలు, చదివినప్పుడల్లా. అతి సులభమైన పదజాలంతో, ఎరితో అమాయకమైన భావాలతో చెప్పుకున్నాడు తన ఆర్ద్రహృదయ గాథ. అతనియెడల సానుభూతితో నిండిపోతుంది, నా హృదయం. అతను కల్పించిన ఈ గడ్డిపువ్వురూపము అలా శాశ్వతంగా ఉండిపోయింది నా మనస్సులో. అంతేకాదు; ఉన్నట్టుండి, నేనే ఆ గడ్డిపూవును అనిపిస్తుంది.

అందువల్లనే ఎన్నోయేళ్ళు అయినాక, నేను చిత్రకళ అభ్యసించి, బొమ్మలు చిత్రించడం నేర్చుకున్నాక, ఒక గడ్డిపువ్వు బొమ్మవేశాను. వెనుక, ఆకాశాన్ని అంటుతూన్న ఉన్నతమైన పర్వతశిఖరము; క్రిందుగా, అతి క్రిందుగా,

## సాగుతున్న యాత్ర

మంచుతెరవీడుతున్న భూమిలో గాలిలో రెపరెపలాడుతున్నది గడ్డిపువ్వు. ఈ బొమ్మకు 'ఆదర్శజీవులు' అనే పేరు పెట్టాను. అంబర చుంబితమైన కొండ నెత్తమూ నేలపై ఊగుతున్న గడ్డిపూవూ రెండింటికీ ఒకటే ఆదర్శము: ఆత్మ సాక్షాత్కారము, ఆత్మ పరిపూర్తి.

గురుతుల్యులు దేవీ ప్రసాద్‌రాయ్ చౌధురీ ఈ చిత్తరువునుచూచి అన్నారు: "భేష్! మంచి భావన. కాని, ఇందు చిత్రకళకంటే కవిత్వమే ఎక్కువపాలు ఉన్నది" అని.

కవి, విశ్వేశ్వరరావుదే ఆ కవిత్వపుపాలు!

అనఘ ! యిదె హేమరత్న సింహాసనంబు
నిచ్చగల దేని గూర్చుండు మిందు వచ్చి
కాక కార్యాంతరాసక్తి కారణముగ
నేగదలచిన వాడవో ఎచటికైన ?
నవశిరీష సుమంబుల నవకమునకు
నన్నదమ్ములు వోని నీ యడుగుదమ్మి
లెంతదూరంబు నడిపింప నిచ్చగించె
నోకొ?, నిర్దయమైన నీయుల్ల మిపుడు?
......మానవుడవైతివేని నిమ్మహి కృతార్థ
విబుధ లోకంబె లోకంబు వేల్పువేని
భువనముల కెల్ల మీదధోభువన మీవు
భుజగరాజాన్వయము నందు బుట్టితేని !

శ్రీనాధునిదమయంతి అంటూంది, ఈ మాటలు, దిక్పాలుర దూతగా వచ్చిన నలునితో. ఎంత సహజంగా ఉన్నది, వాగ్ధోరణి! ఎంత సొంపుగా ఉన్నది పద్యం నడక తీరు! మొదట, ఎంతో అతిథిమర్యాద. ఉత్తర క్షణంలోనే ఎంతో ఆప్యాయత. పూలరేకులవలె మెత్తనైన అతనిపాదాలు కాలినడకవల్ల కందిపోతాయేమోనని స్త్రీ సహజమైన ఆవేదన. ఎంత ధన్యుడు, ఆ నలుడు! ఇంతటిఅనురాగంలో అతను తను వచ్చిన దేవకార్యం మరచిపోవచ్చు. కాని, అతడు ధీరుడు.

నాతో నాలుగు రోజులుఉండి వెళదామని వచ్చిన స్నేహితుడు, నండూరి కృష్ణమాచారి చదువుతున్నాడు ఈ పద్యాలు నా కోసం. అంతకు ముందు నేను శృంగారనైషధం గురించి విని ఉన్నాను కాని, ఇంతవరకూ చదువలేదు. ఏదో మాటవచ్చి, కృష్ణమాచారి చదువసాగాడు, తనకు కంఠతా వచ్చిన ఈ చక్కని

పద్యాలు. సాగగా, సాగగా, ఈ ఘట్టం నన్ను ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ తన్మయుణ్ణిగా జేసింది. ఎంతటి నాటకీయత ఉన్నది, ఈ సన్నివేశంలో! చిన్నప్పుడు "నలదమయంతు లిద్దరు మనఃప్రభావానల దహ్యమానులై" అంటూ అరణ్య పర్వంలోఉన్న పద్యాలు క్లాస్‌లో చదువుతూ ఉన్నప్పుడు ఎవరో పురాణవ్యక్తులుగా మాత్రమే కనుపించిన నలదమయంతులు శ్రీనాధుని కవితలో, పంచప్రాణాలూ పోసుకుని, కళకళ్ళాడుతూ కట్టెదుట సాక్షాత్కరించారు "ఎంత ఆధునికంగా ఉన్నది. ఈ పాత్రపోషణ, చక్కని ఈ ఏకాంకికలో లాగ!" అనుకున్నాను.

మరికొన్ని ఘట్టాలలోని పద్యాలు చదువమంటే 'నా కన్నీ జ్ఞాపకంలేవు. పుస్తకముంటే చదువుతాను' అన్నాడు, కృష్ణమాచారి. 'ఊళ్లోకివెళ్ళి కొనుక్కు వద్దాము పద' అంటూ లేచి పైమీద కండువా వేసుకొంటూ ఉంటే, అతను అన్నాడు: "కొనదలచితే, వేదంవెంకట్రాయ శాస్త్రిగారి వ్యాఖ్యానంతోఉన్న శృంగార నైషధమే కొనాలి; నీకు ఎంతో అక్కరకు వస్తుంది. అద్భుతమైన ఆ వ్యాఖ్యానము" అని. "సరే! అదే కొందాము, పద" అని నేను బయలుదేరగా, "ఆ కాపీ ఈ ఊళ్లో దొరుకదు. తెనాలిలో ఒక్కచోటనే ఉండాలి. లెక్కకు మూడు కాపీలు. అవీ అమ్ముడైపోయాయో, ఉన్నాయో!" అని అతను సందేహిస్తుండగా, ఇక అతనిని మాట్లాడనియ్యకుండా బలవంతాన బండిలో కూర్చోపెట్టి ఎక్స్‌ప్రెస్ అందుకొని, తెనాలి తీసుకువెళ్ళాను. ఒక్కటే కాపీ ఉంది. పన్నెండు రూపాయలు. ఆ రోజులలో పన్నెండు రూపాయలంటే పన్నెండు వరహాలన్నమాట!

ఎంత సంతోషించానో చెప్పలేను. పెన్నిధినిగన్న పేదలాగ ఆ పుస్తకము చేతిలో పుచ్చుకుని నేను. పనసపండు కోసినపుడు నిగనిగలాడే ఆ బంగారపు తొనలు జ్ఞాపకంవచ్చాయి. ఒక్కొక్క పద్యం చూస్తూఉంటే. ఆ సాయంత్రం బెజవాడలో కృష్ణ ఒడ్డున కూర్చుని మళ్ళా చదువుకున్నాము ఆ ఘట్టమే — నలదమయంతుల సంవాదము.

దమయంతి నలుని అతని పేరు అడగడమూ, అతను అతి చమత్కారంగా బదులు చెపుతూ, తన పేరు చెప్పకుండా తప్పించుకో యత్నించడమూ ఎంతో

రమ్యంగా ఉన్నాయి. నలుడంటాడు : "ఎవరూ తమ పేరు తాము చెప్పుకోరు. అది ఆచార విరుద్ధము. పైగా, ముఖాముఖిని సంభాషిస్తూన్నప్పుడు, సమస్త వ్యవహారికమూ 'నీవు' 'నేను' అనే మాటలున్నాయిగా, ఇంకా పేర్లతో పని ఏమిటి ?"—అంటాడు. అని "ఇంతమాత్రము చెపుతాను: నీవు రాజకన్యవు, మాననీయురాలవు; అటువంటి నీతో సమాన ప్రతిపత్తిగల సంప్రదాయానికి చెందినవాడనే నేను, ఇది నమ్ము" అంటాడు. ఇక్కడ శ్రీనాధుని నలుడు ఒక చక్కనిమాట అంటాడు:

...నృపతి కన్యవు గడుమాననీయ వగుట
మైత్రి కలిసేయ దగ దేను మనుజ విభుడ
రాజవంశ కరీరుండ, రాజవదన !

ఈ 'మైత్రి' అనేమాట నన్నెంతో సంతోషపెట్టింది. ఇంతవరకూ, నేను చూచినంతవరకూ, ప్రబంధాలలో స్త్రీ పురుషుల మధ్య ప్రేమ, మోహము, ఆకర్షణ, అనురాగము ఇటువంటి భావాలేగాని, 'మైత్రి' అనే భావం కనిపించలేదు. ఇక్కడ ఈ మాట చూచాక, శ్రీనాధుడు నాకు మరింత దగ్గరి వాడయ్యాడు.

కాని, నలుని చమత్కారపు మాటలు విని దమయంతి ఊరుకుంటుందా ! ఊరుకోదు. ఆమె మరింత పెంకిగా అంటుంది: "చాలా తెలివిగా మాట్లాడుతున్నావు అనుకుంటున్నావు కాబోలు ! పేరు చెప్పడమే నీకు అనాచారమైతే, నీతో మాట్లాడడము మాత్రము మాకు ఏమంత సబబు ?"

అనఘ ! మము నీవు వంచింప నభిలషించె
దేము నేరమె వంచింప నిపుడు నిన్నుఁ
బేరు సెప్పిన నీ కనాచారమేని
మాకు న్యాయంబె నీతోడ మాటలాడ ?

అంటుంది, దమయంతి. అని, ఇంకా చమత్కారంగా ప్రశ్నిస్తుంది :

తగవే కుల కన్యలకును
మగవారలతోడ రూప మహనీయులతో
మిగులంగ దడవు లోపలి
నగభులలో మాటలాడ నయతత్త్వనిధీ ?

ఇక్కడ 'నయతత్త్వనిధీ' అంటూ ఎత్తి పొడుపూ ఉంది; 'రూపమహనీయుడవు' అనే పొగడ్తా ఉంది. నలుని సౌందర్యాన్ని మెచ్చుకుంటుంది ఆమె. కాని, ఈ మెచ్చుకోడానికీన్నీ "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు" అనే వరూధిని మెచ్చుకోడానికీన్నీ యెంతో తేడా ఉన్నది. దమయంతి రాజకుమార్తె; వరూధిని గంధర్వ స్త్రీ.

చదివిన కొలదీ ఇంకా, ఇంకా యెన్నో అందాలు కనిపించాయి నాకు ఈ మహాకావ్యంలో. ఎంత చక్కని రూపకల్పన; ఎంత సహజమైన ఉపమానాలు. ఆః అంటూ, నిర్ఘాంత పోయేటంతటి అద్భుతమైన ఉత్ప్రేక్ష, అతిశయోక్తి. దమయంతికై ఇంద్రుడు అనుభవిస్తున్న విరహాన్ని వర్ణిస్తాడు నలుడు, ఎంతో రమ్యంగా. కల్పవృక్షము ఎవ్వరేది అడిగినా లేదనకుండా ఇస్తుంది. అటువంటి దాతకు ఏ గతి పట్టింది :

విరహాతాప ప్రశాంతికై విబుధపతికి
నార్ద్ర పర్యంక విధికిగా నపచయింప
బహుల లేములు వాపంగ బాలుపడిన
యమర తరువున కొదవె బుష్పములు లేమి !

చిగురుటాకులను మేసి మేసి, పచనుబారిన కంఠస్వరంతో కూస్తూ, తన ప్రాణాలు తీస్తుందేమో గండు కోయిల, అనే భయంతోనూ, చెవులు చిల్లులయ్యేటట్టు పలుకుతూ చిలుకలు వేధిస్తాయేమోననే భీతిచేతనూ, ఇంద్రుడు నందనోద్యానానికి

వెళ్ళడం మానుకున్నాడట, దమయంతి విరాళిలో! మూడుకన్నులేఉన్న వాడైన శివునితో వేగలేక శరీరాన్నే పోగొట్టుకున్న మన్మథుడు వేయికన్నుల వేల్పుతో నిగ్రహించి ఏమి కానున్నాడో, పాపము! వీటన్నిటికంటే మరీ అందమైనది: విరహాతాపంలోఉన్న అగ్నిదేవుడు భక్తులు యథావిధిగా తనకు కానుకగా ఇచ్చే పువ్వులను చూచి బెదిరిపోతాడట—అవి మన్మథబాణాలు కాబట్టి! అమడ దూరానఉన్న నిప్పు సెగ తగిలినా వాడిపోయే పువ్వులను చూచి అగ్నిదేవుడు బెదరిపోవడం యెంత సొగసుగా ఉంది!

నలదమయంతుల సంభాషణ సాగినకొలదీ, మరీమరీ రక్తి కడుతుంది. ఆమె ఒద్దు అని బ్రతిమాలుకున్నా, ఇంకా ఇంకా వర్ణిస్తాడు అతను, దిక్పాలుర ప్రతిభా వారి సాంగత్యంవల్ల ఆమెకు లభింపగల మహావైభవమూ. ఆఖరికి ముళ్ళ వంటి ఆ మాటలను భరింపలేక ఏడ్చివేస్తుంది అబలయైన దమయంతి. ఇంతవరకూ ఉన్న వచనా చమత్కృతీ, మాటకుమాట అందియ్యడమూ, అన్నీపోయి, బేలగా ఏడుస్తుంది రేని ముందట, దమయంతి. ఈ ఏడ్పు వజ్రాయుధంలా పని చేస్తుంది. నలుని ధీరత్వము పెనుగాలిలో మేలిముసుగులా పటాపంచలై పోతుంది. ఆ నిమిషం, ఆమె ప్రేయసీ అతని ప్రియుడూ. తాను ఫలానా అని తెలియజెపుతూ, ఆమెను ఉపలాలిస్తాడు నలుడు. ఇక, ఈ ఏకాంక నాటికకు తెర దిగజారుతుంది.

పూజ్యులు వేదము వెంకట్రాయశాస్త్రి పేరు చిరస్థాయిగా ఉండటానికి, నా ఉద్దేశ్యంలో, ఈ ఒక్క వ్యాఖ్యానం చాలును. పూవులలో పెట్టి పూజింపదగినది ఈ వ్యాఖ్య. నా మటుకు నేను, శ్రీనాథుని ప్రతిభ ఎంతగా ఆనందించానో, ఎన్నిక్రొత్త విషయాలు తెలుసుకున్నానో, మన భాషగురించి, మన భాషా సంప్రదాయాలను గురించీ, ఈ వ్యాఖ్యానం సహాయంతో!

నండూరి కృష్ణమాచారిని నేను అసలు ఎప్పుడు కలుసుకున్నానో సరిగా చెప్పలేను. ఇదిమాత్రం తెలుసు: మా మొదటి చూపులలోనే, మా హృదయాలు ఏకమయ్యాయి; అతనంతమంచివాడు. అతను నూటికి నూరుపాళ్ళూ గాంధీ

శిష్యుడు. ఎంతటి భౌతికమైన కష్టాలనైనా ఓర్చుకోగలడు ఇక మానసికమైన కష్టాలు రానేరావు, అతని చెంతకు. అతనికి ఎటువంటి వాంఛాలేదు కాబట్టి. విసుగూ విరామం లేకుండా, ఎంత పనైనాచేస్తాడు. తనకోసం కాదు, ఇతరులకోసం; శాశ్వత బ్రహ్మచారి - అతని జీవితంలో ఎక్కువభాగం పరుల సేవలోనే గడచిపోయింది. అప్పటి కప్పుడే రెండుసార్లుకాబోలు, జైలుకివెళ్లాడు. మూడవసారి యాత్రకు సిద్ధంగాఉన్నాడు. అసలు ఆ పనిమీదనే అనుకుంటాను, బెజవాడవచ్చాడు. అదో వీరగాథలా వింటూ ఉండేవాడను ఇదివరకు అతను ఉద్యమాలసందర్భంలో పడిన బాధను గురించిన వివరాలు. ఆత్మకూరి గోవిందాచార్యుల మేనల్లుడనుకుంటాను కృష్ణమాచారి. ఆయన అడుగు జాడలలోనే నడచి ఉద్యమానికి ఆయువుపట్టుగా వర్తించాడు కొన్నాళ్లు. ఎక్కడ ఉద్యమం కాస్త బిగి సడలినట్టుగాతోస్తే అక్కడ అవతరించేవాడు కృష్ణమాచారి. కొంత ప్రత్యక్షంగానూ, కొంత పరోక్షంగానూ ఎంతో చైతన్యం కలిగించాడు. కాని, ఎన్నాళ్ళు ఈ పాట్లు? ఎప్పటికైనా విశ్రాంతి అంటూ ఉండనక్కరలేదా? అనుకునేవాణ్ణి నేను. ఒకసారి, ఆ మాట అన్నాను కూడా అతనితో: "ఎంత తాపత్రయము! ఎంతమంది లేరు, పనిచేసేవారు నీతోనే ఉన్నదా, ఈ పోరాటమంతా? నీవు నాతోవెఉండిపో. నె నడిగినప్పుడు పద్యాలు చదివివినిపిస్తూండు. స్నేహితుడవు నిన్ను పోషింపగలశక్తి ఉన్నది నాకు దేవుని దయవల్ల. ఉండిపో ఇక్కడే!" అన్నాను. కృష్ణమాచారి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

మరునాడో, ఆ మూడవనాడో, చదువుతూన్న పుస్తకం చదువుతూనే అలా వీధిలోకి వెళ్ళినట్టు వెళ్ళి, చక్కా వెళ్ళిపోయాడు. అతను ఏ భీమడోలు వద్దనో, ఎక్కడో అరెస్ట్ అయినాడనీ, పోలీసులు అతనిని రాజమండ్రీ జైలుకి తీసుకుపోయారనీ విన్నాను. అతనికోసం చాలా బాధపడ్డాను. ఇంత త్యాగము అవసరమా అనిపించింది అనేకసార్లు. కాని, ఇది ఎవరికివారే నిర్ణయించుకోవాలి అని తెలుసుకున్నాను తర్వాత తర్వాత.

ప్రముఖులందరూ ఒకరి తర్వాత ఒకరు జైలులో ప్రవేశించారు. ఇక ఊరూ పేరూలేని సాధారణ వలంటీర్లు, వేలాది వేలు. స్త్రీ పురుషులు ఎందరు కుమిలిపోతు

న్నారో సి క్లాస్ అనుభవిస్తూ. వీరుపడుతున్న కష్టాలనుగురించి వింటూన్న కొలదీ ఏమాత్రమూ మనశ్శాంతిలేకుండా పోయేది.

అప్పుడు నాకు కబురువచ్చింది. మాన్యులైన ఒకానొక ఉద్యమనాయకులు కబురుపంపారు. "అతను ప్రత్యక్షంగా ఈ ఉద్యమంలో పాల్గొనరాదని తెలుసు కాని పరోక్షంగా మాకు ఈ పని చేసిపెడుతూ ఉండాలి" అని ఆ నిర్దేశము. వారిపై ఉండే భక్తి గౌరవాలవల్ల నేను పరోక్షంగానే వారు చెప్పినట్లు కొంత సాయపడ సాగాను. కానీ, మనస్సులోమాత్రం బాధగానే ఉన్నది. చేతనైతే, ఉద్యమంలో ఉరికి అందరిలాగా జైలుకి వెళ్ళాలి. భౌతికమైన ఆ బాధఅంతా అనుభవించాలి. అంతేగాని, ఈ ముసుగు ఏమిటి అనుకున్నాను. అప్పుడు ఈ విషయాలలో మిక్కిలి అనుభవముగల ఒక స్నేహితుడు నాకు నచ్చచెప్పారు: "నీవుకూడా వెళ్ళిపోతే ఎలాగ, నీకు నియమించిన పని చాలా ముఖ్యమైనది. జైలుకు వెళ్ళడము కంటే, ఉద్యమం నిర్విఘ్నంగా కొనసాగడానికి కావలసిన పథకము నీవు పాటిస్తున్నది. నీ అంటివారు మాకు ఇంకా కావాలి" అన్నారు.

ఆ ఊళ్ళో పోలీసులలో పెద్ద ఉద్యోగస్థులందరూ నన్ను ఎరుగుదురు. సబ్ కలెక్టరూ, మున్సిఫూకూడా నాకు స్నేహితులే. ఒకనాడు నేను పనిమీద గుంటూరు వెళ్ళి తిరిగి వస్తూండగా, ప్లాట్‌ఫారమ్‌నుంచి జట్కాబండిదాకా నాతోకూడా నడచి వచ్చాడు సర్కిల్ ఇన్స్పెక్టర్. ఆమాటా ఈమాటా మాట్లాడుతూ, ఏదో యథాలాపంగా అంటూన్నట్టు, "ఏం అనుకోవద్దు. మీరంటే మా కందరికీ చాలా అభిమానం. మీ ఒంటిమీద ఈగవాలితే భరింపలేము. కాని, కాస్త జాగ్రత్తగాఉండండి. రోజులు మంచివికావు" అని నా చెవిలో చెప్పి, "టెన్నిస్‌కిరావటం మానేశారేమి? చాలా రోజులైంది మీతోఆడి" అని బిగ్గరగా అంటూ, చక్కా వెళ్ళిపోయాడు సైకిలెక్కి.

ఇంటికి వెళ్ళాక, మిత్రులను కలసికొని సంప్రతించాను. "అతను ఊరికే హెచ్చరించి ఉండవచ్చును. లేకపోతే, ఒకవేళ, మీరే బయటపడతారేమో అని కూడా అని ఉండవచ్చును. ఎందుకైనా, కొంతకాలం మీరు దూరంగా ఉండడమే మంచిది" అన్నారు.

ఆ రాత్రి తల్లాప్రగడ నరసింహాశర్మ మా ఇంటికివచ్చారు. ఎలా తెలిసిందో, ఈ సంగతంతా ఆయనకూ తెలిసింది. ఆయనా, "ఇప్పట్లో నీవు ఏ సంబంధమూ లేకుండా ఉంటేనే, తర్వాత మాకు ఎక్కువ సాయపడవచ్చు" అన్నారు.

నరసింహాశర్మ అంటే నాకు ఎంతో భక్తి, గౌరవమూను. అది ఒకనాటిది కాదు. నా పదకొండవ యేటినుంచీ నేను ఆయన ఆదర్శాలను ప్రశంసించేవాడను. మా కుటుంబములో గాంధిగారితత్త్వాన్ని నిజంగా అమలులో పెట్టినవారిలో మొదటి వ్యక్తి ఆయన. తాను మనస్సాక్షిగా సరియని నమ్మిన పని ఎంత కష్టమైన పనైనా చేయగల సమర్థుడు ఆయన. మా అందరిలోనూ మొట్టమొదటిసారిగా మాలలను తన ఇంట్లోకి ఆహ్వానించి వారి సాపంతిని భోంచేసిన ఖ్యాతి ఆయనదే. అందుచేతనే ఆయన, ఆయనభార్య, మా వదినె విశ్వసుందరమ్మ మాకు ఎంతో ఆదర్శ ప్రాయంగా ఉండేవారు. నేను అడయార్ చదువు పూర్తిచేసుకుని విజయనగరం వెళుతూ రాజమహేంద్రవరంలో ఆగి, ఒకపూట శర్మగారి ఆశ్రమం ఆనంద నికేతనంలో ఉండి మరీవెళ్లాను. ఆరోజులలో, విష్ణు. భీమయ్య అనే ఇద్దరు హరిజన బాలురూ ఆ ఆశ్రమంలో ఉన్నారు. ఆ కుర్రవాళ్ళను ఇద్దరినీ కన్నతల్లికంటె ఎక్కువ ప్రేమతో చూచేది మా వదినె. విష్ణు ఇప్పుడు ఢిల్లీలో హరిజనకాలనీలో ఉద్యోగిగా ఉన్నాడు. భీమయ్యమరేదో ఉద్యోగంలో తనవారి సంఘక్షేమానికి తోడ్పడుతున్నాడు.

నరసింహాశర్మ ఉద్యమ విషయమయ్యే ఆ రాత్రి బెజవాడ వచ్చారు. నాతో చెప్పలేదు కాని, మరునాడు వేకువనే కాంగ్రెస్ భవనముపై జరిగిన వాలంటీర్ల దాడికీ వారి రాకకూ సంబంధం ఉండి ఉండాలి. కాస్సేపు నాతో ఈ మాటా ఆ మాటా మాట్లాడి, "రేపో. మాపో నేనూ జైలుకివెళ్ళక తప్పదు. తరువాత మీ వదినె వంతు. ఆమె బహుశా తెనాలిలో అరెస్ట్ అవుతుంది. నీవు అప్పుడు తెనాలివెళ్ళి రిమాండ్‌లోఉన్న ఆమెను చూచిరావాలి. నీకు మళ్ళీ కబురువస్తుంది" అన్నారు. రాత్రి పదింటికికాబోలు వెళ్ళిపోయారు ఆయన; చేతిలో చిన్న ఖద్దరుసంచీ తానూ చకచకా నడచి వెళ్ళిపోయారు.

## సాగుతున్న యాత్ర

ఆయనవెళ్ళిన కాస్సేపటికి చేతిలో ఒక చిన్న ట్రంక్ పెట్టె పట్టుకు ఒక ముసలావిడా, ఆమెతో ఇరవై ఏళ్ళ అబ్బాయీ నా వద్దకు వచ్చారు. వారు క్షత్రియులు. భీమవరందగ్గర వీరవాసరంనుంచి వచ్చామన్నారు. బాగా లోనికివచ్చాక, ఆమె సన్నని కంఠస్వరంతో చెప్పింది. వారిని శర్మగారు నావద్దకు పంపారని. వారికి అప్పటికి కావలసిన సదుపాయాలు అమర్చి, పడుకునేందుకు చోటు చూపాను. కాని, రాత్రి చాలాసేపు నాకు కంటికి నిదురలేదు. ఆమెకు ఎంతలేదన్నా డెబ్బది ఏళ్ళుంటాయి. ఆ అబ్బాయి ఆమె మనుమడు అనుకుంటాను. తన కొడుకుల నందరినీ జైలుకుపంపింది ఆమె. ఇప్పుడు మనుమనివంతు. ఆమె ఎలా ఓర్చుకుంటోంది ఈ వేదన అనుకున్నాను.

తెల తెలవారుతూండగా వారిద్దరూ లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, చిరునవ్వుతో నా వద్ద సెలవు తీసుకున్నారు. ఆమె ఎంతోబాధ పడుతుంది అనుకున్నాను. అటువంటిబాధ ఏమీ కనిపించలేదు. ముడతలుపడిన ఆమె ముఖంలో. కుడిచేతితో పెట్టె పట్టుకొని ఎడమచెయ్యి మనుమని భుజానమోపి వెళ్ళిపోయింది ఆమె తన మనుమనునితో. అప్రయత్నంగానే, నేనూ వారి వెనకాలే వెళ్లాను కాస్త దూరంగా. వీధిమలుపువద్ద వారు క్షణం ఆగారు. అతను కుడిపైపు వెళ్ళిపోయాడు- కాంగ్రెస్ భవనంవైపు. ఆమె తిన్నగా పెట్టెమోసుకొని బస్‌స్టాండ్‌వైపు వెళ్ళిపోయింది.

"మళ్లా ఎప్పటికి కలుసుకుంటారో వారిద్దరూ" అనుకున్నాను. అక్కడే నిలబడిపోయాను, కాసేపు. ఇంకొక్క ఐదునిమిషాలలో పెద్ద గందరగోళం వినబడింది "మహాత్మా గాంధీకి జై!" అనే కేకలు; పోలీసుల అరుపులు. లాఠీదెబ్బల ఫెళ ఫెళ ........ తరువాత తెలిసింది: భవనంపైన వలంటీర్లు దాడిచేశారనీ, ఒక నలభైమంది దెబ్బలుతిని అరెస్ట్ ఐనారనీ. వారిలో ఒకడు రుద్రరాజువారి అబ్బాయి. వీరాంగన, అతని ముత్తవతల్లిని ఇప్పటికీ భక్తితో జ్ఞాపకంచేసుకుంటూ ఉంటాను.

అనుకున్న ప్రకారం ఒక వారంరోజులకు కబురువచ్చింది. మా మేనత్త కూతురు అనగా మల్లవరపు వెంకటకృష్ణారావు అక్కగారు, విశ్వసుందరమ్మ అరెస్ట్ అయినట్టు. చిన్నప్పుడు మాతో కొన్నాళ్ళు ఉన్నది మా వదినె, మద్రాసులో.

అప్పుడే చూచాము మేము ఆదర్శజీవికి ఉండవలసిన లక్షణాలు అన్నిటినీ ఆమెలో. తరువాత, ఆమె తన భర్త తల్లాప్రగడ నరసింహశర్మ అనుసరిస్తూన్న సిద్ధాంతాలను తనూ అనుసరించింది. అన్ని విధాలా అతనికి చేదోడు వాదోడై ఉంటూ, నిజమైన సహధర్మ చారిణిగా వర్తించేది. ఆవిడ ఆరోగ్యం మాత్రం ఏమంత బాగులేదు. ఐనా, జైలుకి వెళ్ళడం మానలేదు.

మా వదినెను చూడగా, కరగి నీరైంది నా మనస్సు. నిజంగా, ఈ త్యాగం అవసరమా అనుకున్నాను నేను. ఇనుప ఊచల వెనుకఉన్న ఆమెను చూడగానే ఉద్యమంపైన కోపంకూడా వచ్చిందినాకు. ఆ కోపానికి అర్థంలేదు. కేవలం అశక్తత వలన కలిగినకోపం అది.

"వదినా! ఎలా ఉన్నావు" అంటూ ఇనుప ఊచలలోంచి చేయిచాచి ఆమె చేయిపట్టుకున్నాను. ఆమె మాట్లాడకుండా, తన మెడలోఉన్న ఒంటిపేట బంగారపు గొలుసూ, సన్నని పగడాల దండా, తీసి నా చేతిలోఉంచింది. చేతినున్న రెండు జతల బంగారపు గాజులూ తీసి నా చేతికిచ్చింది.

"మంచినీళ్ళు త్రాగడానికి గ్లాస్‌లేదు. తెచ్చిపెడతావా? ఒక అద్దముకూడా తీసుకురా" అన్నది మెల్లిగా.

నేను చప్పున బజారుకు వెళ్ళి, చక్కని అద్దమూ, నాకు కనిపించిన గ్లాసులలోకల్లా మరీ అందమైన గాజు గ్లాసూ కొనుక్కువచ్చాను. కాని, ఇనుపఊచల లోంచి ఆమెకు అందిచ్చే తొందరలో ఆమె పొరపాటు వల్లనో, నా పొరపాటు వల్లనో కాగితంలో చుట్టిఉన్న గాజుగ్లాస్ పటుక్కున పగిలి పది ముక్కలైంది. ఆమె చిరునవ్వు నవ్వింది. "చూశావా! ఏ ఇత్తడి గ్లాసో తెస్తే సరిపోయేది. నాజూకు మనిషిని నీవు. ఇలాగే అవుతూఉంటుంది" అన్నది. ఆమె మాటలలో యెంతో అంతరార్థముంది. మళ్ళా బజారుకివెళ్ళి, ఇత్తడి గ్లాస్ తెస్తానన్నాను. "ఇంకా ఏమి వెళతావు. నేను వేరే తెప్పించుకుంటానులే. ఈ కాస్సేపూ ఇక్కడే ఉండు" అన్నది మా వదినె.

ఇంతల్లోకి పోలీస్ జవాన్‌వచ్చాడు, నా ఇంటర్వ్యూ వేళ దాటిందని, సూచిస్తూ. నేను వచ్చివేస్తూ ఆమెకేసి చూశాను. ఆమె నా వైపు చూడడములేదు. వంచిన తలతో భూమివైపు చూస్తోంది సీతాఅమ్మవారిలాగ!

ఎజవాడకు తిరిగివస్తూ, త్రోవ పొడుగునా ఆమెను గురించే ఆలోచిస్తున్నాను. చిన్నప్పుడు ఆమె వద్దనే నేనూ మా అక్కయ్యా తెలుసుకున్నాము, రాజారామ మోహనరాయ్‌ని గురించీ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ని గురించీ, కందుకూరి వీరేశలింగంగారిని గురించి. పెరిగి పెద్దవాడనయ్యాక మహాత్ముని గురించి యెన్నో విషయాలు తెలుసుకున్నాను నేను, మా వదినె చెప్పగా. అప్పటికిపాతికఏళ్ళ క్రిందటి మాట ఐనా. నిన్నలా కనిపించింది ఆ మా మద్రాస్ స్నేహము.

ఇంటికివచ్చి, వేరే ఒక చిన్న ఆలమారలో పదిలపరచిన పద్యాల ఆల్బమ్ తీసి కవయిత్రి విశ్వసుందరమ్మ వ్రాసిన ఈ పద్యం చదువుకున్నాను:

అరమరలేని మన చిరతర స్నేహ రుచుల్
కురిసిన వెన్నెలలా, అరవిరిసిన మల్లియలా!

మనమున నెవ్వగలా, మాసెను
ఘనమగు నెయ్యములో,
మెరపుల గుంపేమో, అది
తరగని వెలుగేమో!
దినములు నిముసములై చనియెను
వడిగల నడకలతో,
కన్నుల తళుకేమో, అది
ఎన్నికదినముల పున్నెపు ప్రోవో!
జీవితమున కంతా అది

## సాగుతున్న యాత్ర

చెలువపు నిగ్గేమో,
పరమప్రేమకు చిహ్నమైన తెలి
వెన్నెల కాంతుల సన్నని తళుకేమో!

ఒక చక్కని రచన చూపించి, ఇది కవి వ్రాసినదా, కవయిత్రి వ్రాసినదా అని ప్రశ్నిస్తే చటుక్కున చెప్పడం కష్టమంటారు, సాధారణంగా. కాని, విశ్వ సుందరమ్మ ఈ 'స్నేహరుచి'లో మాత్రం స్త్రీ హృదయము మూడు మూర్తులా ప్రతిబింబిస్తూన్నట్టు తోస్తుంది నాకు. ఇటీవలనే ఆ త్యాగజీవి ఆకస్మికంగా ఈ లోకాన్ని విడిచివెళ్ళి ఉండకపోతే ఆ 'వెన్నెల కాంతుల సన్నని తళుకు ఇంకా యెంతగా విస్తరిల్లేదో మన తెలుగు వాఙ్మయంపైన।

౨౪

ప్రేమ వియోగ గీతిక లెపుడేని నాయ
భాగ్యవశమున నీ కంట బడినయేని
అవల ద్రోయుము, నీ కనర్హములు సకియ.
వలపు టాకలి వేగి, నావలెనె మాన
జీవితమ్ముల నొంటి కృశించు భగ్న
హృదయులకె కాని, ఆటగా బ్రతుకు గడపి
కలత నెరుగని సౌఖ్యజీవులకు గాదు.
ఈ విరహ గీతికలు శోకభావ భరము
లివి పఠించిన నీ పూవు టెద కలంగు.

అవిరతానంద విలసితమ్మైన నీదు
జీవితమ్మున నను చింత సేయకుండు
టెరుగుదును. కాని, గాటంపు మరపు తెరల
నడగి పోయిన నాదు నెయ్యంపు కథలు
ఈ విరహ శోకగీతి నాలించి నంత
ఉలికిపడి లేచు మెరపు కత్తుల విధాన !

స్నేహితుడు మూర్తి తాను రచించిన ఈ పద్యమును నాకు చదివి వినిపించి నప్పుడు అందలికవిత్వము నా దృష్టి నాకర్షించింది కాని, అతడంత బాధపడు తున్నాడనుకోలేదు నేను. ఇదివరలో కాలేజీలో ఉండగా మహాకవి షెల్లీ 'ప్రేమ తత్త్వ'న్ని మూర్తి తెలుగుచేశాడు. ఆ రచన నే నే అనుకుంటా కృష్ణాపత్రికలోనో శారదలోనో ప్రచురింపించాను. ఈ రచనకూడా అలాగే కులాసాకి వ్రాశాడను కున్నాను కాని ఆవేదనతో వ్రాశాడని అనుకోలేదు. 'ఆటగా బ్రతుకు గడిపే సౌఖ్య

జీవులు', 'పూవుపెడద', 'మంపుతెరలు', 'నెయ్యంపు కథలు' చాలా బాగున్నాయి ఈ మాటలు అనుకున్నాను. వీటి అన్నిటికంటె మరీ బాగుంది 'మెరపుకత్తి'. ఇలా అనుకుంటూ, సాహిత్య మీమాంసలో ఉండిపోయానేగాని, అతను వ్రాస్తూన్నది వట్టి కల్పనేకాదనీ, ఆత్మకథ అనీ అప్పుడు నేను అనుకోలేదు. కాని, అతను ఆ రచన నాకు వినిపించి వెళ్లాక, ఆ రాత్రి పడుకోబోయేటప్పుడు చటుక్కున 'మెరపు కత్తి' జ్ఞాపకంవచ్చి అప్పుడు తోచింది నాకు, బహుశః నా స్నేహితుణ్ణి ఏదో ప్రేమబంధము చీకాకు పరుస్తున్నదని. మొదట చాలా ఆశ్చర్యపడ్డాను. మూర్తి చాలా 'కుదురైన' వాడు; కవిత్వపు పోకడలుఉన్నా, నాలాగ 'ప్రేమ పిపాసి' కాడు. నాలోఉన్న ఉద్వేగములేదు అతనిలో. ప్రతి విషయమూ ముందూ, వెనకా చక్కగా ఆలోచించే చేస్తాడు. మనస్సును ఇటూఅటూ పరుగెత్తనియ్యకుండా అదుపులో నుంచుకోగలడు. కాని, అటువంటివాడు, 'అప్రాప్త మనోహరి' కోసం ఇలా బాధపడడము కొంత వింతగా తోచి అతనికోసం నేను చాలా ఆదుర్దాపడ్డాను. పెనుగాలి వీస్తే పెద్దచెట్టుకే కష్టం; రెల్లుకి ఫరవాలేదు.

మరునాడు, ఉదయము అతనిని అడిగి తెలుసుకున్నాను, అంతవరకూ అతను మరి ఎవ్వరితోనూ చెప్పని అతని ఆత్మకథ. అతను చెప్పిన దానినిబట్టి నేను చిత్రించుకోగలిగాను అతనిని అంతగా ఆకర్షించిన ఆ వ్యక్తి రూపమైజాలను. రెక్కలమీద వెళ్ళి, ఆమె మనసు అతనిదెస మరల్చాలని సంకల్పించాను. కాని, అది సాగే ఊహకాదని తెలిసి విరమించుకున్నాను. ఆ తరువాత నా గొడవ గురించి అతనితో చెప్పడంలో అతనిమాటే మరచిపోయాను, మళ్ళీ మేము రెండుమూడు పర్యాయాలు కలుసుకున్నాను.

ఇది అప్పటికి నాలుగైదేళ్ళ క్రిందటిమాట - నేను బెజవాడలో ఇన్సూరెన్స్ పని ప్రారంభించేసరికి. అప్పుడు, ఒకరోజున ఉన్నట్టుండి మూర్తి రైలుదిగి, నా వద్దకు వచ్చాడు. అతనిని చూచి చాలా రోజులైనది కాబట్టి, ఎంతో సంతోషించాను అతని రాక గురించి. కాని, ఏదో గొప్ప బెంగతో అతనిముఖం మేఘావృతమై ఉన్నది. నేను కారణము అడుగలేదు. మేమిద్దరమూ బసవరాజు అప్పారావును

కలసికొని అతనితో కొంతకాలము గడపాము. ఈ రాత్రి సినిమాకు వెళదాము అని నేనంటే "కాదు, నాకు వేరే పని ఉన్నది. నీ సైకిలిస్తావా ఓసారి నాకు" అన్నాడు మూర్తి. "సైకిలుకేమి భాగ్యము, తీసుకువెళ్ళు" అన్నాను. ఎక్కడకు వెళుతున్నావు అని నేను అడుగలేదు. "ఉదయము పదిగంటల లోపుగా వస్తాను" అని మాత్రం చెప్పి అతను సైకిల్ ఎక్కి వెళ్ళిపోయాడు రైల్వేసేషన్ వైపు.

మరునాడు ఉదయం పది గంటలబండి వేళకు ఇంటికి వచ్చాడు అతను. మార్గాయాసంతో డస్సిఉన్నాడు కాని, నిన్నటి బెంగలేదు ముఖంలో. స్నానంచేసి, భోంచేసి, విశ్రమించి ఉండగా చనువుతీసుకుని నేను అతనితో అన్నాను: 'అతి భయంకర సాంద్ర నీలాభ్రపటలి, వాన కురిసిన ధవళిమ పూనినట్లు' ఉన్నదే నీ ముఖము! ఏమి? నీవు వెళ్ళినపని ఐనదా?" అని అడిగాను.

"ఆ! అవడమేకాదు, ఐపోయిందికూడా!" అన్నాడు చిరునవ్వుతో.

"అంటే?" అన్నాను నేను. ఏమిటో ఊహించుకోలేక, నా సందేహము నిజముకాదని ఆశిస్తూ.

"ఏముంది! ఇటో, అటో నిర్ణయించుకోడానికి వెళ్లాను - వెంటనే అలా నిర్ణయించుకోవలసిన అవసరం ఏర్పడ్డది కాబట్టి. ఇన్నాళ్లూ నేను అన్వేషించినది మృగతృష్ణే అని స్పష్టమైంది-ఏ మాత్రమూ సందేహము లేకుండా. ఇక 'ఎవరికి వారే యమునా తీరే', అబ్బ! పెద్దబరువు ఒదిలిపోయింది!' అన్నాడు" ఒళ్లువిరుచుకుంటూ. "ఇక ఆ విషయమై ఆలోచించనైనా ఆలోచించను" అన్నాడు అతి దృఢంగా.

ఒకానొక ఆరాధ్య దేవత తన పీఠమునుండి క్రింద పడిపోయిందని తెలుసుకున్నాను. అయ్యో! పాపము! అనుకున్నాను. వారిద్దరి గురించీ చాలా జాలిపడ్డాను. మూర్తి అన్నివిధాలా ఆదర్శపురుషుడు; అతనిని వరించి ఉంటే ఆమె సుఖపడి ఉండేది అనుకున్నా. ఐనా, ఈ విషయాలు మనము నిర్ణయించేవి కావుగా అనుకున్నాను తర్వాత.

కాని, నా స్నేహితుని బరువుతీరిన నూతనోత్సాహము చూచి, నేను ఇది నిజమేనా - తెప్పిపెట్టుకున్నదా ? అనుకున్నాను. నిజంగానే అతను గతమును విస్మరించడానికి విశ్వప్రయత్నంచేసి ఆ ప్రయత్నంలో గెలిచాడు అని విశదమైనంతనే అవును, అతను అంతకు సమర్థుడు; నాకు అంతటి మనోబలములేదుగా ! అని చాలా అనుకున్నా.

ఈ పర్యాయము అంతసేపూ నన్ను గురించే జరిగింది మా ప్రస్తావన. "సరే; నీవు ఎలా ఉన్నావు ? ఏమంత బాగున్నట్టులేదు" అని, "ఆ గాయమింకా మానసేలేదా ?.... ఆమె ఎక్కడున్నారిప్పుడు ?" అని ఎంతో ఆదరణతో ప్రశ్నించాడు మూర్తి. "నాకు తెలియదు" అన్నాను. నిజంగానే తెలియదు "తెలుసుకోవాలని ప్రయత్నించడము లేదా" అన్నాడు. "తెలిసి మాత్రం ఏమి లాభము" అన్నాను:

మూర్తిని రైలు ఎక్కించి వచ్చాక పడుకోబోయే ముందు నా బల్లమీద పుస్తకంతీసి నేను వ్రాసి ఉంచుకున్న పద్యం మళ్ళీ ఒక్కసారి చదువుకున్నాను.

చెప్పదు తల్లికిన్ వలపు జిక్కు దిశల్ దరహాస చంద్రికన్
గప్పదు వక్త్రతామరసగంధ సమాగత భృంగ సంఘమున్
రొప్పదు నిద్రగైకొనదు రోజ పరస్పర సక్తహారముల్
విప్పదు కృష్ణ మార్గగత వీక్షణ పంక్తులు ద్రిప్పదెప్పుడున్.

రుక్మిణీదేవి నిరీక్షణ సఫలమైంది. కాని, ఇతరులకు ఆ అదృష్టమెక్కడిది !

*   *   *   *

"లోకంలో అందరినీ ఇట్టే నమ్మివెయ్యకూడదు" అనేవారు మా తాతగారు. కాని, నమ్మక ఏమి చేస్తాము ? ప్రతి వ్యక్తినీ సందేహిస్తూ ఉంటే ఈ జీవితమే దుర్భరమవుతుంది. కాని, అలా అనుకొని కనపడ్డవారి నందరినీ నమ్ముతూ ఉంటే, ఒక్కొక్కప్పుడు చేతులు కాల్చుకుంటూ ఉంటాము. ఒకరోజున ఒక ఆసామీ వచ్చాడు నా వద్దకు. కోరారంగు ముతకనూలు బట్టలు; చాలా నెమ్మదిగల మనిషి.

ఎంతో మర్యాదస్తునిలాగ కనిపించాడు. బెజవాడకు పన్నెండుమైళ్ల దూరంలో ఫలానా గ్రామంలో ఇన్సూరెన్స్ పని చేస్తున్నట్టూ అక్కడ పదివేల కేసు ఒకటీ, ఇరవై ఐదువేల కేసు ఒకటీ సిద్ధంచేసి ఉంచినట్టూ నేను డాక్టర్ పరీక్ష చేయించి పాలసీ ఇప్పించడమే తరువాయి అన్నట్టూ నచ్చచెప్పాడు నాకు వెంకయ్య అనే అతను. అప్పటి క్రొత్త ఉత్సాహంవల్ల, ఉబ్బితబ్బిబ్బయ్యాను నేను, ఈ వార్తల వల్ల. "వెంటనే వెళ్ళుదాము రండి, డాక్టర్ని తీసుకువెళ్ళి ఆ పని పూర్తి చేసుకు వద్దాము" అన్నాను.

"అబ్బే! ఈ మాత్రం పనికి మీరు రావడం ఎందుకు ఆ గ్రామానికి? నేనే తీసుకువస్తాను వారిని ఇక్కడకు ఈ రాత్రికే. రేపు ఉదయమే పరీక్ష చేయిద్దాము" అని, ఒక్క క్షణముండి "ఒక్క చిన్నపనిమాత్ర మున్నది. ఈ వ్యవహారము ఒక మధ్యవర్తి ద్వారా ఫైనల్ కావాలి. అతనికి ఏదో కొంత ముట్టజెప్పాలి. అది తర్వాత నా కమీషన్‌లో మినహాయించుకోవచ్చును; వెంటనే పాతిక రూపాయలు కావాలి" అన్నాడు వెంకయ్య.

"ఈనాళ ఆదివారం; బ్యాంక్ లేదు. రేపు ఉదయమే సొమ్ము తీసుకు మీ ఊరు వస్తాను. నా కోసం కనిపెట్టుకు ఉండండి. డాక్టర్ సహా తప్పక వస్తాను" అన్నాను నేను.

"అబ్బే! ఈ రాత్రికి రాత్రి వ్యవహారం ఫైనల్ చెయ్యాలి, ఈ రాత్రికే పార్టీలను ఈ ఊరు తీసుకువస్తాను. ఆలస్యంచేస్తే ఇంత బిజినెస్ మరే కంపెనీ వారి ఏజంటో తన్నుకుపోతాడు. నిమిషాలమీద జరగాలి ఈపని. తరువాత విచారిస్తే లాభంలేదు" అన్నాడు వెంకయ్య.

నాకు ఏమిచెయ్యాలో తెలియలేదు. ఒక్క మారుగా పాతికవేల రూపాయల బిజినెస్ కళ్ళచూడడము అనే ఆశతో భ్రమసిపోయాను. ఆయనను ఆఫీసులోనే కూర్చోమని, తిన్నగా ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారి 'చరఖా, బార్టర్ సంస్థకు' వెళ్ళాను. వెంకటకృష్ణయ్య మంచి వ్యవహారవేత్తా, ఆదర్శజీవి కూడానూ. రాజకీయ

విషయాలలో టంగుటూరి ప్రకాశంగారికి కుడిభుజంవంటి వారు ఆయన. ఒక చరఖాసంఘాన్ని నెలకొల్పి చుట్టుపట్ల పల్లెలవారికి ఎంతో సదుపాయం కల్పిస్తున్నారు. ఇప్పటి ఆర్థిక సంప్రదాయాలు సరియైనవి కావనీ, మారకపు విధానమే అనుసరణయోగ్యమనీ ఆయన సిద్ధాంతము. ప్రస్తుతము మనము వాడుతూన్న వస్తువులకు నాణెములద్వారా ఏవో వికృతమైన విలువులను ఆపాదిస్తున్నాము; అలాగాకుండా వస్తువులకు బదులుగా వస్తువులే ఇచ్చి కొనుక్కుంటే ఉత్పత్తి బాగా సాగుతుంది; దేశం సుభిక్షంగా ఉంటుంది అని ఆయన వాదన. ఆ సంస్థవారు ప్రతిరోజూ మన ఇంటికి మనకు కావలసిన కూరగాయలు పంపిస్తారు. వీని ఖరీదు రూపాయలలో ఇయ్యక, ఇన్ని కండెలు, ఇన్నో నెంబరు నూలుతో ఇయ్యాలి మనము. ఈవిధంగా మనము తప్పనిసరిగా నూలు వడికినవారమవుతాము. ఇలాగే ఇతర వస్తువుల చలామణీన్నీ, వస్తువుకు బదులు వస్తువే; డబ్బు ఎక్కడా అవుసరముండదు. ఏ గ్రామానికి ఆ గ్రామం స్వయంసంపూర్ణంగా ఉంటుంది - ఇది వారి ఆశయం. అప్పటికి బెజవాడలో చాలామందికి ఈ విధానంలో ఆసక్తి లేకపోయినా, ఎప్పటికైనా తమ సిద్ధాంతాలు సర్వజనఆదరణ పొందుతాయని వారి విశ్వాసము. ఒక మిషనరీ ఉత్సాహంతో కృషిచేస్తున్న వెంకటకృష్ణయ్య అంటే ఆందరికీ ఎంతో గౌరవము. మా నాయనగారినిబట్టి ఆయనకునామీద ఎంతో అభిమానము. ఈ అవుసరంలో చటుక్కున ఆయన నా మనస్సుకుతోచి, ఆయన వద్దకు వెళ్లాను.

నే చెప్పిన విషయమంతా విన్నారు వెంకటకృష్ణయ్య. "రేపు ఉదయమే బాంక్ తీశాక తెచ్చి ఇచ్చివేస్తాను పాతికరూపాయలు ఇప్పించండి" అన్నాను. ఆయన వెంటనే ఆ సొమ్ము నా చేతిలోఉంచి, "నీవు అడుగుతున్నావు కాబట్టి ఇస్తున్నాను. ఈ వెంకయ్య ఎవరో నేను ఎరుగను. నీకు లోకానుభవం తక్కువ" అంటూన్న ఆయన మాటకు అడ్డమువచ్చి నే నేదో అనబోతూఉండగా, "నన్ను నీవు ఒప్పించనవసరంలేదు. నీవు దగాపడకుండా చూచుకో బాబూ!" అన్నారు.

అరువు తెచ్చిన పాతికరూపాయలూ వెంకయ్యచేతిలో ఉంచాను. తాను వెంటనే బస్‌లో తనఊరు వెళ్ళి, ఎంతరాత్రిఐనా, పార్టీల సహా నా వద్దకు రాగల

డనీ, ఉదయమే డాక్టర్ పరీక్షకు ఏర్పాటు చెయ్యవచ్చు అనీ చెప్పి వెళ్ళిపోయాడు వెంకయ్య.

అంతే! ... నాటికీ నేటికీ నా కళ్ళకు ఇక కనిపించలేదు అతను. మా కంపెనీ తరఫున నాలుగైదు రిజిష్టర్ ఉత్తరాలు పంపితే తిరిగి వచ్చేశాయి, ఆసామీ గయర్‌హాజర్ అంటూ. ఈ సంగతంతా అనుభవజ్ఞుడైన మరో కంపెనీ మానేజర్‌తో చెపితే: "నయమే, ఈ పాతికతో వదలిపోయింది. అతనిని నమ్మి వంద లిచ్చావు గాదు. అతను ఇలా చాలామందిని నమ్మించాడట" అన్నారాయన.

కాని, ఈ అనుభవము మూలాన నాకు ఉప్పలూరి వెంకటకృష్ణయ్యతో మరింత పరిచయము కలిగింది. మరునాడు, వారు నాకు ఇచ్చిన పాతిక రూపాయలూ వారి ఆఫీస్‌లో చెల్లించే సందర్భంలో ఆయన తమ్ముడున్నూ నాకు పరిచితులయ్యారు. ఆయన నా ఈడువారే, క్రమంగా మేమిద్దరమూ మంచి స్నేహితులమయ్యాము. ఆయన ఆహ్వానము పాటించి ఒక సాయంత్రం గుణదలలో ఉన్న వారి ఆశ్రమానికి వెళ్లానుకూడా నేను.

వెన్నెలలో ఆ ఆశ్రమప్రదేశమెంతో బాగున్నది. "రాత్రివేళ ఏమి కనపడు తుంది? పగలు రావాలి మీరు!" అన్నారు వెంకటకృష్ణయ్య. వారి తమ్ముడు పొలము నాలుగుమూలలా చూపారు నాకు. ఎదుగుతూన్న బుడమచేలూ రకరకాల కూర గాయల మొక్కలూ, పొదలూ, ఎంతో బాగున్నాయి; ఈ నేలలో ఆ ఒక్క కుటుంబము వారే పనిచేస్తారు. వారికి పొలంలో పనిచేయడమూ నూలువడకడమూ - ఇదే వ్యాపకం. కొందరుఊళ్లో బార్టర్ సంస్థపనిచూస్తూ ఉంటారు. అతి నిరాడంబరమైన జీవితము వీరిది. ఎంతో సంతుష్టితో కాలము గడుపుతున్నారు. స్వచ్ఛమైన గాలి, తీయని నూతినీరు. అందమైన పరిసరాలు, నేను చాలా ఆనందించాను.

అక్కడ సన్నబియ్యం పండించరు, అది నాజూకు ఆహారమేగాని ఆహారపు విలువ తక్కువ అని వారి అభిప్రాయము, దేహపుష్టికి కావలసినవన్నీ బుడము బియ్యంలోనే ఉన్నాయన్నారు వెంకటకృష్ణయ్య. నెయ్యికూడా అనవసరమని ఆశ్రమ

వాసులు నెయ్యివేసుకోరు. పాలుకూడా పిల్లలకు మాత్రమే. పెద్దవారు పాలు, పెరుగు ముట్టరు. అవికూడా అనవసరమే. అంతేగాక భోజనంలో తోటలోని ఆకు కూరలతో చేసిన పులుసుకూర తప్ప వేరే ఆదరువు ఉండదు. తతిమ్మావి ఏవీ అక్కరలేదని. జిహ్వా చాపల్యమువల్ల కల్పించినవే అనీ సిద్ధాంతము. అలవాటు లేనివాడను నేను తినలేనేమోనని నాకుమాత్రం కన్సెషన్‌గా రెండు చెంచాల నెయ్యి వడ్డించారు. బుడమబియ్యము చాలా ముతకగా ఉంటాయి. అన్నంఎర్రగా ఉంటుంది. ఎక్కువ నమలాలి. కాని, నమిలినకొలదీ కమ్మగానూ, ఎంతో రుచికరంగానూ ఉంటుంది. ఈ ఆహారము చాలా పుష్టికరమైనదనీ అందరూ పొలంలో ఒళ్లువంచి పనిచేస్తారు కాబట్టి ఎవరికీ ఎటువంటి నలతా రాదనీ అన్నారు వెంకటకృష్ణయ్య. ఆ రాత్రి నేను తాటాకుపందిరిక్రింద నులకమంచంపైన ఖండువా కప్పుకు పడు కున్నాను. అప్పటివరు తలగడలు వాడరు. కాని హాయిగా నిద్రపోయాను.

ఆ తరువాత, మరోరోజు పేకువనే కాశేశ్వరరావుగారికుటుంబాన్ని నాతో కూడా తీసుకువెళ్ళాను. వారికీ ఈ ఆశ్రమం చూపించాలని. తెలతెలవారుతూండగా, గుణదల స్టేషన్‌లో రైలుదిగి చేలగట్లవెంట నడచివెళ్ళాము ఆశ్రమంలోకి. చాలా ఉల్లాసంగా అన్నది ఆ ప్రదేశం. బెజవాడఊళ్లో ఉంటే తెలియదు - చుట్టూ ఇన్ని కొండలున్నాయని. పచ్చగా పెరిగిన చేలు, లేత ఆకులతో నిగనిగలాడే రకరకాల చెట్లు, కడుపారమేస్తున్న దూడలు, ప్రతివారూ ఏదో వ్యాపకంలో ఉన్న ఆశ్రమ వాసులు - ఎంతో కళగా కనిపించింది ఆ ప్రదేశం. అక్కడే ఉండిపోవాలని పించింది మా అందరికీ!

"వచ్చేటప్పుడు పెద్దరైలు దిగి వచ్చారు. వెళ్ళేటప్పుడు రామవరప్పాడు మీదుగా చిన్నరైలులో వెళ్ళండి. నేనూ మీతో వస్తాను, సంస్థకు వెళ్ళవలసిన వేళ అయింది" అంటూ వెంకటకృష్ణయ్యకూడా మాతో ప్రయాణమయ్యారు. మేమలా చేలల్లో నడచి పంటకాలువదాటి రామవరప్పాడుస్టేషన్ జేరాము. ఇప్పుడెంతో మారి పోయి ఉండవచ్చును. కాని, అప్పుడు ఎంతో అందంగా ఉండేది స్టేషన్ ఆవరణ. అదేదోచెట్టు ఎర్రనిపువ్వులు విరగపూసింది లత్తుకచెట్టో ఏదో చాలా అందంగాఉంది.

ఇంకా రైలు వచ్చేవేళ కాలేదు. మేమంతా ప్లాట్‌ఫారంమీదికి జేరాము. అప్పుడు ఒక సంఘటన జరిగింది.

టిక్కెట్లు ఇచ్చేచోటుకి కాస్త ఇవతలగా రేకువసారాలో సామానులనుతూచే వేయింగ్ మెషీన్ కనిపించింది మాకు. చిన్నప్పుడు నేను మదనపల్లెలో చదువు తుండగా ఆఊరి స్టేషన్‌కు వచ్చినప్పుడల్లా పిల్లలమంతా ఆ మెషీన్‌చుట్టూజేరి, మేము ఎవరెవరము ఎంత తూనిక ఉన్నామో చూచుకునేవారము. కాలేజ్ పిల్లలుగా మమ్ములను ఎరిగిన స్టేషన్‌సిబ్బందివారు మమ్మల్ని ఏమీ అనేవారుకాదు. మా స్వగ్రామమైన మాధవరానికి చెందిన నరసాపాలెం స్టేషన్‌లోనూ అంతే. రైలు ఎక్కేముందు కాస్సేపు ఆ మెషీన్‌ను వినాయ్న చేయడం అలవాటు.

ఆ అలవాటు చొప్పున ఇక్కడ రామవరప్పాడు స్టేషన్‌లో నాతో ఉన్న బాల బృందాన్ని మెషీన్‌వద్దకు తీసుకువెళ్ళి, అక్కడ కాస్త గల్లంతు చేయసాగాను నేను. అప్పుడు మెషీన్‌పైన ఎక్కడమూ దిగడమూ వేయింగ్‌బార్‌ను ఇటూ అటూ కదల్చడమూ వల్ల చప్పుడుఎక్కువై, టిక్కట్లగదిలోఉన్న స్టేషన్‌మాస్టర్ విసుగుతో పోర్టర్ని పిలచి "ఏ పోర్టర్! ఎవరక్కడ గల్లంతు చేస్తున్నారు? అవతలకు పొమ్మను" అని గట్టిగా అరచాడు.

పోర్టర్‌కి తెలుసు మేము కాశేశ్వరరావుగారి బాపతు వారమనీ, ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారితో వచ్చి ఉన్నామనీ. అంచేత అతను మా వద్దకువచ్చి నెమ్మదిగా: "మెషీన్ పాడుచెయ్యవద్దంటున్నారు మాష్టరుగారు" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఇంత నింపాదిగా చెప్పిన మాటను పాటించే స్థితిలోలేము మేము - మా ఆటలో మేమున్నాము

తను వద్దని నిషేధించిన అల్లరి తక్కువకావడము బదులు ఇంకా ఎక్కువైనట్టు తోచి స్టేషన్‌మాస్టర్ ఈసారి తానే స్వయంగా మావైపు వచ్చాడు. ఆ నిమిషానికి నేను మెషీన్ క్రాస్‌బార్‌పైన చేయిఉంచుకుని మెషీన్‌ప్రక్కగా నుంచుని కాశేశ్వరరావుగారి మేనకోడలు సరస్వతమ్మతో రైల్వే మణుగులను పొన్నలోకి

ఎలా మార్చాలో చెపుతున్నాను ఇంగ్లీష్‌లో. నా మాట, నా వాలకం, నా దుస్తులు, నా ముఖమల్ చెడావుం చూచి ఒళ్ళు కాస్త పెంచి, కాస్త పొడుగు ఎదిగి, నన్ను చూచి ఇంగ్లీష్‌లో అన్నాడు: "మిమ్మల్ని ఇక్కడ నుంచి పొమ్మనలేదా?" అని.

ఇంగ్లీష్‌లో ఈ మాటలు మరీ మోటుగాఉ-టాయి. 'గెటవుట్' అనేమాట నా చెవులకు ఎంతో కఠోరంగా ఉంది. నేను కదలక మెదలక అలాగేనుంచున్నాను. సరస్వతమ్మ, ఆమె ముగ్గురు తమ్ములూ జడిసి ఓ ప్రక్కకు తప్పుకున్నారు. అతను నా వైపు మరీ దగ్గరగావచ్చి ఇంకా గట్టిగా, ఇంకా మోటుగా గద్దించాడు. "ఇక్కడ నుంచి పోతావా పోవా? ఆ మెషీన్ను ఎందుకు పాడుజేస్తున్నావు!" అని

నేను అతి శాంతంగా అన్నాను: "మెషీన్ ఉపయోగించడము నాకూ తెలుసు, నేను పాడుచెయ్యడంలేదు ఆ మరను, మర్యాదగా మాట్లాడితే నేను ఇక్కడ నుంచి తప్పకుండా వెళ్ళిపోతాను!" అని.

ఆ మాటకు అతను మండిపడి "మెషీన్ ముట్టుకోవద్దంటే నీకు కాదా? పో ఇక్కడ నుంచి- గెటవుట్!" అంటూ క్రాస్‌బార్ పైనఉన్న నా చేతిని బలవంతంగా ఇవతలకు లాగివేశాడు.

మెరుపులా నా చెయ్యి ఎగిరి అతనిని పెళ్లున లెంపకాయకొట్టింది. నా బలమంతా ఉపయోగించాను ఆ దెబ్బ కొట్టడంలో. నా కంత విపరీతమైన బలమున్నదని నాకు తెలియదు అంతవరకు.

అతను ఒక్క-క్షణము, ఒక్క-క్షణమే నిర్ఘాంతపోయాడు, పాపము! అతను ఊహించనైనా ఊహించి ఉండలేడు: అంత నాజూకైన దుస్తులు ధరించి అంతటి సుకుమారముగాఉన్న నేను అంత తీవ్రంగా కలియబడతానని. కాని, మరునిమిషమే అతను తెలివితెచ్చుకుని పళ్ళు పటపట కొరుకుతూ ఏనుగులా నా మీద వచ్చిపడ్డాడు. ఎక్కడనుంచి వచ్చిందో నాకు ఆ ధాటీకి ఆగగల శక్తి! అతనితో బాహాబాహి గుంజులాడి నాలుగు దెబ్బలుకొట్టి నాలుగు దెబ్బలు తిన్నాను. నా గ్లాస్‌గో మల్లు చొక్కా చినిగిపోయింది. అతని లుంగీకూడా చినిగిపోయింది, ఆ త్రోపిళ్ళలో. గట్టిగా ఒక్క త్రోపు తోశాను. అతను అంతదూరాన వెళ్లిపడ్డాడు. పోర్టర్ వచ్చి లేవదీస్తున్న అతను ప్రళయకాల రుద్రమూర్తిలో ఐపోయి "రెచెడ్ థర్డ్‌క్లాస్

పాసింజర్, ఇతనితో నేను మర్యాదతో మాట్లాడాలట నేను" అంటూ నన్ను రూపు మాపే ఉద్దేశంతో నావైపు రాబోయాడు. కాని, అతనిమాట వినిన వెంకటకృష్ణయ్య తానూ తోటివారూ మూడవక్లాసు పాసింజర్లు కాబట్టి మేమందరమూ థర్డ్‌క్లాస్ పాసింజర్లమే, గాంధిగారూ అంతే. మమ్మల్ని అంతమాట అంటావా అని గద్దించే సరికి కాస్త వెనక్కి అడుగువేశాడు. పోర్టర్ అతనిని లోనికి తీసుకువెళ్ళాడు.

ఇంతట్లోకి సరస్వతమ్మా, పిల్లలూ నా చుట్టూ మూగారు. మోహన్‌రావూ వెంకటేశ్వరరావూ రామకృష్ణ మన పక్షమే జయించింది అన్నట్లు చిందులు తొక్కు తున్నారు. సరస్వతమ్మ మాత్రం కంట తడిపెట్టుకుని ఎంతో ఆదుర్దా పడుతోంది. ఆమెకు శోషవచ్చేటట్లుంది. ఇంతట్లోకీ రైలురాగా, అందరం గబగబా రైలుఎక్కి కూర్చున్నాము.

రైలులో వెంకటకృష్ణయ్యగారినీ సరస్వతమ్మనూ క్షమాపణ వేడుకున్నాను నా ప్రవర్తన విషయమై. నా మనస్పూర వారి క్షమాపణ వేడుకున్నాను. "స్టేషన్ మాస్టర్ ప్రవర్తనా నింద్యమేగాని, నీవు అలా అతనిని కొట్టి ఉండకూడదు. అది మరి మన సిద్ధాంతాలకు పూర్తిగా వ్యతిరేకము" అన్నారు ఆయన. సరస్వతమ్మకు కోపం వచ్చింది, ఇక నాతో మాట్లాడదు ఆమె గాంధీజీ శిష్యురాలు కాబట్టి అని అనుకున్నాను నేను. కాని, ఇల్లు జేరాక గబగబ లోనికివెళ్ళి అమృతాంజనం సీసా పట్టుకువచ్చి "దెబ్బలు బాగా తగిలిఉంటాయి, ఎలా ఓర్చుకుంటున్నావో అంతబాధ, మందు రాచుకో"మని నా చేతికిచ్చింది ఆమె.

అప్పుడు మళ్ళీ అన్నాను ఆమెతో "చాలా సిగ్గుపడుతున్నాను నేను. పశువులా ప్రవర్తించాను కాదూ, బొత్తిగా అనాగరికుడనై పోయాను" అని.

ఆమె అన్నది: "నాగరికత మాట ఎలాఉన్నా అతను నీ కంటే బలవంతుడు. అతను ఉఫ్ మంటే ఎగిరిపోతూన్నట్లున్నావు నీవు. అతను గట్టిగా నాలుగు బాదితే ఏమైపోయేవాడవు నీవు? నీకేమైనా ఐతే, ఇంకేముంది - అనే భయంతో నా గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఆ గుండెదడ ఇంకా తగ్గలేదు" అన్నది.

ఇప్పటికీ ఆశ్చర్యపోతాను నేను. ఎందుకలా ప్రవర్తించానో అని. అన్నాళ్ళ సంస్కారమూ ఏమైపోయిందో! అలా నన్ను నేను మరచిపోవడము, ఒక తుడువరాని మచ్చగా భావిస్తాను ఇప్పటికీ నేను.

శ్రీరామ జయరామ శృంగారరామ యని
చింతింపరాదె ఓ మనసా
తళుకు జెక్కుల ముద్దుబెట్టు కౌసల్య మును
తప మేమి జేసెనో తెలియ
దశరథుడు శ్రీరామ రారయని బిలువ మును
తప మేమి జేసెనో తెలియ
తనివార బరిచర్య సేయ సౌమిత్రి మును
తప మేమి జేసెనో తెలియ
తన వెంట జన జూచి యుప్పొంగ కౌశికుడు
తప మేమి జేసెనో తెలియ
తాప మణగి రూపవతి యౌట కహల్య
తప మేమి జేసెనో తెలియ...
త్యాగరాజాప్తయని పొగడ నారదమౌని
తప మేమి జేసెనో తెలియ !

బెజవాడలో దాసువారింటి పెళ్ళిలో బెంగుళూరు తాయి పాడుతోంది ఎంతో చక్కగా ! అప్పుడెప్పుడో మద్రాస్‌లో వినిన బెంగుళూరు నాగరత్నం పాట, ఆ తర్వాత, బెంగుళూరులో విని ఆనందించిన తిరువాలూరు రాజాయి పాట జ్ఞాపకం వచ్చాయి, ఈ పాటవింటూ ఉంటే. అదొక వింత వాతావరణంలోకి తీసుకుపోతుంది ఇటువంటి గానము, మనలను. శబరివంటి ఎంతో సునఃపూర్వకమైన భక్తి భావమూ గంగాజలమువంటి ఎంతో స్వచ్ఛమైన సంగీతభావమూ ఉంటాయి ఈ బాణీలో. ఇటువంటి ప్రతిభ విశేష సంగీతసాధనవలన మాత్రమే రాదు. ఆత్మశుద్ధికూడా ఉండాలి. "తళుకు జెక్కుల ముద్దుబెట్టు కౌసల్య" అని నప్పుడూ, "అహల్య తప

మేమిజేసెనో" అనినప్పుడూ, గాయకి ఒక్కక్షణం కండ్లు మూసుకుంటుంది - సంగీత పారవశ్యం చేతగాదు; భక్తి పారవశ్యంచేత. కౌసల్యా, అహల్యా ఆ నిమిషం ఆమె హృదయవీధిని సాక్షాత్కరిస్తారు.

దాసువారి సంప్రదాయము నాకు చాలా ఇష్టము. దాసు త్రివిక్రమరావు ఎంతో పెద్దమనిషి. అతని సోదరులూ అటువంటివారే. ఎంతో మర్యాదస్తులు. ఆ రోజులలో వారి ప్రెస్ బాగా పని చేస్తోంది. లాభ నష్టాలు ఎలా ఉన్నా చేసేపని శ్రేష్ఠంగా ఉండాలనే వారి యత్నము నాకు ఎంతోనచ్చింది. డి. టి. రావు ఇంగ్లీషు వారపత్రిక నడుపుతున్నారు కొన్నాళ్ళు. ఆ పత్రికలో నేను నా రచనకూడా ఒకటిప్రకటించాను

పాటవింటూ, ఒక్కసారి చుట్టూ పరికిస్తే, చాలామంది నాకు తెలిసినవారే కనిపించారు. సర్కారు ఉద్యోగస్తులూ, రైల్వే ఉద్యోగస్తులూ, పురప్రముఖులూ అందరితోనూ కిట కిట లాడుతోంది ఆనాటి గానసభ. ఊళ్ళోఉన్న లాయర్లందరూ వచ్చారు. వీరిలో పాట వినేవారు కొందరూ, ఆనాటి కోర్టు విశేషాలను ఆసక్తితో చర్చించుకునేవారు కొందరూ, ఈ కబురూ ఆకబురూ చెప్పుకుంటూన్నవారు కొందరూ.

ఉన్నట్టుండి సభలో అలజడి బయలుదేరింది. డి. టి రావు ఎవరో అతిథులను తీసుకువచ్చి కూర్చోబెట్టారు ముందరి వరుసలో. ఎవరోకాదు, గుడిపాటి వెంకటచలమూ, ఆ ఘనపిల్లలూ వచ్చారు. కాని, వారితోకూడా పద్నాలుగుఏళ్ళ అమ్మాయి ఉన్నది. గిరజాల జుత్తు, లేతగులాబి రంగు లంగాపైన సరిగపువ్వులు తాపిన ఆకుపచ్చని వోణీ. అందరిదృష్టి ఆవైపే వెళ్ళింది - ఆ వచ్చినవా రెవరని. వెంటనే, నా ప్రక్కనేఉన్న ఒకరు లాయర్ అన్నారు: "జ్వాలా పార్టీనోయ్" అని. కాస్త హేళనగానే, ఆ మాటకు తతిమ్మా లాయర్లూ అందరూ వింతగా నవ్వారు, ఆ లాయర్ ఈసారి నా వైపు జూస్తూ, నేను వినలేదేమోనని మరింత గట్టిగా మళ్ళా అన్నారు. "జ్వాలాపార్టీ" అని. ఆయన మిత్రులు మరీ గట్టిగా నవ్వారు, అందరూ నా వైపే జూస్తున్నారు. నేను ఏదో తప్పు చేసినట్టు. కాని, ఇలా వారు నన్ను

వెంకటచలబృందములో ఒకనిగా భావించి హేళనచేయ యత్నించినా, వెంకట చలంతో నన్ను కలపడము నా మటుకు నేను గౌరవంగానే భావించాను. చిరునవ్వు నవ్వి వూరుకున్నాను. ఆ లాయర్లలో కొందరు నా స్నేహితులే. వెంకటచలానికి మాత్రము ఈ ప్రసక్తి లేదు. రామభక్తుడూ, గాన ప్రియుడుగా అతను పాట వింటున్నాడు. ఎంతో ఆసక్తితో

వెంకటచలం బృందాన్ని అలా "జ్వాలా పార్టీ" అనడానికి కారణము ఆ రోజులలో వెంకటచలం ప్రోత్సాహంతో ముద్దుకృష్ణ ప్రచురిస్తున్న "జ్వాల" అనే వారపత్రిక. జగమెరిగిన యోధుడు ముద్దుకృష్ణ, వెంకటచలం ధోరణిలోనే సాహిత్యంలోనూ, తద్వారా సంఘంలోనూ విప్లవం తీసుకురా ప్రయత్నిస్తున్నాడు. తరతరాలనుంచీ మనలో పాతుకపోయిన మూఢ విశ్వాసాలను రూపుమాపాలనే అతని దీక్ష. బెర్నార్డ్ షా, ఇబ్సన్ అంటివాడు తమ రచనలద్వారా అక్కడ సాధించగలిగిన మానసిక పరివర్తనాన్ని తనూ ఇక్కడ కొంతవరకైనా సాధింప వచ్చునని అతని ఆశ. ఈ పరివర్తనం రావాలంటే. ప్రప్రథమంగా జనులు అతి కాంక్షతో అరాధిస్తున్న "కొన్ని కొయ్యబొమ్మల" ను నిర్దాక్షిణ్యంగా పగుల గొట్టాలి అని అతనికి తోచినట్టుంది. అటువంటి పనికి పూనుకొన్నట్టు కనిపిస్తుంది "జ్వాల" చదువుతూ ఉంటే. ఆ రచనలద్వారా ఎంతో కొంత అలజడి కలిగింది. ఈ యత్నానికి వెంకటచలం సానుభూతీ, సహాయమూ ఉండ్డబట్టి పత్రిక నడచి నన్నినాళ్ళూ బెజవాడలోనూ తెలుగుదేశంలో మరికొన్ని ప్రాంతాలలోనూ, చదువు కున్నవారు ఏ నలుగురు కలిసినా, 'జ్వాల' ను గురించిన తర్కమే సాగుతూ ఉండేది. ఈ కొయ్యబొమ్మలను పగులగొట్టే విసురు సత్యహరిశ్చంద్రునిపై తగిలింది ఒక సంచికలో. ఏకాంకికగా వెలువడ్డ ఈ నవీన హరిశ్చంద్రనాటికలో అతి చమత్కారంగా చిత్రించారు ఇక్ష్వాకులనాటి ఆశయాలు నేటి 'ప్రాక్టికల్' దృక్పథా నికి ఎంతదూరమైపోయినదీ, చంద్రమతీ, సత్యకీర్తీ సంప్రతించుకొని లోహితాస్యుని చేత హరిశ్చంద్రునిపైన మైనర్ వాజ్యంవేయించేటంతటి ఆధునికంగా ఉన్నది ఈ రచన ।

ఆ రోజులలోనో మరి ఇంక కొన్నాళ్ళకో, ముద్దుకృష్ణ తన అనార్కలీ అనే ఏకాంకిక ద్వారా ఆధునిక ఆంధ్ర నాటక రచనలో ప్రథమ శ్రేణిని అందు కున్నాడు. సంభాషణ చక చకా సాగిపోతుంది ఈ నాటికలో, పాత్రల అంతరంగ వ్యాకులత ఇట్టే ప్రస్ఫుటమవుతుంది వారి మాటలవలన. అద్భుతమైన వాతావరణం కలిగించ గలిగాడు ముద్దుకృష్ణ. అతి ఉదాత్తమైన భావాలు, కాస్త తర్ఫీదైన కాలేజీ యువకులు ఎంతో అందంగా ప్రదర్శించేవారు ఈ నాటికను - ప్రేక్షకుల హృద యాలలో అనార్కలీదెస పట్టరాని జాలి కలిగిస్తూ, నిర్దాక్షిణ్యమైన రాచమర్యాదల దెస తీవ్రమైన కోపము తెప్పిస్తూ.

ముద్దుకృష్ణ రచించిన మరో ఏకాంకిక 'అశోకము'. ఇది లంకలో అశోక వనంలోఉన్న సీతనుగురించినది. ఈ నాటికలో సంభాషణ మరీ విచిత్రంగా ఉంటుంది. పౌరాణిక వ్యక్తుల దెస నా మనస్సులో నిలచిపోయిన భక్తి భావము వలన ఈ క్రొత్త నాటిక ఆశయముగాని, పద్ధతిగాని నాకు అంతగా రుచింపలేదు. ఒక సన్నివేశంలో లోకమాత, జానకి అంటుంది రావణునితో: "రావణా! అంత తొందరపడ్డావేమి!" అని. రావణుని ప్రేమ నిర్మలమైనదనీ, పవిత్రమైనదనీ, అతి గాఢమైనదనీ, చిరకాలమైనదనీ, ఎంతగా సరిపుచ్చుకోవాలి అనుకున్నా, ఆ మాట నన్ను ముల్లులా గుచ్చుకుంది. మా అమ్మమ్మ నేర్పిన లంకాయాగములో సీతా అమ్మవారు రావణునితో ముఖాముఖి మాట్లాడడానికి ఇష్టంలేక, ఒక గడ్డిపోచని అడ్డముగా పెట్టుకుని ఆ గడ్డిపోచతో చెపుతుంది రావణునితో చెప్పవలసిన మాటలు. అటువంటి మహాసాధ్విని ఇలా చిత్రించడము ఒకానొక ఆధునిక దృక్పథానికి ప్రగతి సూచకంగా కనిపించినా, నావంటి వానిని చాలా బాధపెట్టింది. ప్రతిభగల రచయి తలు తాము నిరూపింపదలచిన సత్యాలను వ్యక్తపరచడానికి క్రొత్త పాత్రలను సృష్టించి, వారిచేత ఎటువంటి గంభీరమైన, ఆచరణయుక్తమైన ఉపదేశాలనైనా ఉపదేశింపవచ్చును. మనకు చిరపరిచితులై, ఏదో ఒక అనన్య సామాన్యమైన విశిష్టతను అలవరచుకున్న పౌరాణిక వ్యక్తులకు క్రొత్తరూపమిచ్చి, క్రొత్తదుస్తులు తొడిగించి, వారిద్వారా మ్లేచ్ఛభావాలను ప్రసారము చేయడమువల్ల సాధించినది ఏమీ లేకపోవుట అటుండగా, రచయిత ఆశించిన ఆశయానికే భంగము కలుగవచ్చు. చమత్కారముగా ప్రారంభించినది కేవలము హాస్యముగా తేలిపోవచ్చును.

## సాగుతున్న యాత్ర

ముద్దుకృష్ణను నేను తరుచు వెంకటచలం ఇంట్లో కలుసుకుంటూ ఉండే వాడను. వెంకటచలంతో కాస్సేపు గడుపకలిగినా అది ఒక "టానిక్" లా పని చేస్తుంది, నాకు. ఆయన అంతగా మాట్లాడరు. కాని, చెప్పే నాలుగు మాటలూ మనఃపూర్తిగానూ, ఎంతో సహజ ధోరణినీ ఉంటాయి. ఏ మాత్రము ఉద్వేగమూ ఉండదు - ఆయన వచనలో ఎంతటి ఉద్వేగమూ, తీవ్రతా ఉన్నా. ఒక్కొక్కప్పుడు వారి ఇంట సమావేశమైన స్నేహితులమధ్య ఏదో ఒక చర్చ బయలుదేరి, వాదోపవాదాలు తీవ్రస్థాయిని దాల్చినా, వెంకటచలం నవ్వు మొఖంతో ఊరికే చూస్తూ ఉంటారు. ఆ వాదనలో పాల్గొనేవారుకారు. కాని, ఆ స్నేహితులలో ఒకరు వెంకటచలాన్ని తన పక్షానికి తిప్పుకో కలిగితే తన వాదన గెలుస్తుంది అనే ఆశతో ఆయనను ఉద్దేశించి "మీరేమంటారు?" అని ప్రశ్నిస్తే ఆయన "నేనా?" అని, వాదానికి ఎటువంటి హేతువూ లేనట్టు ఒక చిరునవ్వు నవ్వి, ఎంతో టూకీగా సమాధానపరుస్తారు ఇరు కక్షలవారినీ. గాలి అణగిపోయినంతనే ముడుచుకుపోయే తెరచాపలాగ అతి పేలవమైపోతుంది ఇంతసేపూ సాగిన తీవ్రమైన వాదన.

కొన్ని విషయాలను మాత్రము వెంకటచలం కాస్త కోపంతోనే ఖండిస్తారు. మనతో మాట్లాడుతూ, మన కండ్ల ఎదుట జరిగిపోతున్న సాంఘిక దురాచారాల ప్రసక్తి వస్తే, ఆయనకు ఏ మాత్రమూ ఓపిక ఉండదు. దుర్బలులైన వారిని, అధికారం గలవారు ఆచారం పేరట, మతంపేరట, ధర్మముపేరట హింసించడము ఆయన సహించలేరు. ఆ హింస తనకు తగిలినట్టుగా బాధపడతారు.

కాని, చిత్రమేమిటంటే, తన వ్రాతలవలన లోకంల్లో ఎంతో సంచలనం కలుగజేసిన వెంకటచలం తనను అనుసరించి ఉన్నవారి భావాలను మార్చాలని ఏ మాత్రమూ ప్రయత్నించినట్లు కనపడలేదు, నాకు. "నేను ఇది గట్టిగా నమ్ముతున్నాను. కాబట్టి, నీవున్నూ ఇలాగే నమ్మాలి" అని ఆయన తన సహచరులెవరితోనూ అన్నట్లు తెలియదు నాకు. ఇన్నాళ్ళు ఆయనతో కలసి మెలసి ఉన్నా, ఆయన ఒక్కసారి ఐనా, నా విశ్వాసాల గురించీ, పౌరాణిక వ్యక్తులయెడ నాకున్న అపరిమితమైన భక్తిని గురించీ, కొన్ని ప్రాచీన సంప్రదాయములకు నేను ఆపాదిస్తున్న విపరీతమైన విలువలను గురించీ నన్ను ఒక్కసారైనా మందలింపలేదు ఆయన. నేను

మాత్రం చనువుతీసుకొని, పదేపదే అంటూ ఉండేవాడను. అందమైన పాత విష యాలలో అవి హేతువాదానికి దూరమైనా, కాస్త మర్యాద ఉంచమని. ఆయన నవ్వి ఊరుకునేవారు.

*  *  *  *

నాన్నగారు ఉత్తరంవ్రాశారు: "నీ ఇన్సూరెన్స్ పని అనుకున్నంత జోరుగా సాగడములేదు. తెలుగుజిల్లాలన్నీ నీ పర్యవేక్షణలోనే ఉన్నవి కాబట్టి నీవు నెలకు ఎంత లేదన్నా ఒక ఇరవైరోజులైనా తిరుగుతూ ఉండాలి. ఈ ప్రయాణాల నిమి త్తము నీకు ఒక మోటార్‌కార్ చూచిఉంచాము. వీలుచొప్పున నీవు ఇక్కడకు వస్తే ఈ ప్రాంతములలో కొంత బిజినెస్ చూచుకొని, వెళ్ళేటప్పుడు కార్ తీసుకు వెళ్ళ వచ్చును" అన్నారు.

"వీలు చొప్పున" అన్నారు, కాని, నేను వెంటనే బయలుదేరాను. ఆ వయస్సులో, ఆ వయస్సులోనేకాదు, ఏ వయస్సులోనూ, కార్ వ్యామోహం ఎవరికి ఉండదు? కాని, కార్‌కోసం మద్రాస్‌కు బయలుదేరబోతూన్న నేను అప్పుడు అనుకోలేదు, మోటార్‌కార్‌కూ, నాకూ ఇంతటి అవినాభావసంబంధము ఏర్పడు తుంది అని. ఇప్పటికీ, మన ప్రాంతాలలో నా పేరువస్తే, "అతనా! మల్లె పువ్వు ల్లాంటి తెల్లటి బట్టలూ అతనూ, ఎప్పుడూ కార్‌లో తిరుగుతూ ఉంటాడు" అంటూ, జ్ఞాపకంచేసుకుంటారు నన్ను. కార్ ఒక వాహనము మాత్రమే గాక, ఒక స్థిర నివాసమైపోయింది నాకు, ఆ రోజులలో. నివాసమే కాదు, ఆ మోటర్‌కార్‌కీ, నాకూ మధ్య ఒక అపురూపమైన స్నేహ మేర్పడింది. ఒక వ్యక్తిగా మారిపోయి, నాకెంతో ఆహ్లాదము, మనశ్శాంతీ, ఆనందమూ ఇచ్చేది నా మోటార్‌కార్. అంచేతనే రోజూ, పువ్వులతో అలంకరించేవాడను నా మోటార్‌కార్‌ను స్వయంగా నా చేతులతో నేను.

మనిషిని గురించి స్వతహాగా ఉన్న విలువ అలాఉండగా, మోటార్‌కార్ ఉండడంవల్ల ఒక కొత్త విలువ వస్తుంది అనడానికి సందేహంలేదు. ఆర్థికదృష్ట్యా అతని హోదా పెరగడమే గాకుండా, ఈ కార్ అవసరమైనప్పుడు తమకు ఉపయోగిస్తుంది అనే దృష్టితో కొందరు వ్యక్తులు - ముఖ్యంగా ఉద్యోగస్తులు - మనలను మునుపటికంటె ఎక్కువ శ్రద్ధతో చూస్తారు. ఈ శ్రద్ధను కొందరు

ఇన్స్యూరెన్స్ ఏజంట్లు చక్కగా వినియోగపరచుకుంటారు. మొగమాటపెట్టాలని మనకు లేకపోయినా మనవల్ల కొంత ఉపకారమును పొందామనే అభిప్రాయంతో మన కార్‌లో ఎక్కినవారు తమకు తోచిన సహాయం చేయాలను[illegible] ఇది నిజమే.

నా విషయంలో, నా అంతట నేను ఎవరినీ మా కంపెనీలో ఇన్స్యూర్ చెయ్యమని కోరవలసిన పనిలేదు. ఏవో కొన్ని మరీ పెద్దకేసులు, నన్ను బాగా తెలిసిన వారి విషయంలోనూ తప్ప, ఆ పని అంతా ఏజంట్లు చేయవలసిందే. ఐతే, నేను కార్‌లో ఒక్కడనే వెళుతూఉంటాను. కాబట్టి త్రోవలో కనుపడినవారికి ఎవరికైనా, వారు కార్‌లో వెళ్ళవలసిన అవసరంవుంటే నా అంతట నేనే కార్ ఆపి, వారిని కూర్చోమంటూఉంటాను. ఇలా చేయడంలో నాకు ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకపోయినా, అప్పుడప్పుడు ఈ చిన్న సహాయమును జ్ఞాపకముంచుకొని వారు ప్రత్యుపకారము ఏమిచెయ్యాలి అని ఆలోచించి, ఇన్స్యూరెన్స్‌లో ఉన్నాను కాబట్టి మా కంపెనీలో పాలసీ తీసుకుని తద్వారా నన్ను సంతోషపెట్టడం జరిగింది అప్పుడప్పుడు.

ఒక పర్యాయం నేను పనిమీద బందరు వెళ్ళాను. రహదారి బంగళాలో మకాముచేసుకుని, బ్యాంకు ఏజంటును చూడడానికి వెళ్ళాను. నేను ఏజంటుగారి గదిలోకి ప్రవేశించేసరికి ఆయన ఒక గుజరాతీ వ్యాపారస్తునితో మాట్లాడుతున్నారు. నేను రావడం చూచి ఆ వ్యాపారస్థుడు లేచారు. ఒక్కక్షణం ఉండండి అని వారిని ఆపి ఏజంట్ - నాకు చిరకాల స్నేహితుడు - మమ్మల్ని ఇద్దరినీ ఒకరిని ఒకరికి పరిచయం చేశారు. గుజరాతీ ఆయన వెళ్ళిపోయారు. నేను కొంతసేపు ఏజంటుతో మాట్లాడి, సెలవు తీసుకొని వూళ్లోకి వెళ్ళి నా పని చూచుకొని, సాయంత్రానికి బంగళాకు వెళ్లాను, ఇక బెజవాడ తిరిగి వెళ్ళిపోయే యత్నంలో. అప్పుడు ఆ బంగళా గేటుకు ఇరుప్రక్కల ఉన్న చిన్న పిట్టగోడలపైన ఈ ప్రక్క, ఆ ప్రక్క కూర్చొని ఉన్నారు నేను బ్యాంకులో చూచిన గుజరాతీ వ్యాపారస్తుడు, ఆయన భార్య. ఆమె ఒళ్లో దబ్బపండులాంటి అర్భకుడు సుఖనిద్రలో ఉన్నాడు.

"ఇదేమిటి, ఇలా కూర్చున్నారు ?" అని నేను ప్రశ్నించగా, ఆయన చెప్పారు, తామూ ఆ బంగళాలోనే ఉండి, అప్పుడే తమ నివాసస్థలమైన తాడేపల్లికి బయలు దేరబోతున్నామనీ, తమ కార్‌లో ఏదో మర చెడిపోయి, ఆ మరను బాగుచేయించుకు రావడానికి డ్రైవర్ వూళ్ళోకి వెళ్లాడనీ.

నేను అన్నాను: "మర ఇప్పుడు బాగు అవుతుందో లేదో, మన కార్‌లోనే మీకు అభ్యంతరం లేకపోతే నాతో రావచ్చు, చీకటిపడకుండా, మీ వూరు జేరవచ్చు. మీ కారు బాగయ్యాక, మన వెనకాలనే డ్రైవర్ తీసుకురావచ్చు" అన్నాను.

ఆయన "అబ్బే ! మీ కెందుకు శ్రమ !" అన్నారు. కాని, నేను మరోసారి "ఫరవాలేదు, మీరు నాతో రావచ్చును" అంటూ కాస్త బలవంతం చెయ్యగా, ఆయన భార్యను చూచి, "ఏమీ, వీరితో బెజవాడ వెళదామా, కారు రావడానికి ఎంతసేపు పడుతుందో, చీకటిపడకుండా వూరుజేరవచ్చు" అన్నారు. ఆమె తన ఒడిలో సుఖనిద్రలో ఉన్న పాపవైపు చూస్తూ అలాగే వెళదామని తల ఊపారు. వారి కారు బాగైనాక మా వెనుక వచ్చేటట్టు తగిన బందోబస్తుచేసి, వారిద్దరూ నా కార్‌లో ఎక్కారు.

ప్రయాణం చాలా చక్కగా సాగింది. గుజరాతీవారు నాకు ఆప్తవర్గంలో వారు — బొంబాయిలోనూ, అహమ్మదాబాద్‌లోనూ ఉన్న నా స్నేహితులనుబట్టి. వెంటనే, నాకు వచ్చిన నాలుగు గుజరాతీమాటలూ అనేసి వారిద్దరినీ నవ్వించాను. నేను బొంబాయిలో ఉన్న రోజులను గురించీ, అప్పటి స్నేహితులను గురించి వారితో చెప్పేసరికి, వారు నాకు ఎంతో దగ్గరయ్యారు.

త్రోవలో పామర్రు దగ్గర అనుకుంటా, పిల్లవాడు లేచి, పాలకు ఏడ్చాడు. పాల సరంజాం అంతా తమ కార్‌లో ఉండిపోవడం వల్ల ఏమిచెయ్యాలో తోచక ఆమె దిక్కులు చూస్తూఉండగా నేను కార్ వూళ్లోకి త్రిప్పి, అప్పటికప్పుడు ఆవు పాలు పితికించి, కాపించి ఇచ్చాను, శుభ్రమైన వేడినీళ్లున్నూ ఇప్పించాను. ఒక

వెండి ముక్కు చెంబున్నూ సంపాదించాను. ఎక్కడో పిల్లవానికి పాలుకలిపి పోశాక, మళ్ళీ ప్రయాణం సాగుతుండగా, ఆమె ఎంతగానో అన్నది నేను చేసిన సహాయంగురించి, గుజరాతీవారు ధైర్యంగా మాట్లాడుతారు: అన్న అనో తమ్ముడూ అనో మనలను సంబోధిస్తూ, ఎంతో చనువుగా మాట్లాడుతారు. అనవసరమైన బిడియము వారిని మాటలు రానివారుగా చెయ్యదు.

బెజవాడలో నేను వారిని మా ఇంటికి తీసుకువెళ్ళి టీ ఇచ్చి పంపుదామనుకున్నాను కాని, వారు "వద్దు, ఇప్పటికి మీకు చాలా శ్రమఇచ్చాము, ఊళ్ళో మా బంధువులు ఉన్నారు. వారిని ఒకపర్యాయం చూసి వెళ్ళాలి. వారికార్లో మేము తాడేపల్లి జేరుతాము" అంటే, వారిని బెజవాడ టవున్‌లో దిగవిడచి వచ్చాను. కార్ దిగుతూ వారిద్దరూ మళ్ళా ఒక పర్యాయం నాకు తమ కృతజ్ఞత తెలుపయత్నించారు. ఆయన అన్నారు, "మీరు మా మిల్లు చూడలేదు; వచ్చే ఆదివారం రండి తప్పకుండా" అని. నేను సరే అనకపోవడం చూచి ఆమె అన్నారు గుజరాతీ భాషలోనే: "మీరు తప్పక రావాలి. బొంబాయిలో మీరు రుచిచూచిన గుజరాతీ వంటకాలు మళ్ళీ ఒకసారి రుచి చూడవద్దా?" అని, తన చంకలోవి చిట్టిపాప చెయి పైకిఎత్తి ఊపుతూ "చెప్పు మామయ్యతో, మన యింటికి తప్పక రావాలి" అని చెప్పు"అన్నది, ఆ పాపతో అనినట్టుగా. "మీరు తప్పకరావాలి, మీ కోసం కనిపెట్టుకుంటాము" అన్నారు ఆయన.

ఆ తరువాత ఆదివారం నేను తాడేపల్లి వెళ్ళాను. గుజరాతీ భోజనం చాలా బాగుంటుంది. అంతకంటే ఆనందకరమైనది: వారి ఆప్యాయత, వాత్సల్యమూ. చిరకాల ప్రవాసమునుండి ఇంటికి తిరిగి వచ్చిన ఆప్తబంధువుగా ఆదరించారు నన్ను. మిల్లు నాలుగుమూలలా చూచి, "నేను వెళ్ళివస్తాను" అని వారిద్దరివద్ద సెలవు తీసుకోబోతే, ఉండండి ఒక్క క్షణ మని ఆమె లోపలికి వెళ్ళి పళ్ళెంలో పెట్టిన పళ్లూ, రెండుజతల అతి సన్నని మిల్లు పంచలూ, "హై సొసైటీ" మల్లు తాను ఒకటి తెచ్చి నాముందు ఉంచారు. "మీ చొక్కాలకి బాగుంటుందని ఈ మల్లు తెచ్చించాను" అన్నారు ఆయన. "ఎన్నాళ్ళనుంచో అనుకున్నాను నేను.

అటువంటి మల్లు చౌకాక్కులు కుట్టించుకోవాలి అని. నన్నని మల్లు ఇక్కడ ఎక్కడా దొరకదు. మీరు నాకోసం చాలా శ్రమపడిఉండాలి" అన్నాను - కాని, నా మనస్సులో ఉన్న కృతజ్ఞతా భావము ఏ మాత్రము వెల్లడిచేయగలిగాను అని తోచలేదు. ఆమె పాపాయిని నా చేతికి ఎత్తుకోడానికి ఇచ్చింది.

నేను కార్‌లో ఎక్కబోతూ ఉంటే ఆయన అన్నారు; "బుధవారం మధ్యాహ్నం నేను వూళ్ళోకి వస్తున్నాను. మీ ఆఫీసుకు వస్తాను. మీ కంపెనీలో ఒక పదిహేను వేలకు ఇన్స్యూర్ చెయ్యాలని ఉంది. ఇంకా ఎక్కువకి చెయ్యాలని ఉన్నది కాని, ఈవరకే చాలా కంపెనీలలో చేశాను. బొంబాయిలో ఇన్స్యూరెన్స్ ఏజంట్లు బ్రతుకనియ్యరు. ఇప్పటికి ఈ పదిహేనువేల పాలసీ తీసుకోండి" అన్నారు.

ఇలా ఉంటుంది: మంచివారితో సహవాసము ! !

౭

ప్రరవిదళిత మల్లీ వల్లీ చంచత్పరాగ
పరికటితపటవాసై ర్వాసయ న్కాననాని,
ఇహ హి దహతి చేతః కేతకీ గంధ బంధుః
పరిసర దసమబాణ ప్రాణవ ద్గంధవాహః.

జయదేవ.

వసంతకాలము. ఎంతో చల్లదనాన్నీ ఎంతో హాయినీ ఈయవలసిన మలయమారుతము అరవిచ్చిన మల్లియల పుప్పొడి దుమారముతోనూ ప్రాణాలు తీసే మొగలిపువ్వుల ఘుమ ఘుమతోనూ మన్మథునికి సహాయమై విరహిజనులను పీడిస్తున్నదట!

మామిడితోట అంతా రాగిరేకులతో అలంకరించినట్లు చిగిర్చి, వింతగా పూత పూసింది. క్రొత్త పూవులలోని మకరంద మధువును త్రాగి త్రాగి మత్తిలిపోయిన తుమ్మెదలు ఝుంకారముచేస్తూ వెర్రిగా తిరుగుతూ మామిడి చిగురునంతా కలచి వేస్తూ ఎంతో ఆశతో, చిగురు మేయడానికి కొమ్మపై వాలిన కోకిలను ఊరికే చిరాకు పరుస్తున్నాయి. తుమ్మెదలపై కలిగిన పట్టరానికోపంవల్ల తనకు సహజమైన పంచమస్వరానికి బదులు, అవ్యక్తమధురమైన కాకలీ నిషాదస్వరముతో కూస్తున్న దట కోకిల!

ఎంత అందంగా ఉన్నాయి ఈ భావాలు! ఇది మరో ప్రపంచం: కాని, ఒకొక్కప్పుడు తోస్తుంది ఇటువంటిదే నిజమైన ప్రపంచం; మనము ఉంటూన్నది అబద్ధమైనది—అని

మార్సెల్ ప్రూస్టును గురించి వ్రాస్తూ వ్యాఖ్యాత ఇలా అన్నారు: రెండు ప్రపంచాలున్నాయి; ఒకటి కాలమునకు సంబంధించినది; ఇక్కడ కోరిక, భ్రమ బాధ, మార్పు, క్షీణము, నాశనము — ఇవి తప్పవు. రెండవ ప్రపంచము

శాశ్వతమైనది. ఇక్కడ, స్వేచ్ఛ, సౌందర్యము. శాంతి ఉంటాయి నిత్యమూ. మనము కాలమునకు సంబంధించిన ప్రపంచంలో నివసిస్తూ, అనుభవిస్తూ ఉంటాము. కాని, అప్పుడప్పుడు ధ్యానముద్రలో ఉన్నప్పుడో, ఏదో ఆకస్మిక మధురస్మృతివలననో, ఆ మరో ప్రపంచపు అంచము ఒక్క క్షణం మెరపులా తళుక్కుమంటుంది మన మనోవీధిని. ఇటువంటి క్షణికఆనందాన్ని భద్రపరచి, శాశ్వతము చేయడమువల్ల కాలములో జీవిస్తున్న మన జీవితాలకు కాసంత వెలుగు నిస్తుంది కళ.

ఇటువంటి కళాస్వరూపమే సంగీతము. సంఘసేవకురాలు విశాలాక్షికి సంగీతము ప్రాణమువంటిది. ఆమె ఈ గీతగోవింద శ్లోకాలు పఠిస్తూఉంటే ఆమరో ప్రపంచములోనికి త్రోవ కనిపిస్తుంది వింటూన్నమనకు. చెల్లెలు కామరాజు అచ్చమాంబకు ఆప్త స్నేహితురాలు విశాలాక్షి, కళారాధకురాలైనా, కార్యనిర్వాహకురాలు. ఎక్కడోకాని, ఈ రెండు గుణాలు ఇంతగా కలసిఉండవు. విశాలాక్షి తన ఆశ్రమంలో తరిఫీదు చేస్తూన్న యువబృందమువారు గోకులము అనే హరిజనవాడలో ఎంతో సేవ చేస్తున్నారు. ఈ పిల్లలు కాలేజీలలో కొందరూ, హైస్కూలులో కొందరూ చదువుకుంటూఉన్నా, రోజూ సాయంత్రమయ్యేసరికి గోకులము చేరి, అక్కడ పిల్లలకు చదువు చెప్పేవారు చదువు చెపుతారు. ఇతరులు ఇంటింటికీ వెళ్లి తల్లులను పరామర్శిస్తూ వారి జీవిత విధానంలో మార్పు తీసుకురా యత్నిస్తారు. ఇక శనివార, ఆదివారాలు వస్తే అంతసేపూ అక్కడే గడుపుతారు. వీధులు ఊడ్పిస్తూ, ఇళ్లు అలికిస్తూ, బూజులు దులిపిస్తూ హరిజనవాడను ఎంతో వాసయోగ్యంగా చేస్తారు.

వీరు చేస్తూన్న సేవ అమోఘమైనది. "మాతో కలసి ఈ పుణ్యకార్యములో పాల్గొనరాదా? భీమా కంపెనీ అంటూ ఊళ్ళంట తిరుగుతూ ఉండకపోతే" అనేది విశాలాక్షి. నిజమే. నాకూ అటువంటి అభిప్రాయమే కలిగింది. ఎప్పటికైనా, అటువంటి కృషిలోనే నిమగ్నుడనై పోవాలి నేను. ఇప్పుడు చేతులో ఉన్న కార్య

కలాపాన్ని ఎలాగైనా వదల్చుకుని, అనుకునేవాడను నేను, వారు చేస్తున్న ప్రజాసేవ చూస్తునప్పుడల్లా.

అచ్చమాంబ తన ఇంటికి తగినపేరు పెట్టుకుంది : 'రివోల్ట్'. అనగా తిరుగుబాటు. అర్థములేని సంప్రదాయములపై తిరుగుబాటు; జాతి పురోగమనాన్ని నిరోధిస్తూన్న మూఢవిశ్వాసములపై తిరుగుబాటు; అధికారము తమ చేతిలో ఉన్నదనే కారణంగా బలవంతులు దుర్బలులను పీడించే పద్ధతిపై తిరుగుబాటు. ఆమె, అప్పుడు ఆమెతో కలసి పనిచేస్తూన్న యువజనబృందమూ సంఘంలో ఎంతో మార్పుతేను యత్నిస్తున్నారు. అందరూ విద్యార్థులే ఐనా, అసమానమైన ఆత్మవిశ్వాసముతోనూ, విపరీతమైన కార్యదీక్షతోనూ పనిచేస్తున్నారు వీరు.

నేను జీవితాన్ని ఏమాత్రమూ 'సీరియస్'గా తీసుకోవడము లేదని, ఆటగా బ్రతుకు గడిపివేస్తూ, నిజంగా దేశక్షేమకరమైన వ్యాపకంలో నిమగ్నుడను అగుట లేదని ఆమెకు కొంచెము కోపము నాపైన. కాని, నాయందు ఆమెకు ఉండే ఆదరాభిమానాలు నాలోని ఈ వెర్రిని కప్పివుచ్చి, తన తీరికసమయాలలో స్నేహితులతో కలసి నాతో ఎంతో కులాసాగా కాలము వెళ్ళబుచ్చేది, ఆమె, ఆధునిక కవితను గురించిన వ్యాసంగంలోనూ, ఆట పాటలలోనూ.

తరుచు వాదన జరుగుతూ ఉండేది, మా ఇద్దరిమధ్య. సంగీత సాహిత్యాదులందూ, లలితకళలందూ ఆమెకూ ఎంతో ఆసక్తి ఐనా, వానికి ఎంతో కొంతే ప్రాముఖ్యత ఇచ్చేది ఆమె. కాని, ఆమె కొన్నాళ్లు వీణ నేర్చుకుంది. అప్పుడు అంటూఉండేది : "ఓ రంగశాయి' అనే త్యాగరాజ కృతి వీణధనంలా పలికింపగలిగితే ఎంత ధన్యత కలుగుతుంది ఈ జీవితంలో"! అని. నాకున్నూ ఆ కృతి చాలాఇష్టము. పాట నడక బాగుంటుంది—గజగమనంలా. భావమూ బాగుంటుంది. శ్రీ రంగనాథస్వామితో ముఖాముఖి మొరబెట్టుకున్నట్టు ఉంటుంది.

## సాగుతున్న యాత్ర

ఓ రంగశాయి! పిలిచితే, ఓ యనుచు
రారాదా!

సారంగధరుడు జూచి కైలాసాధిపతి
గాలేదా ?

భూలోక వైకుంఠ మిది యని నీలోన
నీవే యుప్పొంగి

శ్రీలోలుడై యుంటే మా చింతదీరే దెన్నడూ!
ఓ రంగశాయీ!

ఆమె అన్నివిధాలా గాంధీజీ శిష్యురాలు. నాకు మహాత్ముని యందు అపరిమితమైన భక్తి భావమున్నా, రవీంద్రుని త్రోవ నాది. ఆకలీ, ఏదోవిధమైనదారిద్ర్యమూ ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి, మానవ నిర్మితమైన ఎటువంటి వ్యవస్థలోనూ. అవి రూపు మాసేటంతటివరకూ జీవితములో అందమూ, తద్వారా ఆనందమూ గమనింపరాదు అనడము అంత సబబుగా తోచలేదు నాకు, అందమైన బొమ్మ గోడనుఉంటే ఆబొమ్మను చూస్తూ ఉంటే ఏవేవో వింత భావాలు తోస్తాయి. ఆ బొమ్మ ఎంతో సంతోషమిస్తుంది మనకు. "నా కుటీరములో ఎటువంటి బొమ్మా అవసరము లేదు. ఆ కిటికీలోంచి కనబడే ఆకాశము కంటే గొప్ప చిత్తరువు ఉండగలదా!" అని అనడము మహత్తరమైన తత్వబోధ కావచ్చు. నాకూ, ఆకాశము ఎంతో అందంగా కనిపిస్తుంది ఎల్లవేళల. కాని, నిపుణులైన చిత్రకారులు చిత్రించిన రమ్యమైన చిత్తరువులు మానవుని భావనాశక్తి, కల్పనా చాతుర్యము, ప్రతిభ ప్రకటిస్తూ మహానందాన్ని కలుగజేస్తాయి.

ఒకసారినేను పనిమీద లయోలా కాలేజిపైపు వెళ్ళగా, అక్కడ రోడ్‌పక్కనే ఉన్న పొలములో ఒక్కటే ఒక్క ప్రత్తిచెట్టు కనిపించింది. ఆ చెట్టున ఒక్కటే

ఒక్క పువ్వు ఉన్నది. లేత చెంగావిరంగు, మెరుస్తూన్న గులాబి పువ్వులా ఉంటుంది. గులాబీకంటె బాగా పెద్ద పువ్వు. ఆకారమూ, కన్నుల పండువగా ఉంటుంది. పొలంతో పువ్వుకదా అని కోసి తెచ్చుకొని, తిన్నగా ఇంటికి వచ్చి చెల్లెలు అచ్చమాంబ చేతిలో పెట్టాను. అప్పు డామె తన స్నేహితురాలు హేమా వతితో మాట్లాడుతోంది. హేమావతి పువ్వును చూచి, "అబ్బ, ఎంత బాగున్నది పువ్వు! గులాబీకంటే కూడా బాగున్నది కదూ? ఎక్కడ సంపాదించాడో ఇతను ఇంత అందమైన పువ్వు!" అన్నది.

కాని, అచ్చమాంబ కాస్త విసురుగానే "ప్రత్తిపువ్వా! ప్రత్తిపువ్వు కోసుకు వచ్చావా!!" అని, బల్లమీద ఉన్న తన రాట్నంకేసి చూపుతూ "చెట్టునే ఉండనియ్యవలసింది; నీ కళోపాసనకు ప్రత్తి పువ్వుగాని పనికిరాలేదా? ఆ పువ్వు కాయగాస్తే ఎంత ప్రత్తి వచ్చేదో ఆలోచించావా? అటువంటి ప్రత్తిలోంచే ఇప్పుడు నువ్వు తొడుక్కొని కులుకుతూన్న లాల్చీ తయారైంది!" అంది.

హేమావతీ, నేనూ కూడా ముఖం చిన్నబుచ్చుకున్నాము. కాని, కాస్సేపైనాక కోపం సర్దుకుని, రాట్నపు సందేశమును గురించి నాకు చెప్పసాగింది అచ్చమాంబ. ఇంతట్లోకి మా చిరకాల స్నేహితుడు బండారు వీర రాజేశ్వరరావు వచ్చాడు. అతను గుమ్మంలో అడుగు పెట్టాడో లేదో "రాజేశ్వరరావూ! ఎన్నాళ్లోఐంది, నీవు పద్యాలు చదువగా విని, నాకు కిన్నెరసాని పాటలు మళ్లా వినాలనిఉంది, హేమ కూడా వింటుంది చదువవూ?" అని బుజ్జగించింది అతనిని.

"ముందు కాసిని మంచినీళ్ళు ఇయ్యి, అమ్మాయీ; తరువాత చదువు తాను" అన్నాడు రాజేశ్వరరావు నవ్వుతూ. అతను ఎంతో చక్కగా నవ్వే వాడు. ఆ నవ్వులో ఎంతో స్నేహమూ, ఆప్యాయతా ఉండేది.

మంచినీళ్లు త్రాగి, ఒక్కక్షణం విశ్రమించి తన చక్కని కంఠమెత్తి ఎంతో అందంగా చదువసాగాడు కిన్నెరసాని పాట:

సాగుతున్న యాత్ర

తేనె తరగల పిండుతోన జల జల సాగు
చాన కిన్నెరసాని జాలైన మేలైన
వాకలో, అందాల
రాకలో, బంగారు
జిలుగు గంటలు మ్రోగెనో – చిన్నారి
బిగువు నవ్వుల సాగెనో
తేనెలై కలకండ సోనలై వానలై
చాన కిన్నెర పాట సాగులాడుట చూచి
చివరలో, చివురొత్తు
నవురులో, క్రొమ్మావి
వింతగా సిగ్గందెనో – కోకిలా
గొంతులో కదలాడెనో
చెరకుపానక మెర్ర జీరపాకము వోలె
తరుణి కిన్నెర పాట తారులాడుట చూచి
పువ్వులో, లేసంజ
రువ్వులో, దానిమ్మ
తెల తెల్లనయి పోయెనో – కొంజిల్క
పలుకులో పస దప్పెనో !

తేనెలై, కలకండ సోనలై, వానలై – ఒక్కొక్క మెట్టూ అతిశయిస్తూ ఎంతో అందంగాఉంది. రక్తముకంటే ఎర్రనైన దానిమ్మ పువ్వు తెల తెల పోవడము అద్భుతమైన ఊహ. అందుకే విశ్వనాథ సత్యనారాయణ అంటే ఆమెకు అంత పక్షపాతము. కాని, అటువంటి విచిత్ర ఊహా, ప్రతిభ, ఇంగ్లీష్‌లో 'డేరింగ్ పొయెటిక్ కన్సెప్షన్' అంటా రనుకుంటా, ఎవరిని ఆకర్షింపవు !

ఐతే, 'భావకవులు' అంటే అచ్చమూంబకు కిట్టదు. ప్రియుడాలి కొరకు ఆ వెర్రి అన్వేషణా ఆవడతెగని వియోగబాధా వాడిపోయే ప్రతిసుమము కొరకూ రాల్చే ఆ కన్నీటి ధారలూ — ఇవన్నీ వృథా కాలయాపన అనుకుంటుంది.

....నాకోసం ఒక చిన్న టూసీటర్ కార్ కొన్నారు నాన్నగారు. ముందు ఇద్దరే కూర్చోవచ్చు — ఆప్యాయతతో ముగ్గురు. వెనుక డిక్కీలో క్లీనర్ కూర్చుంటాడు అనిఉన్నా, స్నేహితులు అక్కడా ఇక్కడాకూడా సర్దుకు కూర్చునే వారు. నా కార్ని పుష్పక విమానమనేవారు — ఎందరైనా ఎక్కుతూ ఉండేవారు.

ఆవడిలో ఒక విశాలమైన చెరువు ప్రదేశంలో నేను డ్రైవింగ్ నేర్చుకున్నాను. నాన్నగారి డ్రైవర్ ఇబ్రహీం ఎంతో ఆసక్తితో నేర్పబట్టి నాకు డ్రైవింగ్ ఒక్క నాలుగు రోజులలోనే వచ్చివేసింది. ఎటొచ్చీ కార్ను వెనుకకు తోలడము చేతకాలేదు. నేను నేర్చుకుంటూన్న కార్ సింగర్, పాతపంపిణీది. రివర్స్ గియర్ వెయ్యాలంటే రెండు మూడు సార్లు నొక్కి మరీ వెయ్యాలి. ఇందులో ఏ మాత్రం పొరపాటున్నా చెవులు బద్దలయ్యేటట్టు కర్ణకఠోరమైన చప్పుడవుతుంది. ఆ చప్పుడుకు భయపడి ఆ ప్రయత్నం మానివేశాను. రివర్సింగ్ తెలియకుండానే లైసెన్స్ సంపాదించాను. నేను వెళ్ళినప్పుడు సార్జెంట్ లంచ్ కి వెళ్ళే తొందరలోఉండి, నా స్నేహితుడు చెప్పగా వెంటనే లైసెన్స్ యిచ్చాడు, ఎక్కువ తిప్పలు పెట్టకుండా. ఆరు నెలలు రివర్సింగ్లేకుండానే కార్ నడిపాను. ఎవరన్నా అదేమిటి అంటే, వెనుకకు వెళ్ళడం ధీరలక్షణంకాదు అనేవాణ్ణి నవ్వుతూ.

ఏ విషయమూ మనకు బాగా నిపుణత ఏర్పడింది అని మనం అనుకుంటూన్నప్పుడే పొరపాటు కలుగుతుంది. ఈ కార్ నడిపించడమూ అంతే. లైసెన్స్ తీసుకున్న మరునాడు అర్జంట్ పనిమీద మద్రాస్ నుంచి ఆవడివెళ్లుతూ ఊరువిడిచి ఆవడి రోడ్ ఎక్కాక కార్ త్వరితము హెచ్చించాను. ఎంతో ఉత్సా

హంతోముందుకు ఎగిరిపోతోంది కారు. ఎదుట ఎంతోదూరంసాచుకుపోయి ఉన్న రాజమార్గాన్ని చకచకా నమిలివేస్తున్నాయి చక్రాలు. అక్కడెక్కడో ఉన్న వంతెన ఒక్కక్షణంలో రివ్వుమని వెళ్ళిపోయింది ప్రక్కనుంచి. ఇంకా, ఇంకా వడిగా వెళ్ళలేందికార్. ఇంతటి అద్భుతమైన శక్తి నా కాలి బొటనవేలి క్రింద ఉండడము ఎంత గొప్ప! అదొక విపరీతమైన అనుభవం!

ఉన్నట్టుండి, ఒక్క చిన్న కంకరురాయి తగిలి కాబోలు, చేతిలో స్టీరింగ్ గడగడ వణికింది. మరునిమిషం రోడ్‌కి కుడివైపుగా దూసుకుపోయి కార్ రాతిగుట్టయెక్కి అవతలగాఉన్న ఉప్పరివాళ్ళు తవ్విన గోతిలోపడి, ఆగిపోయింది. ఇంజన్ ఆడుతూనే ఉంది.

ప్రక్కనే కూర్చునిఉన్న ఇబ్రహీంకు నోటమాటలేదు. నవ్వుతూ కూర్చొని ఉన్న నన్ను చూచి కొంతసేపటికి తెప్పరిల్లి "ఎంత గండం గడిచింది బాబూ!" అన్నాడు,

ఇంటికి వెళ్లాక నాన్నగారు కాస్త గట్టిగానే మందలించారు: "గంటకు ఏభై మైళ్ళకు పైగా వెళుతున్నావట. ప్రాణాలతో చర్లాటము కూడదు" అన్నారు. అంతవరకు గాని నాకు తెలియదు, నేను ఎంతో ప్రమాదంనుంచి బైట పడ్డానని.

విజయనగరంలో నాతోకలసి హామిక్ హాస్టల్‌లో ఉంటూవున్న పత్రి విఠల రావు కనిపించాడు. అతనూ మెడికల్ కాలేజ్‌లో చదువుతున్నాడు. అచ్చమాంబ సహపాఠి. ఓహో! అంటే, ఒహో! అనుకున్నాక, నన్ను అతని బసకు రమ్మన్నాడు.

విఠలరావు పూజ్యులు పత్రి శ్రీనివాసరావుగారి అబ్బాయి. చాలా సత్సం ప్రదాయము వారిది. శ్రీనివాసరావుగారు గొప్ప లాయర్, అనుభవజ్ఞులు, మొదటి

కేంద్ర సభలో మెంబరున్నూ. వారు మిక్కిలి మర్యాదస్తులు. ఆ గుణాలే కొడుకుకూ అబ్బాయి. విఠలరావు స్నేహశీలి, ఉత్సాహవంతుడు.

అతని బసకు వెళ్ళాను. తనతోనే ఉండిపొమ్మన్నాడు, మద్రాసులో ఉన్న మిగతా పది రోజులూ. నేను సరే నన్నాను. ఆ తర్వాత, ఊళ్లో ఎవరన్నా స్నేహితులు కనిపించి "ఎక్కడుంటున్నావోయి" అని ప్రశ్నిస్తే, 'మెటర్నిటి హాస్పిటల్'లో అనేవాణ్ణి నవ్వుతూ. వారు ఆశ్చర్యపోయేవారు. విఠలరావుకు ఆ హాస్పిటల్‌లోనే క్వార్టర్స్, ఆ నెలా రెండు నెలలు అతడు రాత్రింబవళ్ళు హాస్పిటల్ ఆవరణలోనే ఉండాలి. దీనినే 'ఇంటర్న్‌మెంట్' అంటారు.

ఒకొక్కప్పుడు విఠలరావు నైట్‌డ్యూటీలోఉండి, వార్డ్‌లో ఉండగా నన్ను జతగా వచ్చి కూర్చోమనేవాడు తనకై ఉంచిన బల్ల ప్రక్కనే. అతనితో ఈ మాట, ఆ మాట మాట్లాడుకుంటూ పడక కుర్చీలోనే అలాగే ఉండిపోయేవాడను రాత్రంతా. నిజంగా, వైద్యవృత్తి ఎంతో గొప్పది. మానవుల బాధను ఎంతగా నివారింపకలడు, నిపుణుడైన వైద్యుడు! విఠలరావు వైద్య శాస్త్రాన్ని చాల ఆసక్తితో అభ్యసిస్తున్నాడు. డాక్టర్‌గా తనకు కలుగుతూన్న క్రొత్త క్రొత్త అనుభవాలను గురించి నాతో చెపుతూ ఉండేవాడు, తన పని చూచుకుంటూనే.

రాత్రి, అర్ధరాత్రి హాస్పిటల్‌లో డాక్టర్ రూమ్‌లో ఉండడం చిత్రంగానే ఉంటుంది. ఆ ఆవరణలో బాధపడుతూన్న స్త్రీలు, వ్యాధి నయమగుతూన్న స్త్రీలు, పిల్లలతల్లులుకానున్న స్త్రీలు అందరున్నారని తెలిసేది కాదు. అంత నిశ్శబ్దము. కాని, ఉన్నట్టుండి ఆ నిశ్శబ్దాని చీల్చుకువచ్చేది ఒక మూలుగు. ఆ మూలుగు కేకగా మారేది, అతి వెర్రిగా, కాసేపటికి. మళ్లా కాసేపు నిశ్శబ్దము....మళ్లా కేక రెండు మూడు సార్లు. తరువాత మరీ గట్టిగా, ఎంతో గట్టిగా భూదేవే కంపించిపోయేటట్టు, ప్రసవవేదనతో కూడిన కేక. కాని, మరు నిమిషం నిశ్శబ్దం మళ్లా. గాఢ నిశ్శబ్దం. కొన్ని క్షణాలే. వెంటనే, అతి శ్రావ్యమైన, చెవులకు ఎంతో ఇంపైన, పసిపాప ఏడుపు వినిపించేది.

# సాగుతున్న యాత్ర

"ఇంకొక జీవుడు అవతారం దాల్చాడు, ఈ ఇరువయ్యో శతాబ్దాన్ని చరితార్థం చెయ్యడానికి!" అనేవాడు విఠలరావు!

౮

ఎదురను దవ్వుల జూచిన పొడవు లెల్ల
దక్షిణము
కదియగా నవ్వియంతయును దవ్వయి
కనబడ బిరుద
నిది దినేశ్వరు రథమో యనూరుడో
ఇతడంచు నపుడు
హృదయమునను గడు విస్మయంబందె
నిక్ష్వాకకులుండు
ఈతండు శాలిహోత్రుడో, మాతలియో
నలుడో, యెరులు మానవులు జవో
చేతముగ నిట్లు రథహయ నీతి యెఱుంగుదురె
ధారుణీవలయమునన్

**భారతము, ఆది.**

విదర్భవైపు అతివడిగా వెళుతూన్న ఋతుపర్ణుని రథంలా ఏలూరు రోడ్‌పైన రివ్వుమని యెగిరిపోతూన్నది నా మోరిస్ కార్. సారధి, నిషధ భూపతి, నేను; ఋతుపర్ణుడు కమలాదేవి చటోపాధ్యాయ. ఉదయమే ఆమె ఏలూరు పురజన సభలో ఉపన్యసింపవలసి ఉన్నది. బెజవాడలో తూరుపు తెల తెలవారుతూండగా ఆమెను రైలు ఎక్కించవలసింది నేను. కాని, రైలువేళకు

స్టేషన్‌కి రాలేకపోయాము. అందుచేతనే తలువని తలంపుగా ఈ కార్ ప్రయాణము.

రైలు తప్పిపోవడము నా తప్పుకాదు. నేను పంచపంచ ఉషఃకాలాననే సిద్ధమవుతాను. ఆమె కూడా పాపము పెందలకడనే తయారయ్యారు. కాని, ఆమె తలదువ్వుకుంటూ ఉండగా నేను ఆమె యెదుట తెచ్చి ఉంచిన గులాబీ పువ్వులను చెండుగా కట్టడములో ఉండిపోయా రామె. కాశేశ్వరరావుగారు మేడ దిగివచ్చి "ఏమీ! రైలు వేళైంది. ఇంకా బయలుదేరనే లేదా!" అనే వరకూ ఆమె చెండు పూర్తికాలేదు, నౌఖరు గురవయ్యి తెచ్చియిచ్చిన ఓవల్‌టిన్ తాగ డానికి కూడా వ్యవధి లేకపోయింది. ఆ ఓవల్‌టిన్ ఫ్లాస్కులోపోసి కార్‌లో పెట్టమని హుటాహుటిగా బయలుదేరి స్టేషన్‌వైపు కార్ సాగించాను.

కాని, రైలు దాటిపోయింది. ఒక్కక్షణము ఒకరి ముఖం ఒకరు చూచు కున్నాను. ఆమె కన్నులలో నాపై దోషారోపణము ఉంటుందేమోనని నేను ముందుగా ఆమె సిగలో ఒంపుగా అమరిన గులాబీ చెండుకేసి చూచాను. ఆమె పక్కున నవ్వి "అవును, తప్పు నాదే. పువ్వులను చూస్తే పిచ్చి ఎక్కిపోతుంది నాకు. నువ్వు పువ్వు లియ్యకుండా ఉండవు మరి. సరే, తరువాత రైలు ఎప్పుడో? ఏలూరులో వారికి ఓ టెలిగ్రామ్ ఇయ్యాలేమో రైలు తప్పిపోయినదని" అన్నారు ఆమె.

నేను మాట్లాడకుండా కార్‌ను ఏలూరురోడ్‌వైపు త్రిప్పాను.

"ఏమి? నా మాటకు బదులు చెప్పవేమి? టెలిగ్రాఫ్ ఆఫీస్‌కు వెళు తున్నామా" అన్నారు ఆమె. "టెలిగ్రామ్ ఎందుకు? రైలుకు ముందుగానే మనము ఏలూరు జేరుతున్నాముకదా!" అన్నాను కార్ వడి హెచ్చిస్తూ.

అలా తటస్థమైంది ఉదయాన్నే, రైలుకీ మా మారీస్ కార్‌కీ పోటీ. రోడ్ చాలా బాగుంది. చల్లగాలి వీస్తోంది. ప్రయాణము చాలా హాయిగాఉంది. ఇంజన్

సన్నని మ్రోత మా సంభాషణకు అనుశ్రుతిలా ఉంది. ఆమె పూర్వ విషయాలను బెంగుళూరులోని సంగతుల గురించి పునశ్చరణ చేస్తున్నారు: ఆ బెంగుళూరులో తుకారామ్ నాటక ప్రదర్శనమూ, తదుపరి సాహిత్య వ్యాసంగమూ పిదప, ఆమె జీవితములో అనేకములైన మార్పులు వచ్చాయి. ఇటీవల ఆమె రష్యాకూడా వెళ్ళివచ్చారు. కాని, ఆమె బెంగుళూరులో ఉండగా ఎన్నడూ అనుకోలేదు రాజకీయ రంగంలో తాను ఇంతగా జోక్యం కలిగించుకోవలసిన అవసరం కలుగుతుందని. హరీన్‌తో కలసి నవ్యనాటకరంగాన, నవ్యసాహిత్యవీధుల, ఎంతో ఎంతో కృషి చేయవచ్చును అనుకున్నారు ఆమె. కాని అల్లా సాగలేదు. అంతా మరోవిధంగా అయిపోయింది. సాధారణులు భరింపజాలని మానసిక వ్యధ అనుభవింపవలసి వచ్చిన ఆమెకు మహాత్ముని బోధ త్రోవచూపింది, మరొక్కసారి. అందుకే, ఈ శాసనోల్లంఘన కార్యక్రమంలో ఆమె నాయకత్వం వహిస్తూంట.

త్రోవ పొడుగునా అప్పుడప్పుడు మాకు రైలు కనిపిస్తూనే ఉంది, ఒకప్పుడు మాకు బాగా ముందుగానూ, స్టేషన్ వస్తే అక్కడ ఆగినప్పుడు మాకు బాగా వెనుకగానూ, ఒకప్పుడు. నూజవీడు స్టేషన్‌లో ఎక్కువసేపు ఆగడము వల్ల రైలు మాకు బాగా వెనుకబడింది. మేము గుడివాడ రోడ్, ఏలూరు రోడ్ జంక్షన్ దాటి మెరపులా మెరసి, సాగిపోయాము ముందుకు.

జంక్షన్ దాటిన రెండు ఫర్లాంగుల అవతల రోడ్ ప్రక్కనే తామర కొలను కనిపించింది. మారిస్ చటుక్కున ఆగిపోయింది.

"అబ్బ! ఎంత అద్భుతంగా ఉన్నది, తెల్ల తామర కొలను!" అన్నారు ఆమె. ఆమె కళ్ళు ఉత్సాహంతో మెరసిపోతున్నాయి.

డ్రైవర్ కుర్రవాడు వెంకటేశ్వర్లుని పంపాను, ఇన్ని పువ్వులు సంపాదించుకురమ్మని. అతను వచ్చేలోపల ఇంతసేపూ ఆ మాటే మరచిపోయిన

నేను ఓవల్‌టిన్ ఫ్లాస్క్‌లోంచి కప్‌లో పోసి ఆమెకు అందిచ్చాను, "మరచి పోయాను, ఎంత ఆలస్యమైందో పాపము" అంటూ.

ఆమె ఈవేపు చూడడమే లేదు. కొలనుకేసే చూస్తూన్న ఆమె దృష్టి ఇక్కడలేదు. ఏమి ఆలోచిస్తున్నారో !

వెంకటేశ్వర్లు తెచ్చియిచ్చిన పువ్వులు ఒళ్లో పెట్టుకుని ఎంతో మురిసి పోయారు ఆమె — పెన్నిధి లభించినట్టు.

జైల్‌లో ఆమెకు పువ్వు లెలా దొరుకుతాయి ? పువ్వులంటే ఇంత ఇష్ట మైన వాళ్ల జైలెకు ఎందుకు వెళ్లాలి — అనుకున్నాను నేను.

రైలు కూత వినిపించింది. చప్పున కలలోంచి మేలుకుని కార్ స్టార్ట్‌చేసి మళ్లా పరువు అందుకున్నాను. వట్లూరుకు సమీపాన రైలు గేట్‌వేసిఉంది ; మేము ఆగక తప్పిందికాదు. క్షణంలో మాకు ఎదురుగా గుప్ గుప్‌మంటూ రైలు వచ్చేసింది.

రైలులోని జనము మావైపు చేతులూపారు. తోవ పొడుగునా మమ్మల్ని అడుగడుగునకూ చూస్తున్న వారు మేమే గెలవాలనే ఉత్సాహంతో నన్ను ప్రోత్స హిస్తున్నారు — తామున్న రైలును ఓడించి ! ఇది కాస్త మిత్రద్రోహంగా కని పించింది నాకు.

గేట్ తియ్యడమే ఆలస్యంగా మరీ వడి హెచ్చించాను కార్‌కి — ఇంత సేపూ ఇంజన్ ఆడుతూనే ఉంది. నా మనస్సులోని ఆత్రుత అర్థంచేసుకున్నట్టు పిట్టలా ఎగిరిపోసాగింది బంగారుతల్లి మారిస్. నా కుర్రతనానికి నవ్వుతూ కమలాదేవి అన్నారు : "ఏమంత మునిగిపోయింది ? రైలుతో పోటీ ఏమిటి మనకు ? ఐనా ఒక క్షణము ఆలస్యమైతేయేమి ? అనుకున్నవారు అనుకున్న సమయానికి రాకపోవడము మనవారికి వాలాయితేకదా !" అన్నారు.

"మీ విషయంలో అలా కాకూడదు. పైగా, మీరు నా చార్జ్‌లో ఉన్నా రాయను!" అంటూ మరీ వేగం హెచ్చించాను. జిల్లా కచేరీలు రివ్వున ఎగిరి పోయాయి ప్రక్కనుంచి.

కాని, పవర్‌పేట స్టేషన్ జేరేసరికి మాకంటె ఒక్క నిమిషము, ఒక్క నిమిషమే ముందుగా, రైలు స్టేషన్ జేరింది. నా ముఖంలో ఆశాభంగము చూచి కమలాదేవి చిరునవ్వు నవ్వుతూ "పాపము! చాలా కష్టపడ్డావు!!" అన్నారు.

నా కేమీలేదు; ఆ రైలులో ఆమె రాలేదని, ఆమెను ఆహ్వానింప వచ్చిన వారందరికీ ఎంత ఆశాభంగమవుతుందో అనే బాధే. అలవాటైనా, ఆశాభంగం నేను భరింపలేను, నాకైనా, ఎదుటి వారికైనా.

రైలు వెళ్ళిపోయింది. వాలిన ముఖాలతో వారంతా స్టేషన్ ఆవరణనుంచి ఇవతలకు వస్తున్నారు. ఏలూర్ కాంగ్రెస్ ప్రచారకులను కొందరిని నేను గుర్తించాను. వారూ నన్ను దూరాన్నుంచే గుర్తించి నమస్కరించారు. కాని, కార్ దగ్గరకు వచ్చేవరకూ వారికి తెలియలేదు నాతో కూడా ఎవరిని తీసుకు వచ్చానో!

కమలాదేవిని చూడడముతోనే వారందరూ ఒక్కసారిగా అన్నారు: "ఇదేమిటి! ఇదేమిటి!!" అని. వారిలోని ఆశాభంగమంతా మితిమీరిన విస్మయంగా మారిపోయింది. ఆ నిమిషము, ఒక్క నిమిషమే, నే నొక హీరోను ఐపోయాను!

చుండూరువారి ఇంటిలో కమలాదేవికి బస. అక్కడకు చేరగానే గుమ్మం వద్ద ఆమెను ఆహ్వానించడానికి ఎదురైన రత్నమ్మగారిచేతులో ఇన్ని తెల్ల తామర పువ్వులు ఉంచారు కమలాదేవి. రత్నమ్మగారు చాలా సంతోషించారు. "ఇదేమిటి ఇన్ని తెల్లతామరపువ్వు లెక్కడివి?" అన్నారు, కాస్త ఆశ్చర్యంతో.

"త్రోవలో చెర్లో కోశాడు ఆ అబ్బాయి, అందుకే, ఇంత ఆలస్యమైంది. లేకపోతే రైలుకు ముందే వచ్చి ఉండుము" అన్నారు కమలాదేవి.

నేను ఆమెను చుండూరువారికి అప్పగించి, ఊళ్ళోకి వెళ్ళాను, నాకున్న ఇన్సూరెన్స్ పనులు చూచుకుందామని. మధ్యాహ్నము మాజేటివారింటివద్ద ఆమెను కలుసుకున్నాను.

మాజేటి నరసింహారావు నాకు స్నేహితుడు. నన్ను చూచి, ఎంతో స్నేహ భావంతో అన్నారు: "విన్నాను రైలుతో పోటీ పడ్డావటగా, ఆ చిన్ని మారిస్ కార్‌తో; త్రోవలో తామర పువ్వుల కోసము ఆగి ఉండకపోతే, నీవే గెల్చి ఉండువటకూడా!" అని.

కమలాదేవి గుడివాడకు ప్రయాణ మవుతున్నారు. అక్కడ ఆమె శాస నోల్లంఘనము చేయబోతున్నారు. నేను ఆమెను సమీపించి, మాపిన్నిని, 'మిఠాయి పెట్టవూ?, అన్నట్టు, కాస్త గారంగానే అడిగాను. "నా కార్‌లోనే మిమ్మల్ని గుడివాడ తీసుకు వెళతాను. మిమ్మల్ని అక్కడవిడిచి, గుడివాడ మీదుగా బెజవాడ వెళతాను" అని.

ఎంతో ఆర్ద్రితతో నా వైపు చూస్తూ, ఆమె అన్నారు: "అలాగైతే బాగానే ఉండును. కానీ, వద్దు. నేను అరెస్ట్ కాబోతున్నాను. నీ కార్‌లోంచి దిగి అరెస్ట్ కావడము నాకు ఇష్టములేదు. అందువల్ల నీకు తప్పక ఇబ్బంది కలుగుతుంది. నీ వందుకు సిద్ధముగా లేవని నాకు తెలుసు" అని.

ఎంతో ఆశాభంగంతో నేను తల వాల్చుకువచ్చివేస్తూ ఉంటే, కమలాదేవి నన్ను "మాట" అని పిలచారు. నేను ఆగి, మళ్ళా వెనుకకు వెళ్ళేసరికి నన్ను జూచి "ఒక చిన్నపని చేసి పెడుతావా?" అన్నారు,

నా ముఖమింతైంది! "అయ్యో! అంతకంటేనా! వెంటనేచేస్తాను. ఏమి పని?" అన్నాను.

"అబ్బే! అంత తొందరవిషయం ఏమీలేదు. నీ వీలు చొప్పున చెయ్య వచ్చును. మూల్పూరి చుక్కమ్మగారిని ఎరుగుదువుగా. ఆమె ఇవ్వాళ ఊళ్ళోలేరు. ఆమెను చూద్దామని చాలా అనుకున్నాను—జైల్‌లో మే మిద్దరమూ కలసి ఉండే వారము. ఈ నెంబర్ గ్రామఫోన్ రికార్డ్ ఒకటి కొని ఆమెకు అంతజేస్తావా? ఆమె రికార్డ్ నేను పగులగొట్టాను, అజాగ్రత్తగా. వీలుచేసుకొని ఆరికార్డ్ వాళ్ళింట ఇస్తావా? ఇది ఎప్పుడో చేసి ఉండవలసిన పని" అన్నారు.

సాయంత్రం, నేను మూల్పూరివారింటికి వెళ్ళి ఆ రికార్డ్ ఇచ్చాను. డాక్టర్ రంగయ్యగారినీ చుక్కమ్మ గారినీ నేను బాగా ఎరుగుదును. వారంటే నాకు చాలా ఇష్టము. నేను వెళ్లేసరికి చుక్కమ్మగారు అప్పుడే ఊరినుంచి వచ్చి ఉన్నారు.

రికార్డ్ చూచి "ఈ మాత్రానికి ఇంత శ్రమ ఎందుకు? ఐనా, ఆమె అంతే! ఎవరికీ ఎటువంటి ఇబ్బందీ రాకూడదు తనవల్ల" అంటూ చుక్కమ్మగారు తమ వేలూరు జైల్ అనుభవాలు కొన్నిటిని చెప్పారు నాతో.

"నేను రాకుండానే ఆమె గుడివాడ వెళ్ళిపోయారా! నేను వెంటనే ఊరి నుంచి తిరిగి రాలేకపోయాను — ఆమెను చూచిఉండ కలిగితే బాగుండేది" అన్నారు.

* * *

ఈసారి, ఆచార్య గోగినేని రంగా, కమలాదేవీ, నేనూ కలసి వెళ తున్నాము నూజవీడుకు. ఆమె కేస్‌ను నూజవీడులో హియరింగ్‌వేశారు ఆ మరు నాటికి. అక్కడకు నేను కమలాదేవిని తీసుకువెళతున్నాను బెజవాడనుంచి, నూజ వీడు స్టేషన్‌లో రంగా మమ్మల్ని కలసుకొని మాతో వచ్చారు.

రంగా బలే సరదా మనిషి. ఎంతో చలాకీగా మాట్లాడుతారు ఆయన! వారి సంభాషణ వింటూఉంటే నిరంతర ధారగా ఎత్తునుంచి పతుతూన్న సెలయేటి

భాషగా ఉంటుంది. ఆయన మాటలకోసము తడుముకోరు ఎప్పుడూ. ఎన్ని విషయాలో తెలుసును ఆయనకు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయాలన్నీ ఆయనకు కొట్టినపిండి. వీనితోపాటు, మనతో ఉన్నప్పుడు సాహిత్య గోష్ఠిలోనూ ఆసక్తి చూపిస్తారు ఆయన. ఎంతో కలసికట్టుతనంతో ఉంటారు ఆయన మనతో. ఆయన సహవాసము ఒక మోస్తరు టానిక్‌లా పనిచేస్తుంది నా వంటివారికి, కొన్ని సమయాలలో.

వా రిద్దరూ ఎక్కువగా రాజకీయవిషయాలగురించేమాట్లాడుకుంటున్నారు. నాకు ఆ విషయాలలో అంతగా ఆసక్తి లేకున్నా, ఊరికే వింటున్నాను, వారి మాటలలో అడుగడుగునకూ మన ప్రధాన నాయకుల పేర్లు దొర్లుతూంటే. కొందరు నాయకు లనేవారిని గురించి రంగాగారు చేస్తున్న తీవ్ర విమర్శతో ఆమె ఏకీభవిస్తున్నారు. అప్పుడప్పుడు మాత్రము, ఆమె ఆయన మాటకు అడ్డము వచ్చి, "అబ్బే! అల్లాకాదు. అసలు సంగతి ఇదీ" అంటూ, కలవిషయము విస్తరిస్తున్నారు,

ఇద్దరూ విరివిగా విదేశ పర్యటనము చేసివచ్చినవారే. ఆయన ఎక్కడో నార్వేలోని ఏదో క్రొత్తసంగతి చెపుతే, కమలాదేవి తాను మాస్కోలో చూచిన విశేషాలను గురించి చెపుతున్నారు.

వారి సంభాషణలో కాస్త విరామం కలిగి, ఆయన కంఠస్వరము మార్చి ఎంతో స్నేహపూర్వకంగా, ఎంతో ఆదరముతో: "సరే, ఆ సంగతులకేమి? మీ వ్యవహారము తేలిందా?" అని ప్రశ్నించారు ఆమెను, ఆయన ఎంతో ఆప్తునిలా ప్రశ్నించినా, నాకు భయమువేసింది. ఇటువంటివి సాధారణముగా ఒకరిని ఒకరము అడుగలేము. ఆమె జీవితములో ఒక గొప్పమార్పు వచ్చిఉన్న రోజులు అవి. ఎన్నేళ్ళమంచో శ్రమపడి కట్టిన సుందరసౌధము, ఉఫ్‌మంటే చెదరి పడిపోయే పేకముక్కల మేడలా కూలి పడిపోతోంది. విధి లీలఅటువంటిది. నిరంతర బాష్పధారలతో పెంచిన మొక్క మానై, మహా వృక్షమై, ఒకే ఒక

పండు రాల్చి, ఉన్నట్టుండి, కూకటివ్రేళ్ళతోసహా ఒక్కపెట్టున పెల్లగిలి పడి పోబోతోంది. అటువంటి స్థితిలో ఎలా అడుగుతాము "మీ సంగతి ఏమైనది" అని. నేను అడుగలేను. అలా, వారియందలి వాత్సల్యంవల్ల తెలిసికోవాలని ఎంత ఉన్నా,

కాని, ఆప్తులు ఆయన ప్రశ్నకు ఆమె వెంటనే సమాధానం చెప్పారు. నన్నుగురించి ఎవరన్నా అడిగితే, నేను అంత ధైర్యంగా అంత యథాలాపంగా చెప్పిఉండలేను. గుండె తరుక్కుపోయే సంగతి అంతటి అవలీలగా ఎవరో పరాయి వ్యక్తులను గురించి చెప్పినట్లు చెప్పడము చాలా కష్టము.

"ఆః అంతా అయిపోయినట్టే" అన్నారు ఆమె. అనీ, కొన్ని వివరాలు చెప్పారు. ఆయన ఎంతో సానుభూతి చూపారు.

గుండెలో రవులుటూన్న నిప్పులాంటి ఇంతటి చింతపెట్టుకుని, దేశసేవే వ్యాపకంగాపాటిస్తూ, కారాగృహంలో అడుగు పెట్టబోతున్నారు ఆమె. ధీరత్వము అంటే ఇదేనా? కాని, ఆమెకు నేనుఏవిధంగానూ సహాయపడలేనా? ఎవరుమాత్రం ఏమిచేస్తారు? సానుభూతితో నిట్టూరుస్తారు. ఉపయాస్తమాన సమయాలలో, తమ ప్రార్థనలోఆమెనుగురించి ప్రార్థిస్తారు. ఇక్కడ ఉపశమన వాక్యాలు అప్రస్తుతము, నిరుపయోగము. ఎంత మనఃపూర్వకమైనవని ఐనా, మాటలు నిష్ప్రయోజనము.

నూజవీడులో, అక్కడకు మరో కార్‌లో వచ్చిన కాశేశ్వరరావు మమ్మల్ని కలుసుకున్నారు.

అందరమూ "డమ డమూతోట"కు వెళ్ళాము. అక్కడ శత వృద్ధులులా ఉండే పూజ్యులు యర్రమిల్లి రామనాథంగారిని దర్శించాము. రామనాథంగారి మనుమడే వారణాసి రామనాథం. నాతోకూడా కలిసి అడయార్‌లో చదువుకున్నాడు. అతనికీ నాకూ చాలా స్నేహము. అతను చెబుతూఉండేవాడు, తరుచు తన తాతగారి మాట తెల్లగా నెరసిన, గుండెలమీదికి వాలిన, గడ్డముతో ఆజాను

బాహుడైన ఆయనను చూస్తే జనకమహారాజు జ్ఞాపకం వచ్చారు నాకు. ఆయన మా నాన్నగారిని ఎరుగును. నేను ఫలానా అని తెలిసి ఎంతోగా ఆదరించారు నన్ను. వారి రామనాథం సహపాఠిని నేను అడయార్‌లో, అని నేను చెప్పాక మరీ దగ్గరయ్యాను నేను వారికి.

ఆ తోటలోని బంగాళాలోనే బస మా అందరికిన్నీ. కమలాదేవి ఆ ఇంటిలోని స్త్రీ జన మందరితోను చాలాచనువుగా ప్రవర్తించారు. వారితోహిందీలో మాట్లాడుతూ. ఐతే, వారు ఆమె దెస, స్నేహభావమునకుబదులు ఎక్కువగా భక్తి భావమును చూపుతూ ఉండడము ఆమెకు కాస్త అప్రియముగా ఉండడము గ్రహించాను. ఇంతట్లోకి కాశేశ్వరరావువచ్చి, అప్పటి రాజకీయ విషయాలను గురించీ, ఉదయాన్నే మేజిస్ట్రేట్ ముందు జరుగబోయే తంతునుగురించీ ముచ్చటింపసాగారు.

ఆ రాత్రి ఉన్నట్టుండి, విపరీతంగా వానా, గాలి. సముద్రతీరంలో ఇటు వంటి తీవ్రమైన గాలి, వాన, సహజమే కాని, ఇక్కడ అరుదు. తోటలోని చెట్లన్నీ విపరీతంగా అల్లల్లాడి పోయాయి పాపము! కుంభవృష్టిలా వర్షము. అడుగడుగునకూ ఉరుములూ మెరుపులూ. తెల్లవారుజామున క్రమంగా గాలి సర్దుకుంది. వాన వెలిసింది.

తెల్లవారే సరికి పెళ్లుమని సూర్యోదయమైంది. ప్రదేశము ఎంతో చల్లబడి ఉన్నది. చెట్టు చేమలు ఎంతో నాశనమై ఉన్నా ఏడున్నరకల్లా అందరమూ మేజిస్ట్రేట్ కచేరీకి జేరాము. కాని, అక్కడ రాత్రి వచ్చిన గాలివానవలన కాబోలు జనం ఎవరూ లేరు. సందడి ఏమీ లేదు.

మేజిస్ట్రేట్, ఇస్పహానీ అనుకుంటా, చాలా మంచివాడు. మర్యాదస్థుడు. కచేరీలో, తన ఎత్తు అయిన కుర్చీలో కూర్చుని ఉన్నాడు. మేము ఒక అడుగు వెనుకగా ఆగగా, కమలాదేవి ఒక్కర్తే ముందుకు వెళ్లారు, సహజమైన ఎంతో ఠీవితో.

## సాగుతున్న యాత్ర

ఏ రాణీ లక్ష్మిబాయిలాగనో, ఏ రుద్రమదేవిలాగనో ముందుకు వస్తున్న ఆమెను చూచి ఇస్పహానీ తన కుర్చీలో లేవబోయాడన్న మాట : ఎంతో గౌరవంతో, క్రింద, తన కుడివైపునఉన్న కుర్చీ చూపాడు. ఆమె కూర్చున్నారు. కాశేశ్వరరావూ కూర్చున్నారు, ఆమె ప్రక్కనే.

విచారణ ఎలా సాగుతుందో, ఏమి శిక్ష విధిస్తారో అని, నా గుండెలు పీచుపీచు మంటున్నాయి. కాని, ఇస్పహానీ ఎంతో నెమ్మదిగా, చిరునవ్వుతో అన్నారు : "మీకు మళ్లా శ్రమ యియ్యాలనుకుంటా; నిన్నరాత్రి విపరీతపు గాలి వలన రాకపోకలుచెడి, గుడివాడవారెవరూ ఈవాళ రాలేదు. మరోరోజుకు వాయిదా వేయక తప్పదు," అని.

కాశేశ్వరరావూ కమలాదేవీ నూజవీడులోనే ఉండిపోయారు. నేను ఒక్కడనూ బెజవాడకు తిరిగి వస్తున్నాను.

త్రోవ పొడుగునా నాకు ఈ స్వాతంత్ర్యసమర యోధులను గురించిన చింతే. వారి కార్యదీక్ష, వారి త్యాగము నా కెంతో గౌరవమును కలిగించాయి వారిదెస. రాజకీయాలతో ప్రసక్తి లేని నేను ఉద్యమములో పాల్గొనడానికి సిద్ధంగా లేకపోయినా, నాకు తోచింది : వారు ఏదో విధంగా తమ జీవితాలను చరితార్థం చేసుకుంటున్నారు. నేను ఎందుకూ పొందకుండా, కాలం వృధాగా గడిపివేస్తున్నాను. నాన్నగారు నియమించిన పని అనిన్నీ, ఏ పనిలోఉన్నా, ఆపని శాయశక్తులా బాగా చెయ్యాలనే సంకల్పము అవసరమనిన్నీ ఈఇన్సూరెన్స్‌పనిలో నిమగ్నుడనై ఉన్నాను. కాని, నేనుచేయవలసినపనినిజంగా ఏదో, ఇంతవరకు నిర్ణయించుకోలేకపోయాను. సాహిత్యంలోఉన్నఅభిరుచివల్ల స్నేహితులలో సాహిత్య గోష్ఠిలోనూ, మా కుటుంబమందలి గౌరవంవల్ల నాయందు ప్రేమాభిమానాలు చూపుతున్న మిత్రులతో ఇష్టాగోష్ఠితోనూ, రోజులు వెళ్లిపోతున్నాయి. కాని, నేను సాధించినది ఏమీ కనబడదు. మీదు మిక్కిలి, జీవితములోని గొప్ప వెల్తి అప్పుడప్పుడు చీకటిమయం చేస్తుంది మనస్సంతా. ఈ గోష్ఠిలో ప్రసరించే

## సా గు తు న్న యా త్ర

వెలుతురూ ఆ శూన్యభావంలోని చీకటీ మారి మారి కనిపిస్తున్నాయి. ఈ నా జీవితంలో నా స్థితి కవి కుమారినిగా విశ్వనాథ సత్యనారాయణవారి "నా స్థితి" లాగే ఉన్నది :

ఈ కెలన శరత్పూర్ణిమా వృతశశాంక
లలితరోచిర్వితాన, మా కెలన ఘోర
ఘనతరాంధకారచ్ఛటాక్రాంత భూమి,
అందునగ, మిందు నగముంటె, నవుర నేను !
ఈ శరత్పూర్ణిమా చంద్రికాసుధా మ
రీచిలో నన్ను నేను స్ఫారీభవన్న
వీనశంపాలతాకృతి పూనియుంటె!
ఈ నగము నాకు నాకె కన్పించబోదు;
ఉగ్రరాహు చంద్రార్ధబింబ గ్రసనము
పోలె నున్నది నా స్థితి !!

ఏమి చెయ్యను మరి ?

గన్నవరం ఇవతల ఏలూరు కాలువ వంతెన దాటుతూ మారిస్ వివరీతంగా చప్పుడుచేయగా, ఆ ధ్వనికి బెదిరి, టెలిఫోన్ తీగలపైన సభతీర్చి ఉన్న పిట్టలన్నీ ఒక్కసారి పైకి ఎగసిపోయాయి, ఏమి చెయ్యను మరి ? ఏమి చెయ్యను మరి ? అంటూ.

౮

తెలుగువాడ నేను
తెలుగునాడు నాది
తెలుగు పేరు నిల్పు
తెగువ పెంపు నాది
ఎగురవెయ్యి ఎగురవెయ్యి తెలుగుజండ!
త్యాగ ధైర్యములకు సాటిలేని జండ!

తెలుగు తల్లి నాది
తెలుగుసేవ నాది
తెలుగురాజ్య మేలె
తెలివితేట నాది
ఎగురవెయ్యి ఎగురవెయ్యి తెలుగు జండ!
త్యాగ ధైర్యములకు సాటిలేని జండ!!

వీరి వారి జోలి మాను మింక
వీరి వారి వెరపు మానుమింక
వీర రంగమందు మ్రోయు మింక
ఉరుమువంటి మన తెనుగు డంక
ఎగురవెయ్యి ఎగురవెయ్యి తెలుగు జండ!
త్యాగ ధైర్యములకు సాటిలేని జండ!!

తెన్నేటి విశ్వనాథం

# సా గు తు న్న యా త్ర

అప్రతిమాన ప్రతిభాసంపన్నుడనీ, ఆడి తప్పనివాడనీ, ధీశాలి అనీ పేరు పొందిన తెన్నేటి విశ్వనాథం సాహిత్య ప్రియుడనీ, తమా ఇంతో అంతో రచనా నైపుణ్యము అలవరచుకున్నవాడనీ మనవారికి అంతగా తెలియదు అనుకుంటాను. నిజానికి అతనికి రాజకీయరంగంకంటె సాహిత్యప్రపంచమే ఎక్కువయిష్టము. రాజకీయరంగంలో తరుచు కనుపించే కుయుక్తి, అతితెలివి, ఆయనకు కిట్టవు. ఏమాత్రం అవకాశము, తీరికఉన్నా ఆ రంగంలోంచి పారిపోయి, తనతో సరదాగా సాహిత్యవిషయాలను గురించి మాట్లాడగల స్నేహితుల గోష్ఠిలో ఉండిపోతారు ఆయన.

నా ఇన్సూరెన్స్ పర్యటనలో కాకినాడ, బెజవాడ మధ్య ప్రయాణంలో తరుచు అయనా నేను కలుసుకుంటూ ఉండేవారము చామర్లకోట స్టేషన్‌లో. అదేమి చిత్రమో, కాకినాడలో బయలుదేరిన నేను రైల్‌కార్‌లోంచి దిగుతూ చామర్లకోట ప్లాట్‌ఫారమ్ మీద అడుగుమోపేసరికి నా కట్టెదుట ప్రత్యక్షమయ్యేవారు ఆయన. ఆయనను చూడడముతోనే సంతోషముతో ఉప్పొంగిపోయేది నా మనసు—ఆయనంటే అంత ఇష్టమూ, గౌరవమూ నాకు. నాకోసమే నిరీక్షిస్తున్నట్టు ఆయన ముఖము ఇంతయ్యేది నన్ను చూడడముతోనే, మేము ఇద్దరమూ బెజవాడ వెళ్లే మెయిల్‌కోసం కనిపెట్టుకుని ఉండి, ఈమాటా, ఆమాటా, చెప్పుకుంటూ రైలు ఎంత ఆలస్యమైనా పాటించేవారముకాము. విశ్వనాథమంత చక్కగా సంభాషింప కలిగినవారు ఏఒకరో ఇద్దరో ఉంటారేమో మనలో, అంతే. పట్టాభిసీతారామయ్యగారు కూడా చాలాబాగా సంభాషిస్తారు. కాని, ఆయన మనకంటె చాలా పెద్దవారూ అనుభవజ్ఞులూ కాబట్టి కాబోలు, వారితో మాట్లాడుతూ ఉంటే, సంభాషణ ప్రారంభించిన రెండు నిముషాలలోనే వారిమాటలు ఒకఉపన్యాస ధోరణిని నడుస్తాయి. ఆయన చెబుతూ ఉంటారు; మనము వింటూఉంటాము, ఎంతో ఆసక్తితో, అంతే!

తెన్నేటి విశ్వనాథంతో సంభాషణ అల్లాకాదు. మనకంటే ఆయనకు ఎక్కువ అనుభవమున్నా మనకంటే ఆయనకు ఎన్నో విషయాలు తెలిసివున్నా,

ఎంతో ఇష్టాగోష్టిగా మాట్లాడుతారు ఆయన. మన అభిప్రాయాలు తెలుసుకోవాలని ఉంటుంది ఆయనకు. ఒక కొంత నియమిత వాతావరణంలోనివైనా, మన అనుభవాలనూ తాను మనతో పంచుకోవాలని ఉంటుంది ఆయనకు. ఆ రోజులలో ఆయన ఫస్ట్‌క్లాస్‌లోనే ప్రయాణము చేసేవారు. నేను కంపెనీవారి బత్తెంపైన, సెకండ్‌క్లాస్‌లోనే వెడుతూ ఉండేవాడను. నాతో మాట్లాడుతూ ఉండాలి అనే ఆసక్తి కొద్దీ, ఆయన తనకై రిజర్వైన ఫస్ట్‌క్లాస్‌బర్త్ వదలి, నాతోకలిసి ప్రయాణం చేసేవారు బెజవాడదాకా. నిమిషంలా గడిచిపోయేది ఆ అయిదు గంటల ప్రయాణమూ.

చామర్లకోట స్టేషన్‌లో మరొక వ్యక్తిన్నీ నాకు తటస్థమయ్యేవారు తరుచు. అప్పుడు వారితో నాకు పరిచయము లేకపోయినా, తరుచుచూస్తూ ఉండేవాడను నేను వారిని ఆప్లాట్‌ఫారం పైన. మల్లెపూలాంటి తెల్లని మల్లుపంచ, టసూర్ లాంగ్‌కోట్, ఠీవిగా తెల్లని తలపాగా, చెవులకు ధగధగ మెరిసే వజ్రాల కమ్మలు, మొఖంల్లో రాచకళ. ఒకసారి, ఆయన తెన్నేటి విశ్వనాధాన్ని పలుకరించగా, ఆ తరువాత విశ్వనాధం చెప్పారు నాతో, ఆయన కపిలేశ్వరపురం జమీందార్‌గారని.

మా నాన్నగారు చెప్పివున్నారు నాకుకపిలేశ్వరపురంజమీందారువారిని గురించీ, వారు చేస్తున్న విశేషమైన భాషాసేవను గురించీ. ఈసారి వారిని చూచినప్పుడు నేను ఫలానా అని ఎరుకచేసుకొని వారితో పరిచయం చేసుకోవా లనుకున్నాను కానీ, అట్టి అవకాశము కలుగలేదు అప్పట్లో. కాని, నేను కాకినాడ మకాములో ఉండగా ఒకసారి పనికట్టుకొని కపిలేశ్వరపురం వెళ్లాను స్నేహితుని కార్‌లో ఆ రోజు జమీందార్‌గారు ఊళ్లోలేరు. వారి కుమాళ్లు ఉన్నారు. మమ్మల్ని ఎంతో ఆదరించారు,

కపిలేశ్వరపురం ఊరు చాలా బాగుండేది. చుట్టుప్రక్కలఉన్న ఊళ్ళు అన్నీ నవనాగరికతవల్ల చాలా పాడైపోయిఉన్నా. ఈ జమీందారీ ఊరు మాత్రం

ఎంతో కళగా, ఒక చక్కని ఆరామగ్రామంలా కనిపించింది. అందమైన వీధులు ఆ నాలుగు వీధులూ. చక్కనితోటలు. జమీందారుగారి తోట అద్భుతంగా ఉండి, నానావిధ తరులత పుష్పములతో, పనస నారికేళా ప్రూది సకలవృక్షములతోను. మేము వెళ్లినప్పుడు బ్రహ్మాండమైన కానా పువ్వులతోట వెలసిఉన్నది. ఏ కలకత్తా బొటానికల్ గార్డెన్స్‌లోనో, ఏ బొంబాయి హాంగింగ్ గార్డెన్స్‌లోనో ఉండవలసిన రకరకాల మెట్ట తామర పువ్వులు — ఎంతో కన్నుల పండుపగా ఉన్నది తోట. అక్కడనుంచి తిరిగి రా బుద్ధి వెయ్యలేదు. అక్కడే ఉండిపోవాలి, అని అనిపించింది.

కొన్నేళ్ళయినాక, పూజ్యులు జమీందారు శ్రీ బులుసు బుచ్చి సర్వారాయుడు గారే నన్ను వెతుక్కుంటూ వచ్చారు మద్రాసులో. ఇన్నేళ్లయినా వారి ఆకారంలో గాని, వారి స్వరూపంలో గాని ఏమీ మార్పు లేదు; ఆ సౌజన్యమూర్తి నా ఎదుట ప్రత్యక్షమయ్యారు. నేను ఆశ్చర్యపోయాను. "ఇదేమిటి! ఇలా దయచేశారు! నేనే, తమ దర్శనానికి వచ్చిఉందును కదా. కబురు పెట్టిఉంటే!" అన్నాను.

ఆయన చిరునవ్వు నవ్వుతూ అన్నారు; "మీరు నాకు క్రొత్తగాదు; మీ నాన్నగారు నా స్నేహితులు; మిమ్మల్ని గురించి చాలా విని ఉన్నాను. మీవలన నాకోపని కావలసి ఉన్నది" అన్నారు.

పురాతన శాసనముల పుస్తకములలోని ఒక సంపుటము ఎంత వెతికినా వారికి లభించలేదట. దానికోసం మద్రాస్ కానిమరా లైబ్రరీకి వెళ్ళగా ఆ లైబ్రరీ వారు ఆ సంపుటము తమవద్ద లేదనీ, అటువంటి శాసనాలలోను, తదితర పుస్తకాలలోను వెర్రి ఆసక్తి ఉన్న నావద్దనో నాద్వారానో ఆ సంపుటము వారికి లభింపవచ్చుననీ అన్నారట వారితో. నేను తప్పకుండా ప్రయత్నిస్తానన్నాను.

తరువాత, ఈ విషయములను గురించిన పరిశోధనలలో ఈ కాలపు వారిలోకల్లా దేవగురువువంటివారైన అన్నగారు మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని

తీసుకువెళ్లాను జమీందారుగారి వద్దకు. తద్వారా రాజావారి ఆశయము కొంతవరకు నెరవేరినది అనుకుంటాను.

రాజావారు మన భాషకు చేసిన సేవ అమోఘము, వారు ప్రచురింపించిన ప్రాచ్య లిఖిత పుస్తకాలు రాధామాధవము, సుగ్రీవవిజయము నేను చదివి ఆనందించి ఉన్నాను.

రాధామాధవ కావ్యము రచించిన చింతలపూడి యెల్లనార్యుడు కృష్ణదేవ రాయల ఆస్థాన కవి. ఈ ప్రబంధములోని రాధ ఎంతో ఉదాత్తమైన నాయిక. కవిత్వం తియ్యగా ఉంటుంది.

కమలరాగ జాలకంబుల పచ్చల
మేడదండ బొన్న నీడ వికచ
మాధవీలతా సమాకీర్ణమై యొప్పు
చంద్రకాంత మణుల చవికిలోన

ఇచ్చట, పొన్ననీడను, మాధవీలతల మధ్య, చంద్రకాంత మణుల చవికి ఎంతో అందంగా కనిపించింది నాకు; ముఖ్యంగా "పొన్ననీడను" చాలా హృద్యంగా ఉంది, అల్లాగే రాధను సింగారించే సందర్భంలో :

సజ్జకంబైన కమ్మని జాజిదండ
సుదతి కొప్పున జుట్టిన జూడనొప్పె
గాము శబరుండు విరహిమృగముల దార్చి
పట్టు జీకటి గొనబోగు వారినట్లు

అనీ,

తరళలోచన యొకతె గేదంగి రేకు
రాధికాదేవి కబరి భారమున దోప
నది ప్రమోదాబ్ధి దేల్చె నేత్రాంబుజముల
జలద ఖండంబున హిమాంశు కళికవోలె.

అనీ,

దళదరవింద దళద్యుతి
గల రాధిక నిడుదవాలు గన్నులు నవక
జ్జల రేఖలు దీర్చిన గల
కల నవ్వందొడగె నల్ల గలువల చెలువన్.

అనీ, ఎంతో మధురంగా ఉన్నవని ఆనందించాను, నేను.

సుగ్రీవ విజయము కందుకూరి రుద్రకవి కృతమైన యక్షగానము. అతడు పదునారవ శతాబ్దము వాడు. ఈ రచన అచ్చమైన మధురకవితకు చెందినది. ఎన్నోరకాల దేశరచనలతో అద్భుతంగా ఉంటుంది. ఒక అర్ధచంద్రికలో, ఇలా వర్ణిస్తాడు కవి, సీతావిరహంతో కుములుతూ ఉన్న శ్రీరామచంద్రుని :

కన్నుల నశ్రులు గ్రమ్మగ వగచున్
ఔరా విధివశమని తలయూచున్
ఏటికి ప్రాణము లికనని తలచున్
క్రమ్మర సొమ్ములు రొమ్మున నొత్తున్
ఏగతి నోరుతు నికనని పలుకున్
బాపురె విధియని ఫాలము మొత్తున్.

రాజమండ్రి వెళ్ళినప్పుడల్లా నేను పెద్దాడ వారింటికి వెళ్లేవాడను. పెద్దాడ సుందరశివరావు నాన్నగారికి స్నేహితులు; మాకు ఆప్తులు. కందుకూరి వీరేశ లింగం పంతులుగారు స్థాపించిన సంస్థలను ఎంతో చాకచక్యంతో నడుపుతు వస్తున్నారు ఆయన ఆరోజులలో. వారి అమ్మాయి కామేశ్వరి. పెద్దాడ కామేశ్వరి పేరు తెలియని వారు లేరు యావద్భారత భూమిలోను. దేశసేవిక, స్నేహశీలి, సౌజన్యమూర్తి, ఆమె అంత మంచివాళ్ళు ఎందరో లేరు మన సంఘంలో. ఎవరన్నా ఇతరులకు మేలుచేస్తే కాస్తో కూస్తో తమ అహం ఉంటుంది ఆఉప కారంలో. మరేలాభమూ ఉన్నా లేకపోయినా ఒకవిధమైన సంతుష్టి ఉంటుంది తనలా ఇతరులకు సాయపడ్డాను కదా అని. కామేశ్వరికి ఈ సంతోషంకూడా అక్కరలేదు — తాను మేలు చేస్తున్నాను అనే ధ్యాసతో చేయడంలేదు కాబట్టి. తానూ, చిన్నప్పుడు ఎన్నో కష్టాలు అనుభవించిందో ఏమో, కష్టాలలో ఉన్న వారిని చూచినా, వారి గోడు వినినా, కరిగి నీరవుతుంది ఆమె హృదయం. లోక మంతా ఆమెకు సన్నిహితులే. కాని, లోకంలో జరిగే అన్యాయాన్ని చూచి సహించలేదు ఆమె. విపరీతమైన కోపం వస్తుంది ఆమెకు అప్పుడు. అహం తంగా వెళ్లి, ఆ అన్యాయపరులను శిక్షించి, న్యాయం జరపాలనే ఆత్రుత ఆమెను ఆవహిస్తుంది. సంప్రదాయం పేర, ఆచారంపేర, కొందరు చేస్తూన్న, చేయ డానికి తమ ముఖావంవల్ల ఒప్పుకున్న వారిని చూచి మండిపడుతుంది ఆమె. ఇటువంటి అప్పుడే అనుకుంటాను ఆమె ఒక తీవ్రమైన విమర్శ వ్రాసింది: "శాస్త్రాలూ, చట్టుబండలూ" అంటూ. స్వతహాగా తాను అంత రాజకీయవేత్త కాకపోయినా అప్పటి వాతావరణమును బట్టి, అమె రాజకీయ రంగంలో ఒక ముఖ్యమైన పాత్ర వహించక తప్పిందికాదు, అప్పుడే, పెద్దాపురం 'వనభోజన' సందర్భంలో పోలీసుల లాఠీచార్జి జరుగుత,

ఒక పర్యాయం నేను పెద్దాడగారి ఇంట్లో ఉండగా, తెన్నేటి విశ్వనాథ మున్నూ వచ్చారు అక్కడకు. అందరమూ కలిసి భోంచేసి, ఈ మాటా ఆమాటా మాట్లాడుకుంటూ, విశ్రమించి ఉన్నాము. నా అడయార్ సంప్రదాయం గురించీ,

లోకాలు మండిపోతున్నా, మిల్లు బట్టలు మానక, అవి సురావరంగా కాలం గడుపు తూన్న నన్నుగురించీ కాస్త తీవ్రంగానే విమర్శించే మాటలు అంటోంది కామే శ్వరి. నాకు తగిన డిఫెన్స్ లేక ఆమెతో వాదింపలేకపోతున్నా. నా స్థితి చూచి, సానుభూతితో, నా కేసి చిరునవ్వు నవ్వుటూ చూస్తున్నారు విశ్వనాదం.

అప్పుడు, ఒక గాలిదుమారంలా వంస్తూ పంటూ అక్కడ అవతరిం చారు దుర్గాబాయి. ఆ రోజులలో దుర్గాబాయి ఎక్కడకు వచ్చినా అంతే. ఆమె నైజమే అంత. రోజులూ అటువంటివే.

దుర్గాబాయిని నేను మొదటిసారి చూచినది మా నాన్నగారి ఆఫీస్‌లో. అప్పుడూ ఆమె ఇలాగే గాలిదుమారంలా వచ్చారు. అప్పుడు నేను మా నాన్న గారికి పర్సనల్ అసిస్టెంట్‌గా ఉండేవాడను. మధ్య హాలులో రోల్‌టాప్ టేబిల్ వెనుకగా నా కుర్చీ. నాన్నగారిని చూడడానికని ఎవరువచ్చినా, హైకోర్ట్ జడ్జి అయినా సరే నన్నుదాటి వెళ్లాలి. నా బల్లవద్ద ఒక్క క్షణము ఆగి నాన్నగారిని చూడడానికి అది సమయమేనా అని కనుక్కొని మరీ వెళ్ళాలి లోనికి. అది వాలాయితి.

కాని, దుర్గాబాయి రివ్వుమంటూ ముందుకు రావడం చూచాను. ఆ చారెడేసి కళ్ళు నన్ను విపరీతంగా ఆకర్షించాయి. ఎంత చక్కనికళ్ళు! ఆ విభ్రమము నుంచి నేను తేరుకొనే లోపల ఆమె నా ప్రక్కనుంచి దూసుకుపోయి నాన్నగారి వద్దకు వెళ్ళిపోయారు.

నేను నిర్ఘాంతపోయి, నాకు కాస్త అవతలగా నుంచున్న హెడ్‌క్లార్కు శాస్త్రి వైపుచూచాను. ఆయన ఎంతో వినయంతో, ఎంతో భక్తితో, అన్నారు: "ఆమె దుర్గాబాయి!" అని.

"అదిగో! దుర్గాబాయి!" అనే పిలుపు మంత్రవాక్యంగా పనిచేసే రోజులు

అవి. పోలీసులు తమ దారుణమైన చర్యలవల్ల జనులందరిలోనూ విపరీతమైన భీతిని నెలకొల్పారు. వారి జులుమ్ తాళలేక మద్రాసులో ఉద్యమం చల్లబడి పోవలసినదే. ఆనాడు ఆ మంత్రవాక్య సహాయం లేకపోతే. తన సాహసంవల్ల, అద్భుతమైన తన కార్యదీక్షవల్ల దుర్గాబాయి ఆనాటి ఉద్యమాన్ని కాపాడారు. ఆమె నాయకత్వాన స్వాతంత్ర్య సమరము ఒక క్రొత్తరూపము దాల్చి నవచైతన్యంతో విజృంభించింది.

ఆ దుర్గాబాయే, మళ్లా, అలాగే రివ్వుమంటూ వచ్చారు ఆ మధ్యాహ్నం పెద్దాడవా రింటికి రాజమహేంద్రవరంలో. "ఏడీ! విశ్వనాథం? విశ్వనాథం ఏడీ? ఇక్కడున్నాడటగా?" అంటూ వచ్చారామె. కాస్తగట్టిగానేఉన్నది ఆమె గొంతు. ఆమె రాకవిసురుకు తగినట్లుగానే,

విశ్వనాథం తా నేదో తప్పుచేసిన వానిలా నా వెనుక నక్కి నిల్చున్నారు. ఆ ఉదయం దానవాయిగుంటలో ఒక రాజకీయవేత్తల సమావేశంలో ఉండి ఉండవలసినదట ఆయన. అక్కడ తాను చేయవలసిన ప్రత్యేకమైనపని యేమీ లేదు కాబట్టి, అక్కడకు వెళ్ళకుండా, ఇలా వచ్చివేశారు ఆయన. ఆ సమావేశం ముగిశాక, ఆయనను వెతుక్కుంటూ ఇలా వచ్చారు దుర్గాబాయి.

కామేశ్వరి మాకందరికీ కాఫీలు, ఫలహారాలు అమర్చినాక, ఆ నాటి సంఘటనలను గురించీ, తదితర విషయాలను గురించీ వారి ముగ్గురిమధ్యా చర్చలు జరిగాయి కొంతసేపు. అప్పుడు విశ్వనాథం కాస్త విసుగుతోనే, "పోనిస్తురూ! ఇవి ఎప్పుడూ ఉండేవే. నాకు ఏక చికాకుగా ఉంది, ఎక్కడకన్నా పోదాము పదండి" అంటూ, నాకేసి చూస్తూ "ఇతను తన కార్‌లో తీసుకువెళతాడు మనలను ఏ ధవళేశ్వరమో, ఏ గోదావరి ఒడ్డుకో" అన్నారు.

ధవళేశ్వరంవద్ద గోదావరిఒడ్డు. ఆనకట్టకు కాస్త పైన, గుబురుగా పెరిగి నీటిపై వాలిన సీమచింతచెట్ల నీడను ఒడ్డుకు కట్టి వేసినలాడునుబట్టి గోదావ

సిటీలో తేలికగా అల్లాడుతున్న నావలో కూర్చుని ఉన్నాము, మేము ముగ్గురమూ. 'ఈ వియోగ దుఃఖ' అంటూ, నేను క్రొత్తగా వ్రాసిన కథను చదివి వినిపిస్తున్నాను వారికి. వారు ముగ్గురూ ఆసక్తితో వింటున్నారు:

కుంపేటికి మూడేళ్లు: చంద్రమతికి పట్టినదే పట్టు! పాపము, ఎంతో చెప్పాడు మోహనరావు. రోషకోపములెచ్చుకొని, పరుషవాక్యాలాడాడు కూడాను, మిక్కిలి ప్రాధేయపడి, "నాకోసం, మన ప్రేమకోసం, ఈ ప్రయాణం మానవూ" అని అడిగాడు. అతడుకు ఆమె వెళ్లిపోతుందనే బెంగవలన, దుఃఖము ఆపుకోలేక ఆమెముందర ఏడ్చివేశాడు కూడా, "వద్దు! నీవు వెళ్ళవద్దు — నిన్ను వెళ్ళనియ్యను. నీవు నాదానవుగావా? ఇటువంటి దానవు అసలు నన్ను పెండ్లెందుకు చేసుకోవాలి?" అంటూ.

అన్నిటికీ ఒక్కటే జవాబు: "మీకు తెలియదు. నేను వెళ్ళక తప్పదు."

తుదకు వెళ్ళితీరింది. అపరిమితమైన ప్రేమకలవాడు అతడు. ప్రేమ మాట ఎల్లాఉన్నా పట్టుదలకు పుట్టినిల్లు ఆమె. ఆమెమాటే కొనసాగింది, అతని వెర్రిప్రేమను త్రోసివేసి, ఆమె టాగూర్‌గారి శాంతినికేతనానికివెళ్ళింది. అక్కడ సంగీత సాహిత్యాలట, చిత్రలేఖనట, బెంగాలీఅట — ఇటువంటి మహావిషయాలు అభ్యసించడానికి. ఇక్కడ, ఇతను బిక్కుబిక్కుమనే హృదయంతో, భయంకరమైన ఒంటరితనంతో, నిద్దురలేని రాత్రులతో, కృశించడానికి....

అంటూ సాగింది నాకథ. అతిమేధావిఅయిన మోహనరావు మానసికంగా తనఅంతస్థును అందుకోలేని తన భార్యను కించపరుస్తాడు. బుద్ధిపూర్వకంగాకాదు సుమా. ఆమెకు ఇదివరకు అటువంటిఅవకాశాలు లేకపోబట్టి అతడు ఎక్కువగా ఆసక్తిచూపే లలితకళా విషయాలలో మానసికంగా ఉన్నత సంస్కారాన్నిసూచించే విషయాలలోనూ తనూ ఆసక్తి, అభిరుచీ చూపలేకపోవడంవల్ల వారిద్దరిమధ్య వ్యత్యాసము అతిశయిల్లి, ఆమె అతనికి తగినభార్యగాదనిస్ఫురించిచంద్రమతిఅలా వెళ్ళిపోతుంది శాంతినికేతనము. అక్కడ ఎంతో పట్టుదలలో కృషిచేసి అచిర

[illegible]ంలో సప్తవర్ణాలా సంవత్సరాలై శాంతినికేతనానికే వన్నెతెస్తుంది ఆమె. [illegible], ఇక్కడ ఇతను, ఆమె లేనిదే ఉండలేకపోతాడు. ఆమెకోసం తపిస్తూ, [illegible] సగమవుతాడు. ఆ స్థితిలో ఒకనాటిరాత్రి స్నేహితుల ప్రోద్బలంవల్ల అతను వారితో రాధాకృష్ణ నాటకం చూడడానికి వెళుతాడు.

ఆనాటకములో రాధపాత్ర అభినయము అత్యుత్తమ స్థాయినందుకుంటుంది. మోహన్‌రావు రాధ పాత్రలో లీనమైపోయి, ఎంతగానో తాదాత్మ్యమును పొంది, తానే రాధగా బాధపడతాడు. అక్కడ ఉండలేక ఇంటికి తిరిగి వస్తాడు.

ఇంటికి తిరిగి వచ్చిన మోహన్‌రావు తిన్నగా తన భార్య గదిలోనికి వెళ్లి తలుపువేసి, గోడపైన వేలాడుతున్న ఆమె బొమ్మకేసి అలాగే చూస్తూ ఉండి పోతాడు. "చంద్రం! చంద్రం!!" అంటూ తన గోడుచెప్పుకుంటాడు ఆ బొమ్మతో. తన ప్రేమమూర్తిని ఊరికే చూస్తున్నాడు:

అతని హృదయములో వేయి గాలములతో లాగు తున్నది బాధ. ఇక తాను జీవించగలడా? బొమ్మదగ్గర, బల్లమీద ఆమె బంగారపు గొలుసు కని పిస్తుంది, దీపపు కాంతిలో ధగధగ మెరుస్తోంది. గొలుసును మెడలో వేసుకుని, వ్రేళ్ళతో జపమాలను త్రిప్పుచున్నట్లు త్రిప్పుతున్నాడు. పెదవులతో స్పృశిస్తు న్నాడు; "చంద్రం.........చంద్రం నిన్ను నేను మళ్లా చూస్తానా" — అని విలపిస్తున్నాడు.

ఎప్పుడొచ్చిందో! ఎలా వచ్చిందో!! చంద్రం. తన ప్రతిమ ముందర, తన బంగారపు గొలుసును నమిలివేస్తూ, తన ఆకారంకేసే రెప్పపాటులేకుండా చూస్తూవున్న భర్తవెనుకచేరింది. ఆతని తల తన వక్షానికి జేర్చుకున్నది. ఆతని చెంపలమీద తన మెత్తని చేతులనుంచి, ముందుకు వంగి, ఆతని ముఖంలోనికి చూచింది. ఒకవంక చిరునవ్వు తాండవమాడుతోంది ఆమె ముఖంలో. ఒక వంక కన్నీరు కారుతోంది!

"ఇంత వెర్రి ఆపేక్ష!" అంటూ అతని పెదవులను ముద్దు పెట్టుకున్నది చంద్రమతి.

*　　　　*　　　　*

కథ ముగిసింది. ఒక్క క్షణం ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

"నిజమే! అంత వెర్రి ఆపేక్ష!" అన్నది కామేశ్వరి.

ఎవ్వరూ ఏమీ అనలేదు.

కామేశ్వరి మళ్లా అన్నది: "ఇప్పటికైనా మోహనరావుకి బుద్ధివచ్చిందా! తనే పెద్ద మేధావి అనే గర్వం కాస్త తగ్గిందా!" అన్నది. నన్ను ఉద్దేశించి అంటూన్నది. కాని నాకేసి చూడడంలేదు.

దుర్గాబాయి అన్నారు: "అది గర్వంకాదు. మనిషితరహా; కొంచెరులంతే. అన్నివిషయాలలోనూ తమ అంతస్థే ఎదుటివారిలో చూడాలని అపేక్షిస్తారు. మంచిభావంలోనే. కాని, అట్టివారికి ఆశాభంగం తప్పదు. ఆశయ భంగమూను"

కామేశ్వరి మళ్లా అందుకుంది: "ఈనాటి రచయితలఅందరి రచనలలోనూ ఇంతో, అంతో స్వీయకథ కనిపిస్తుందిఅని చదివాను, ఎక్కడో. ఇది నిజమేనా?" ఈసారి నాకేసి సూటిగా చూచింది కామేశ్వరి, కాస్త కొంటెతనంతో, ఎంతో చనువుతో.

నేనేమీ అనలేదు.

కాని, ఇంతసేపూ, ఈచర్చలో పాల్గొనకుండా ఎదుట నిశ్శబ్దంగా ప్రవహించిపోతూన్న గోదావరికేసిచూస్తూన్న తెన్నేటి విశ్వనాథం నీటిపేపే నిదానించి చూస్తూ, ఒక్కొక్కమాట ఏరిచివేస్తూన్నట్లు అన్నారు మెల్లగా:

"ఆ అభిప్రాయం ఈనాటిదికాదు. భాష పుట్టినప్పటినుంచీ ఉన్నదే ఆ లక్షణము. ఐతే, ఉత్తమరచయిత చేతిలో ఏదో ఒక వ్యక్తిగత అనుభవము విశ్వజనీనతనుపొంది, ఆ అనుభవములోని సత్యము లోకంలో అందరికీ, అన్ని ప్రదేశాలవారికీ వర్తిస్తుంది అనుకుంటాను" అన్నారు.

ఎంత ఉదాత్తమైన విమర్శ!

# ౧౦

వాడిన పూవున కేటికి మరలను
పరిమళ మొసగెదు దేవా!
ఎండిపోయినట్టి బావి నూటల
నేటికి నూరించెదు దేవా!
బ్రద్దలైన సంద్రపుటల నేటికి
పైకి తిరిగి పంపెదు దేవా!
నేలను పడుచున్న గాలిపడగను
నేటి కెగుర గొట్టెదు దేవా!
పారబోసుకొన్న ప్రణయ పాత్రను
పానీయముతో నింపెదు దేవా!
ఆశలు వీడినవానికి మరలను
ఆశ లేల గూర్చెదు దేవా!

బసవరాజు అప్పారావు

"ప్రతి మానవుని జీవితములోనూ, ఒక్కసారి, ఒకే ఒక్కసారి ఒక అవకాశం కలుగుతుంది. అపరిమితానందం గాని, దుర్భరవిషాదం గాని, అతని ఆ నిమిషపు నిర్ధారణను బట్టి కలుగుతుంది అతని జీవితంలో. అతని ఈ జన్మపు మనుగడ సర్వమూ అతి వివరంగా విధాతచేతిలో ఇదివరకే లిఖించి ఉంటుంది.

ఒక్క పుట తప్ప. ఆ ఒక్క పుట మాత్రము అతను, ఆ నిర్ధారణను బట్టి, తానే స్వయంగా లిఖించుకోవచ్చును" అని ఉన్నది కురాన్‌లో.

నా జీవితంలోనూ ఇటువంటి అవకాశము ఒకటి లభించినది కాబట్టి నా కీ పంక్తులు అంత బాగా జ్ఞాపకమున్నాయి. ఆ నిర్ణయము పూర్తిగా నేను చేయ వలసిన నిర్ణయమే. నేను "ఎందుకొచ్చిన బెడద! ఏదో ఇల్లా జరిగిపోతోంది, జరిగిపోనియ్యండి" అని ఊరుకొని ఉంటే ఏమీఅయిఉండేది కాదు. కాని, అలా ఊరుకోక, నా జీవితంలో ఒక క్రొత్త ఆనందము, ఒక క్రొత్త ఉత్తేజము, ఒక క్రొత్త లక్ష్యముకలుగుతవి అనే భ్రమతో, వెర్రిగా కోరుకున్నాను. ఆ ఒక్క పుట నా అంతట నేనే లిఖించడానికి సాహసించాను. మొదట, కోరుకున్నట్లే జరిగింది; పర్యవసానంమాత్రం, మరో విధము. ఆదివెన్నెల చరమచీకటిగా మారిపోవడానికి కారణ మెవరైతే నేమి!

నా నిర్ణయాన్ని ఆమోదించినవారు పత్రికాముఖాన నన్ను ప్రశంసించారు, నేను చేసినది ఆదర్శకరమైనదని. కాని, వెంటనే గుంటూరునుంచి రాయసం వెంకటశివుడు నాచర్యను తీవ్రంగా ఖండించారు. వారి వాదన చాలాసమంజసము. ఐనా, పూర్తిగా వ్యక్తిగతమైన ఒక చర్యకు సాంఘిక రీత్యా అనవసరమైన ప్రాముఖ్యత కలిగింది. నేను ఆశించినది, ఇతరులు సంఘసంస్కరణ అని భావించారు; వారు పొరబడ్డారు. నా సౌఖ్యమే నేను ఆశించాను; నేనూ పొరబడ్డాను.

గగనకుసుమంకోసం ఆశిస్తూ అహోరాత్రులూ పరితపించే మనలను చూచి విధి వింతగా ఊరిస్తుంది. "ఆ గగనకుసుమం నీకు ఎన్నటికీ గగనకుసుమమే. కాని, అటువంటి అందమైన పువ్వే, ఇంచుమించు ఆ పువ్వే అనుకోవచ్చు నీ వళ్లో పడుతుంది, తీసుకో!" అని బుజ్జగిస్తుంది. "అపరంజి, అపరంజి అంటారే గాని, అపరంజి ఎవరికీ దొరకదు. సాధారణ మానవులు నోచుకోకలిగినది ఏ పన్నెండు వన్నెలబంగారమో! దానితో తృప్తిపడడము మంచిది, అందరాని అపరంజికోసం అన్వేషిస్తూ జీవితాన్ని వృథాచెయ్యడంకంటే" అని చెవిలో నూరిపోస్తుంది విధి.

"ఎల్లాగో సరిపుచ్చుకోవడమే బ్రతుకుతెరువు — ఊరికే భీష్మించుకు కూర్చోవడము కంటే" అని నచ్చచెప్పుతుంది ఏఫి. ఈ లాలింపుమాటలకు లొంగితే. ఇక అంతే!

అసలు, నా మనస్సు ఈ ధోరణిని సాగడానికి కొంత కారణము మా అక్కయ్య మాటలు. "ఎన్నాళ్లు ఈ ఒంటరి జీవితము. ఐనది ఏదో ఐపోయింది. ఏదోవిధంగా నీ జీవితంలోకి కొంత ఆనందం రాకలిగితే ఎంతో మంచిది" అన్నది ఆమె, ఎంతో ఆప్యాయంతో నా కొరకు బాధపడుతూ. నా చిరకాల స్నేహితుడు మీర్‌చందానీ తో ఆమె వివాహము స్థిరమైంది. బొంబాయిలో పెండ్లి. అక్కయ్యా, నేనూ, బొంబాయి వెళుతున్నాము. రైలులో అక్కయ్య అంటోంది: "నీ స్థితిచూస్తే చాలా జాలిగాఉంది. ఏదో జరిగినది జరిగిపోయింది— ఆ విషయంలో నీ మనస్సు మారదని తెలుసు. కాని, ఎన్నాళ్ళు ఈ ఒంటరి జీవితము? నీ మనస్సులో ఏదైనా ఉద్దేశ్యముండి, తద్వారా నీభావిజీవితము ఆనందమయము కాగలిగే అవకాశము ఉన్నట్టు ఐతే, నీవు తప్పకుండా అలాగే చెయ్యవచ్చును—మే మెవరమూ అభ్యంతర పెట్టము. నిజానికి, నీ విషయంలో మేము సరియైన శ్రద్ధ వహించలేదు. ఇది మా అందరి తప్పే. ఐనా, ఇప్పుడైనా మించిపోయింది లేదు. నీవు చక్కగా ఆలోచించి నీవుకోరినవిధంగా నీజీవితాన్ని చక్కబెట్టుకో. నీవు సంతోషంగా ఉంటేనే మే మందరమూ సంతోషంగా ఉంటాము" అంటోంది అక్కయ్య.

కొన్ని కొన్ని ముఖ్య విషయాలలో నా అభిప్రాయాలనూ, నాచర్యలనూ తీవ్రంగా ఖండిస్తూ వచ్చినా, సహజంగా ఆమెకు నాపై ఉన్న ప్రేమ ఈ లోపాల నన్నిటినీ కప్పిపుచ్చి, నాయందు కేవలము సానుభూతినిమాత్రం ప్రకటిస్తోంది నా తోబుట్టువు.

మా రైలు షోలాపూర్ దాటుతోంది. సూర్యాస్తమాన సమయం. ఈ సమయంలో ఏదో వింత వాతావరణం ఆవహిస్తుంది మనలను. చిలిపి విషయా

లేవీ చొరపీలులేదు మనస్సులోకి, ఆ సమయంలో. ఏదో వర్ణనాతీతమైన తత్వ చింత కలుగుతుంది మనస్సులో.

"సంతోషానికి ఒక మార్గమంటూఉన్నదా? సరిపెట్టుకోవడమే సంతోషము" అన్నాను.

మా అక్కయ్య అన్నది; "అది నిజమేకావచ్చు. కాని, అది నీవు అనవలసిన మాట కాదు. నీ వంత నిరుత్సాహంగా ఉండనక్కరలేదు. ఎవరికి తెలుసు, జీవితంలోకి ఎటువంటి క్రొత్త క్రొత్త విషయాలు వస్తాయో! మనము ఒద్దంటున్నా తోసుకు వస్తాయి."

నేను ఏదో చెప్పబోతూ ఉండగా, "చూడు! చూడు!! ఎంత ఎర్రబడిందో ఆకాశం! సూర్యుడు అస్తమిస్తున్నాడు—ఎంత ఎర్రగా ఉన్నచో ఆకాశం!!" అంటూ సంభ్రమంతో అన్నది మా అక్కయ్య, ఇంతట్లోకి స్టేషన్ వచ్చింది; సంభాషణ సాగలేదు.

బొంబాయి చేరగానే, ఆప్త స్నేహితుడు డాక్టర్ పజూభాయి శుక్లా, ఆతని భార్య ప్రభాబెన్ ఇద్దరూ స్టేషన్‌కివచ్చి మమ్మల్ని తమ ఇంటికి తీసుకువెళ్ళారు. కాబోయే మా అక్కయ్య వివాహమును గురించి ప్రభాబెన్ ఎంతో సంబర పడుతోంది. మీర్‌చందానీ వారికీ చాలా ఆప్తుడే. ఈ సంబంధం వారికీ చాలా ఇష్టమైనదే.

నేను బొంబాయి మరో కారణంకొరకు కూడా వచ్చాను. చిన్నప్పుడు నా కేదో ఆపరేషన్ చేశారు. సాధారణంగా ఆ ఇబ్బంది మళ్ళారాదు, కాని నా విషయంలో మళ్లా జబ్బుచేయడంవల్ల తిరిగి ఆపరేషన్ అవసరమైంది. సరే, ఎల్లాగా బొంబాయి వెళుతున్నాము కదా, డాక్టర్ శుక్లా సహాయంతో ఆ పని పూర్తిచేసుకోవచ్చు అన్నది మా అక్కయ్య, బొంబాయి చేరిన ఆ మధ్యాహ్నమే డాక్టర్ శుక్లా నన్ను ఆ ఊళ్లోకల్లా పెద్ద సర్జన్ పరమార్‌వద్దకు తీసుకువెళ్లారు.

మేజర్ పరమార్ నన్ను పరీక్షచేసి, ఆ తరువాత శనివారమే ఆపరేషన్‌కి నిశ్చయించారు.

ఆపరేషన్‌కి క్లోరొఫామ్ ఇయ్యనక్కరలేదని, వెన్నెముకపైన ఉన్న నరంలోకి ఇంజక్షన్ ఇచ్చారు. కాని, నా విషయంలో ఆ ఇంజక్షన్ పనిచేయక, క్లోరొఫామ్ ఇయ్యక తప్పినదికాదు, మా అక్కయ్యకూడా పెద్దడాక్టరే కాబట్టి మేజర్ పరమార్ మాయందలి స్నేహాన్నిబట్టి, ఆపరేషన్ జరుగుతుండగా ఆమె నా ప్రక్కనే ఉండడానికి అనుమతించారు.

క్లోరొఫామ్‌వల్ల మత్తు కలుగడము ఒక వింత అనుభవమే. మొదట తియ్యని వాసన, అతి తియ్యని వాసన మనలను ఊపిరి సలుపకుండా, ఉక్కిరి బిక్కిరిచేస్తుంది, ముఖము మొత్తే ఆ తీయదనాన్ని భరింపలేక గాలికోసం ఆరాట పడుతుంది ప్రాణము. ఈ ఆరాటము కొన్ని క్షణాలే. ఆ తర్వాత ఆతీపికి అలవాటుపడిపోయి, ఇంకా కావాలి, ఇంకా కావాలి అనిపిస్తుంది, ఇలా అనుకుంటూ ఉండగానే మన సర్వేంద్రియాలనూ ఒక వింత హాయి క్రమ్మి వేస్తుంది. ఇదివరకు ఎన్నడూ అనుభవింపని ఒకానొక మహానంద సముద్రంలో మునిగిపోతాము. కాని, వెంటనే ఏదో వింత శక్తి మనలను పైకి లాగివేయగా, అలా అలా ఆకాశంలోకి తేలిపోతాము. గాలికంటే తేలికగా, ఏదో అద్భుతమైన తేజస్సులోకి వెళ్ళిపోతాము. చుట్టూ, అందమైన ఊదా రంగు కన్నులు మిరుమిట్లు గొలుపుతుంది. అలా ఆ ఊదా ఆకాశంలో తేలిపోతూ ఉంటే నక్షత్రాలు ఒక్కొక్కటే మన ప్రక్కనుంచి సాగిపోతూ ఉంటాయి. చేయి చాచి నక్షత్రాలను అందుకోవాలని ఉంటుంది,

అప్పుడు, నేను ఏదేదో వాగాను. వాగుతున్నాను అని తెలుసు. కాని, మనస్సులోకి వచ్చిన మాటలన్నీ చెప్పివేయ్యాలని ఉంటుంది. "ఎంత అందంగా ఉన్నది ఈ ఊదా ఆకాశం, ఈ నక్షత్రాలను చేతితో లంచి పుచ్చుకోవచ్చు—" అంటూ మొదలుపెట్టి అందాన్ని గురించీ, సౌందర్యోపాసను గురించి ఏవేవో

చెప్పాను. నన్ను నేనే గొప్పగా పొగుడుకోవడము మొదలుపెట్టాను. "నేను గొప్ప చిత్రకారుడను; హరీంద్రానాథ్ చటోపాధ్యాయకంటె, గొప్ప రచయితను నేను; అవనీంద్రునికంటె గొప్ప కళాశీలిని నేను. నాలో ప్రతి అణువూ సౌందర్యం కోసం ఆరాట పడుతుంది" అని ప్రలాపించాను. ఆపుగా ఏదో పద్యంకూడా చదివాను. ఆపరేషన్ ప్రారంభింపబోయే డాక్టర్ల మాటలు వినబడుతూనే ఉన్నాయి. ఆయుధాల చప్పుడూ వినిపిస్తూంది. నా ప్రలాపనను గురించి మేజర్ పరమార్ మా అక్కయ్యతోనూ, డాక్టర్ శుక్లాతోనూ అంటున్నారు: "ఎంత వింత వ్యక్తి ఇతను! ఇంతటి కళాజీవా?" అని. మా అక్కయ్య ఏమో జవాబు చెప్పింది. ఆమె కంఠస్వరము వినేసరికి నేను చప్పున ఆమె చేతిని గట్టిగా పట్టుకుని "అక్కయ్యా! నన్ను విడిచి వెళ్ళకేం! నీవు తప్పితే ఎవరున్నారు నాకు? అమ్మ తర్వాత అమ్మఅంతదానవు నీవు!!" అన్నాను. నేను ఇలా అంటున్నానని నాకు తెలుసు. కాని, మత్తుమందువలన ఎక్కువగా వాగుతున్నాననే ధ్యాసలేదు,

అమ్మమాట వచ్చేసరికి మా అక్కయ్య, అంత పెద్ద డాక్టరూ కళ్ళ నీళ్లు పెట్టుకుని ఏడువడము మొదలుపెట్టింది. ఆమె ఏడుపు వినిపించింది నాకు. మేజర్ పరమార్ క్లోరోఫామ్ మోతాదు కాస్త ఎక్కువ చెయ్యమని తన అసిస్టెంట్‌తో అనినమాట వినిపించింది. అంతే! ఆ తర్వాత ఏమైందో నాకు తెలియదు.

దీర్ఘనిద్రలోంచి నేను మేలుకొనేసరికి హాస్పిటల్ వార్డ్‌లో ఉన్నాను. కళ్ళు తెరిచేసరికి, చిరునవ్వు నవ్వుతూ నాకేసి చూస్తూన్న నర్స్‌ను చూచాను. "ఏమీ, ఆపరేషన్ కాలేదా?" అని ప్రశ్నించాను. ఆమె "ఆపరేషన్ జరిగి చాలా సేపైంది, ఇది హాస్పిటల్ వార్డ్, కదలకూడదు. నీ కేమి కావాలి? పళ్ళ రసమా? వోవల్‌టినా?" అని అడిగింది.

ఈ నర్స్‌లు చేసే సేవ అమోఘమైనది. ఎంత బాధ నివారిస్తారు వీరు! పైగా, ఎప్పుడూ నవ్వుతూ, అతి చలాకీగా ఉంటారు. మన కేమికావాలో మనం మాటగా చెప్పకుండానే ఇట్టే గ్రహించివేస్తారు. ఒక్కవారం రోజు లున్నాను.

ఆస్పత్రిలో. ఆ వారం రోజులూ ఆ ఇద్దరు నర్సులూ నాకు చేసిన సేవ ఎప్పటికీ మరువలేను. ఒకరి తర్వాత ఒకరు, వంతులుగా నా కెంతో పరిచర్య చేశారు. వారికీ నాతో మాట్లాడాలని ఉండేది. అప్పుడప్పుడు సాహిత్యవిషయాలు చర్చిస్తూ ఉండేవారు నాతో. గాయము డ్రస్ చేయడానికి ముందు నర్సు అనేది, నవ్వుతూ: "ఈ మందు భగ్గుమని మండుతుంది. నువ్వు బాధ ఓర్చుకోగలవా? ఏదీ చూద్దాము. ఎలా ఓర్చుకుంటావో" అనేది. అబ్బా! నిజంగానే, భరింపలేనంతగా భగ్గుమని మండేది ఆ మందు! కాని, బాధ తెలియనియ్యలేదు నేను. ఆమె సంతోషించి "భేష్! ఎలా ఓర్చుకున్నావో ఇంత బాధ! మరెవ్వరన్నా ఐతే గిజగిజలాడిపోయేవారు" అనేది.

నాలుగవ రోజున, నన్ను చూడడానికి వచ్చిన అక్కయ్యతో అన్నాను, ఆమె వెళ్లిపోయేముందు "నీకేమైనా కావాలా?" అని నన్ను ప్రశ్నింపగా, "మరేం, మరేం, ఊళ్లో మెట్రో సినిమా హాల్‌లో టార్జన్ ఆఫ్ ది ఏప్స్ ఆడుతున్నదట. అద్భుతంగా ఉన్నదట. రెండు ఫస్ట్‌క్లాస్ టిక్కెట్లు తెచ్చిపెడతావా?" అని.

అక్కయ్య ఆశ్చర్యపోయింది, "ఆపరేషన్ కుట్లు ఇంకా విడదీయనేలేదు. అప్పుడే సినిమా ప్రోగ్రామా!" అన్నది. ఇంతట్లోకి నాకు ఆమ్లరసంనుంచుని మందు సీసాను తుడుస్తున్న నర్సును చూచి వెంటనే గ్రహించి, "ఓహో! అలాగే తప్పక తెస్తాను." అన్నది.

ఆ నర్సులు ఇద్దరూ ఎంతో సంతోషించారు. మా అక్కయ్య ఇచ్చిన టిక్కెట్లతో తాము చూచివచ్చిన సినీమా గురించి వింతగా ప్రస్తావించారు నాతో. "ఇన్నేళ్ళలో, ఇంత మంచి సినిమా చూడలేదు మేము" అన్నారు. ఎంత సుఖమో ఒకరిని సంతోష పెట్టడము!

మా అక్కయ్య పెండ్లి తంతు చాలా టూకీగా జరిగిపోయింది, అసలు అలాగే ఉండాలి మన వివాహాలు. ఉదయం సరిగ్గా పదకొండు గంటలకు డాక్టర్

శుక్లా ఇంటి డ్రాయింగ్ రూమ్‌లోకి రెజిస్ట్రార్ ఆఫ్ మేరేజెస్ వచ్చారు. మీర్ చందానీ అన్నగారు ఇంజనీయర్ మీర్‌చందానీ శుక్లా స్నేహితులూ ఊళ్లోనలుగు రైదుగురు పెద్ద మనుష్యులూ వారి స్త్రీ జనంతో వచ్చి ఉన్నారు. వీరి సమక్షన మా అక్కయ్యా మీర్‌చందానీ రెజిస్ట్రార్ పుస్తకంలో సంతకాలు చేశారు. పెద్ద మీర్‌చందానీ, డాక్టర్ శుక్లా, ఆయన స్నేహితుడు ఛటో వల్లభభాయీ సాక్షి సంతకాలు చేశారు. పెండ్లి అయినది అంటే అయినది అన్నారు. నూతన వధూ వరులను ఆశీర్వదించి రెజిస్ట్రార్ వెళ్లిపోయారు. ఇంత పనికీ ఆయనకు ఒక్క పదహారు రూపాయలే! అదీ మన ఇంటికి వచ్చినందుకు; లేకపోతే ఏ మూడు, నాలుగు రూపాయలో! ఇంత సులభంగా అతి పవిత్రమైన వివాహకాండ జరిగి పోతుండగా మనవాళ్లు అతి వెర్రిగా వేలకు వేలు పెండ్లిఉత్సవాలకు ఖర్చు పెడతారు, వట్టి వెర్రి, అనుకున్నాను నేను.

మే మందరము 'పురోహిత్స్ రెస్టరాం'కు వెళ్లాము; డాక్టర్ శుక్లా విందు చేశారు. లోవలో, ఫోటోగ్రాఫర్ వద్ద ఆగి నూతన వధూవరులు ఫోటో తీసు కున్నారు. మీర్‌చందానీ అందిచ్చిన అద్భుతమైన ఇన్ని ఎర్ర గులాబీ పూలు గుత్తిగా చేతితో పట్టుకుంది అక్కయ్య. ఆ రాత్రే వారిద్దరూ మవుంట్ ఆబూకి వెళ్లిపోయారు. మవుంట్ అబూ చాలా సుందర ప్రదేశం. అక్కడ అద్భుత శిల్ప సంపదగల చలువరాతి జైన దేవాలయాలు ఉన్నాయి. ఒక నందనవనంలా ఉంటుంది అబూపర్వతం పైన. నేనూ రెండుసార్లు వెళ్లాను అక్కడకు.

రైలు కదలబోతూంటే అక్కయ్య మళ్లా అన్నది, చెమ్మగిలిన కళ్ళతో నన్ను చూస్తూ: "ఏదో నిర్ధారణకు వచ్చి నీవూ నీ జీవితాన్ని సంతోషముతో నింపుగో. నీ ఆనందం గురించే సదా ఆలోచిస్తూ ఉంటాము మీర్‌చందానీ, నేనూ...." ఇంకా ఏమి అనాలనుకుందో దుఃఖం ముంచుకు వచ్చి ముఖం ఆ వేపు తిప్పుకుంది. మీర్‌చందానీ ఆమెను సముదాయింపవలిసివచ్చింది.

## సాగుతున్న యాత్ర

మన అక్కచెల్లెళ్లు మనకోసం అనుభవించే ఆరాటములో పదవవంతు మనకుండదు వారంటే. వారు కాపురంచేస్తూ, తాము పిల్లా బలగముతో వర్ధిల్లుతున్నా నిరంతరం మనలను గురించిన చింతే వారికి. అందులోనూ, ఏకారణాల వల్లనైనా, మన స్థితి ఉండవలసినంత ఆనందకరంగా లేకపోతే వారు చాలా బాధపడతారు. పూర్తిగా స్వార్థరహితమైన ప్రేమ సోదరీప్రేమ.

బొంబాయిలో ఉన్న వారం పదిరోజులు చాలా సరదాగా గడిచిపోయాయి. ఇదివరకు నేను ఉన్నప్పుడు నాకు స్నేహమైన గుజరాతీ వారందరూ ఒక్కొక్కరే వచ్చి చూచిపోతూ ఉండేవారు నన్ను. పూర్వవిషయాలు ఎన్నో మననము చేసుకుంటూ ఉండేవారము. ఆ రోజులలో సీత, స్వాతి, అనూరాధ—అనే ముగ్గురు కూర్గీ అమ్మాయిలు ప్రభాబెన్ ద్వారా నాకు స్నేహమయ్యారు. వీరి అక్కగారు అలహాబాద్ కాలేజ్ ప్రిన్సిపాల్గా ఉండేవారు, నేను ఆమెను ఎరుగుదును. వీరు ముగ్గురూ కూడా బాగా చదువుకున్నారు. ఆధునిక సాహిత్యంలో ఎంతో అభిరుచి, సీత అనుకుంటా, లైట్ ఆఫ్ ఏషియా అనే మొదటి భారతీయ టాకీలో ప్రధాన పాత్ర వహించింది కూడాను. ముగ్గురూ మూడు తరహాల వ్యక్తులు, అందరిలోకి స్వాతి చాలా స్నేహశీల. ప్రభాబెన్కు ఆమె అంటే కాస్త పక్షపాతము. ఆమెను గురించి నాలుగైదుపర్యాయాలు ప్రస్తావించింది నాతో ప్రభాబెన్ సాభిప్రాయంగా. నేను ఇంకా కొన్నాళ్లు బొంబాయిలో ఉండివుంటే, మనస్సు ఎలా మారేదో గాని ఇంతట్లోకి నేను మద్రాసు వచ్చివేశాను.

నేను మద్రాసు బయలుదేరేముందు ప్రభాబెన్ తమ దగ్గరి స్నేహితులందరినీ భోజనానికి పిలిచింది. ఆ విందుకు లీలావతీ మున్షీ కూడా వచ్చింది. ఆమెను "మా గుజరాతీ భాషలో ఉత్తమ కథా రచయిత ఈమె" అని పరిచయం చేశారు నాకు. నన్ను గురించి ఆమెతోనూ ఏవేవో విశేషంగా చెప్పారు. తరువాత ప్రభాబెన్ చెప్పింది నాతో, లీలావతి, మున్షీల వివాహం గురించి. అది వారిలో

జరిగిన 'ప్రేమ వివాహాల'లో మొదటిది అనీ, వారిద్దరికీ పరిచయం కలగడానికి ప్రధాన కారణము వారికి సాహిత్యంలో కల సమాన ఆసక్తి అనీ.

నేను బొంబాయిలో ఉండగానే, కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ మీటింగ్ అయింది. వర్కింగ్ కమిటీ సభ్యులు అందరూ డాక్టర్ శుక్లాకి స్నేహం. "ఒకసారి నాతో వచ్చి చూడు వర్కింగ్ కమిటీ సమావేశము. వారంతా కేవలం బడిపిల్లలలాగ ఎలా వాదులాడుకుంటారో నీకే తెలుస్తుంది." అన్నారు శుక్లా. నేను వారితో కూడా వెళ్ళాను. ప్రభాబెన్ కూడా వచ్చారు. ఆమె రెండు మూడు పర్యాయాలు సత్యాగ్రహంచేసి, ఒకసారి చంటిపిల్లతోసహా జైలుకు వెళ్ళారు. రాజకీయ రంగాలలో డాక్టర్ శుక్లా, ప్రభాబెన్ అంటే అందరికీ పరమ ప్రాణము.

డాక్టర్ శుక్లా ప్రక్కన ఉండబట్టి ఆనాటి వర్కింగ్ కమిటీ సమావేశం వేదికకు అతిసమీపాననుంచిని చూడగలిగానునేను. ఇటువంటిఅవకాశము సభ్యులు కాని వా రెవరికీ లభించదు సాధారణంగా. ఆనాటి సమావేశంలో మన జాతీయ పతాకం గురించి చర్చ సాగింది. కాస్త తీవ్రంగానే ఉన్నది చర్చ. వాదోప వాదాలు గట్టిగానే జరుగుతున్నాయి. ఒకరిమాట ఒకరు వినిపించుకునే వారుకారు.

ఈ అల్లరి అంతా నవ్వు ముఖంతో చూస్తోంది అంతసేపూ, సరోజనీదేవి. కన్నపిల్లలు చిలిపి విషయాల కోసం కొట్లాడుకోవడం చూస్తూన్న తల్లిలా కని పించింది నాకు ఆమె. ఎంత సహనభావము, ఆమె ముఖంలో! ఒక్కొక్కప్పుడు ఒక సభ్యుడు మరీ తీవ్రంగా వాదిస్తూ, ఎదుటివారిపైన కోపంతో ఏదో అంటూ ఉండగా సరోజని అతని చెయ్యి పట్టుకొని అతి శాంతంగా అతనిని నెమ్మది పరచేవారు.

ఒక్క పట్టాభి సీతారామయ్య మాట్లాడినప్పుడు మాత్రము చీమ చిటుకు మనినా వినిపించేటంతటి నిశ్శబ్దతతో విన్నారు సభ్యులందరూ. ఎంతో చక్కగా

చెప్పారు ఆయన మన జాతీయపతాకగాధ. మనకందరికీ ఒక జండా వచ్చిన యుదంతము ఆయన చెప్పిన రీతిని ఒక అద్భుతమైన వీరగాధ. ఎంత త్యాగము, ఎంత సహనశక్తి ఈ మన జండా సాక్షాత్కారిస్తుందో చెప్పారు ఆయన. తెలుపు, ఆకుపచ్చ, కేసరీ, ఆ వర్ణముల అంతరార్థము, మధ్యను రాట్నము ఉన్నందున పతాకానికి కలిగే ఆధిక్యత, ఆయన వివరించారు. ఆయన ఉపన్యసించి కూర్చున్న వెంటనే సభ్యులందరూ కరతాళధ్వనులతో ఆయన ప్రతిపాదనను ఆమోదించారు ఏకగ్రీవంగా.

"చూచావా, మీ పట్టాభి ఎంత సమర్థుడో ! ఈ పూట ఆయనను ఓడించాలని స్థిర సంకల్పంతో వచ్చారు బెంగాలీవారూ, లక్నోవారు. కాని వారి ఆటలు సాగలేదు. చరిత్ర ఆయనకు కంఠో పాఠము. ఎంతటి నిపుణతతో సమర్థించారు తన వాదన ! అతి కుశాగ్రమైన బుద్ధి. ఎంత సహేతుకంగా ప్రదర్శిస్తారు, తమ అభిప్రాయాన్ని ! ఎన్ని విషయాలు తెలుసు, ఆయనకు ! కాంగ్రెస్ పుట్టుపూర్వోత్తరాలూ ఇకముందు నడువ వలసిన విధానం, ఆయనకు అవగాహన ఐనట్టు ఈ సమావేశంలో మరెవ్వరికీ అవగాహన కాలేదు. అందుకే, ఆయనంటే మహాత్మునికి అంత గౌరవం !" అన్నారు డాక్టర్ శుక్లా నాతో.

సభ ముగియడంతోనే, బూలాభాయి దేశాయి అనుకుంటా లేచివచ్చి, డాక్టర్ శుక్లా చేయిపట్టుకొని, "రా, ఫలహారానికి వెళుదాము" అని మమ్మల్ని ఇద్దరినీ తనతో లోనికి తీసుకువెళ్ళారు. లోపలకు వెళ్ళబోతుండగా, మా పిన్ని రుక్మిణమ్మగారూ వారితోకూడా అయ్యదేవర కాళేశ్వరరావూ మాకు ఎదురయ్యారు. వారిద్దరూ నన్ను చూచి ఆశ్చర్యంతో, ఇద్దరూ ఒక్క మాటగా, అన్నారు : "ఇదేమిటి ! నువ్వు ఎల్లా వచ్చావు, ఇక్కడకు !" అని. నేను నవ్వుతూ డాక్టర్ పజూబాయి శుక్లాని పరిచయం చేశాను వారికి.

మద్రాసు చేరగానే నాన్నగారు నా ఆరోగ్యం గురించి ఆదరంగా అడిగి

తెలుసుకున్నారు. "కొన్నాళ్లు విశ్రాంతి తీసుకొని ఈసారి ఇన్సూరెన్స్ పని అతి చురుకుగా చెయ్యడానికి పూనుకోవాలి. నీకు ఆ చిన్నకార్ ఇచ్చి అప్పుడే రెండేళ్ళు అయింది. ఆ కార్ కాకినాడ ఏజెంట్ తనకు కావాలంటున్నాడు. అది అతనికి ఇచ్చివేసి ఇంకో కాస్త పెద్ద కార్ కొనుక్కో. నీ కోసం ఒక టూ సీటర్ సిట్రాయెన్ కార్ చూచి ఉంచాము" అన్నారు.

టూ సీటర్ సిట్రాయెన్ బలే బాగుంది. "పూల రంగడవు నీవు! నీ కోసమే ఈ కార్ ఉంచాము; మరెవ్వరికీ చూపించకుండా అన్నాడు" కృష్ణ మూర్తి, కంపెనీ మానేజర్, మా పినతల్లి కుమారుడు.

ఆ టూ సీటర్‌ను, మన ప్రాంతాలలో వారందరూ చూచి విస్తుబొయ్యేవారు. అంత క్రొత్తగానూ, అంత నాజూకుగానూ, ఉండేది ఆ కార్, ఆ రోజులలో. క్రిస్టమస్ సెలవులు మద్రాసులో స్నేహితులతో గడిపి, సంవత్సరాంతానికి బెజవాడ చేరాను. దరిమిలా నామూడేళ్ళ చరిత్రా కారే చెప్పాలి. అంతగా కలసిమెలసి ఉండేవారము నేను, నా కారూ. నేను ఎవరితోనో అతి రహస్యంగా చెప్పవలసిన నా ఆంతరంగిక భావాలను నా సిట్రాయిన్‌తో చెప్పుకునేవాడను. ముందరిభాగము లేత ఆకుపచ్చ; తతిమ్మా కారంతా ధాతైన ఆకుపచ్చ. పలుచని లేత ఆకుపచ్చ వల్లెవాటు వేసుకుని ముదురు ఆకుపచ్చ చీర కట్టుకున్న స్త్రీ రూపంలా ఉండేది ముద్దులొలుకుతూ నాకార్.

సంవత్సరాదినాడు వేకువనే కార్‌ను శుభ్రంగా కడిగి, తళతళ మెరిసే టట్లు పాలిష్‌చేసి, కారంతా పువ్వులతో అలంకరించాడు వెంకటేశ్వర్లు. విండ్ స్క్రీన్ చుట్టూ ఎర్రని మందారాలతో కన్నుల పండువుగా ఉన్న సిట్రాయన్‌ను చూచి, సంవత్సరాదికి నన్ను చూడడానికి వచ్చిన స్నేహితుడు కామరాజు వినాయకరావు సంతోషం పట్టజాలక "భేష్; న్యూ కార్! న్యూ లైఫ్! న్యూ-!" అన్నాడు. ఆ మూడవ మాట నా చెవులను కొట్టి నట్లయింది. కాని, అదేమి

బుద్ధిమాంద్యమో నేను అతనివి వారింపలేదు సరికదా, నేనూ అతనంత ఉత్సాహంతోనే, ఆ త్రివర్గమైన ఉగాది ఆశీస్సులనూ ఉత్సరించాను.

ఆ రాత్రి మాత్రం చాలా బాధపడ్డాను - ఏమిటిది ? మనస్సు ఇలా లాగుతోంది అని. మా అక్కయ్య అనిన మాటలు జ్ఞాపకం వచ్చాయి; కాని, చిరకాల వేదన ఒక్క క్షణంలో త్రోసివెయ్యలేము—ఎంత ఉత్సాహము ఆవహించినా, ఆ బాధ అలాగే ఉంటుంది. చేతిలోంచి జారిపోయిన స్వర్గము కొరకు ఈ ఆరాటము ఎన్నటికీ తప్పదు. ఏ రాత్రి, ఓరగా వేసి ఉంచిన ఆ తలుపును తెరచి కొని, అలా ఆ చీకటిలోకి ఆమె మాయమై పోయిందో, ఆ రాత్రి నుంచీ ఈకళ్ళకు కునుకుపాటులేదు. ఎలా ఉంటుంది !

దారు లన్నియు మాపె, దశదిశలు ముంచెత్తె
నీరంధ్ర భయదాంధకార జీమూతాళి;
ప్రేయసీ, ప్రేయసీ! వెడలిపోయితివేల
ఆ యగమ్య తమస్వినీ గర్భకుహారాల?

ఆ యఃఖాతంపు టేకాంతమ్ములో త్రోసి,
ఛాయమై, మెల్లగా నీ యడుగు సందడులు
నా యెడద త్రోవనే పడి నడచినట్లయ్యె,
నా యెడదలోననే మాయమైనట్లయ్యె! ...

......నాటినుండియు నేను, ప్రతి నిశీథమంపు
గాటుకలచాటు స్రోఘల్ పంథయలేని తరి,

చూచుకొని చూచుకొని శూన్య హృదయములోని
'కోచెలీ!' యని, క్రుంగి క్రుంగి యేడ్తునుసుమా!

సడిలేని నడిరేయి బడిపోయినట్టి నీ
కడియాల రవళులే, చిరు గాజుల మ్రోతలే,
వ్రేలెత్తి చూపు జీవిత పథమ్ములు నాకు;
కేలెత్తి నడిపించు, నెగ్గెత్తి నన్నిలుచు!

అనే స్నేహితుడు కృష్ణశాస్త్రిలాగే, నేనూ పూర్వాన్ని మరచి పోలేను, ఎంత ప్రయత్నించినా. కాని, జీవితము మొండిది. చివరకు తన పట్టే నెగ్గించు కుంటుంది.

ఎంతచక్కని వెలుతు రెంత చక్కని వెలుతు

రెంత చక్కని గాలి యెంత చక్కని గాలి!

ఎంతకాలంబాయె, ఈ సౌఖ్యమును గాంచి!

మైమరచి పోవలయు మందమారుతములో

చొక్కి పోవలె నేడు సూర్య కిరణాలలో

పండు వెన్నెలలోన పరవశము కావలయు . . .

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి

రాత్రి పదకొండు గంటలు. గుంటూరునుంచి బెజవాడ వస్తున్నాము మా సిట్రాయన్ టూ సీటర్ కార్‌లో ఆప్తులు తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రీ నేనూ. అన్నగారు తాము క్రొత్తగా వ్రాసిన 'వకుళమాలిక' ఖండకావ్యము చదివి వినిపిస్తున్నారు నాకు కార్ డాష్‌బోర్డ్ దీపపు సన్నని వెలుతురులో. ఆ వెలుగులో స్ఫురద్రూపి ఆయన ముఖం వింతగా ప్రకాశిస్తోంది.

పుష్పమాలికగా నే పుట్టియుండనయేని

పూబోణిగా నేను పుట్టగల్గితినేని

అతనినే వరియించి ఆత్మవల్లభునిగా

కౌగిలింతు తదీయ కంఠమే నే వేళ!

గుంటూరులో పత్రి విఠలరావు ఇంట కలిసారు నన్ను శ్రీ శివశంకరశాస్త్రి

"నేను ఒక్కణ్ణే వెళుతున్నాను బెజవాడ. నాతో రారాదా, ఉపయమే అక్కడ ఉన్న మీ స్నేహితులను అందరినీ చూద్దురుగాని" అని నేననగా, "అంతకంటే ముఖ్యం; మీతో కార్ ప్రయాణము! అవశ్యము వస్తాను" అంటూ తోడే వసూ బయలుదేరారు. గుంటూరు ఊరు విడిచిన ఓ నిమిషానికి తన జోలె లోంచి చిన్న వ్రాతప్రతి తీసి "నే రచించిన క్రొత్త కావ్యము. వకుళమాలిక చదువుతాను వింటారా" అంటూ చదువ నారంభించారు.

అన్నగారు నవ్యసాహిత్య మార్గదర్శకులు. వారి ప్రోత్సాహంవల్లనే అప్పటికి ఒక పన్నెండేళ్ళ క్రితం సాహితీసమితి వెలసి, సమితి సభ్యులు నవ్య సాహిత్య ఉద్యమానికై ఎంతో కృషిచేశారు. ఆ తరము వారికి, రచయితలకూ కేపుచుటా, శ్రీ శివశంకరశాస్త్రి గురువు వంటివారు. కాని, గురువులా దూరంగా ఉండేవారుకారు. ఆప్త స్నేహితునిలా ఎంతో దగ్గరగా ఉంటూ, ఎన్నోవిధాల ఉత్సాహం కలిగించేవారు నవ్యకావ్య రచనకు. మహాపండితుడు ఆయన. భాషా సంప్రదాయాలను గురించి ఆయనకు తెలియని విషయం లేదు అనవచ్చు. ఆయనతో మాట్లాడుతూ ఉండడమే ఒక గురుకులవాసం వంటిది.

సంస్కృతసాహిత్య లక్ష్య లక్షణాలు ఎన్నో తెలుసుకున్నాను నేను వారితో సంభాషణ ద్వారా. పూర్వ లాక్షణికుల ప్రతిభ గురించీ, వారి జీవిత విశేషాల గురించీ వినినకొలదీ ఇంకా వినాలని ఉంటుంది శివశంకరశాస్త్రి చెపుతూంటే. వేదధర్మములు ఆయనకు కరతలామలకము. కాని, బౌద్ధగాథలూ ఆయనకు మిక్కిలి ప్రియము. ప్రాచీన కథావస్తువుకు వింతగా జీవంపోసి, అతి నవీనంగా రాణింపచేయగల నేర్పూ ప్రతిభా ఉన్నాయి వారికి. వీటి అన్నిటికంటే ముఖ్యమైనది ఆయన అలవరచుకోకలిగిన విశ్వప్రేమభావము. సకలచరాచరప్రాణి కోటినీ తన బాహువులమధ్య ఇమిడ్చుకొని తన హృదయానికి గట్టిగా హత్తుకో గలరు ఆయన. అంత ప్రేమ ఉన్నది ఆయనలో. ఈ ప్రేమ ఒక్కొక్కప్పుడు కొంత 'అపాత్రదానము'నకు కారణమవుతుంది కూడా. ఇతరుల మనస్సు నొప్పించడానికి ఇష్టంలేక, ఆయన అప్పుడప్పుడు అతి నిశితమైన తన విమర్శనా

దృష్టిని కాస్త సడలించడముకద్దు. అటువంటప్పుడు నాకు ఆయనపైన చాలాకోపం వస్తుంది. "మీ విమర్శ ఎంత విలువైనది! పనికిరాని వస్తువును అలా మెచ్చుకోవడము అపరాధముకాదా?" అని చనువుతీసుకు నేనంటే "పోనిస్తురూ! కుర్రవానికి ఉత్సాహం ఉంది. కృషిచేసి రాణిస్తాడు. నా పొగడ్త దీవనగా పని చేస్తుంది" అనేవారు శివశంకరశాస్త్రి.

'వకుళమాలిక' చాలా చక్కగా కుదిరింది. చైతన్యరహితమైన పొగడ దండచేత ఎంతో ఆర్ద్రమైన ప్రేమకథ చెప్పించారు అన్నగారు. నలభై నిమిషాల ప్రయాణము ఒక్క క్షణంలా గడిచిపోయింది. బెజవాడలో మా గుమ్మంముందు కార్ ఆగిందీ, కావ్యపఠనా ముగిసింది;

జలజలని రాలె నా సమయాన వారిపై
పొగడశాఖల నుండి పుష్పాలు వానగా,
పర్ణముల్ చలియింప పండువెన్నెల నిగ్గు
వాలె సొంపుగ వారి వదన బింబాలపై!

అనే అతి రమ్యమైన రూపకల్పన గురించి ప్రశంసిస్తూ అన్నగారిని నాతో కూడా మా మేడమీదికి తీసుకువెళ్లాను. ఆ రాత్రి అక్కడ విశ్రమించి, మరునాడు వేకువనే కాఫీత్రాగి వెళ్ళిపోయారు శివశంకరశాస్త్రి తమ స్నేహితులు ముద్దుకృష్ణను, పట్టాభిరామయ్యను చూడడానికని.

ఆ రోజులలో మా ఇంట్లో ఎంతోగా సాహిత్య వ్యాసంగం జరుగుతూ ఉండేది. వెంపటి నాగభూషణం, వెల్లటూర్ సోమనాధ్, ముద్దుకృష్ణ ఇత్యాదులు వచ్చి కూర్చుని జరుగుతూన్న సాహిత్య విషయాలను గురించి చర్చిస్తూ ఉండే వారు. అప్పుడే అనుకుంటూను నేను వెంపటి నాగభూషణానికి 'చుక్కలరాయడు'

అని పేరుపెట్టాను. కృష్ణాపత్రికలో వస్తూన్న అతని కథలలో అక్షరాలకంటే చుక్కలే ఎక్కువుండేవి అనే భ్రమకలిగించేటంతగా చుక్కలు వాడేవాడు నాగభూషణం, మాటమాటకి.

ఊళ్లోకి వచ్చిన సాహితీసమితి సభ్యులు మా ఇంటికి రాకుండా వెళ్లేవారుకారు. ముందుగా తెలిస్తే, నేనే స్టేషన్‌కి వెళ్ళి వారిని కలుసుకొని ఇంటికి తీసుకువచ్చేవాడను. ఒక్కొక్కప్పుడు తిన్నగా వారే మన ఇంటికి వచ్చేవారు. ఒక పర్యాయం రేపల్లెనుంచి నోరి నృసింహశాస్త్రి వచ్చారు నన్ను చూడడానికి. అంతకుముందు రెండు మూడేళ్ల క్రితము నేను వారి ఊరు వెళ్లి ఉన్నాను. ఇప్పుడు ఆయన నన్ను వెతుక్కుంటూ వచ్చారు నా కోసము. వారి 'సోమనాథ విజయం' నాకు చాలా నచ్చిన రచన. చిత్రం: ఈ నాటిక గురించి నాకు మొదట తెల్పినది హరీంద్రనాథ ఛటోపాధ్యాయ. "నీకు తెలుసా, తెలుగులో ఒక అద్భుతమైన ఏకాంకిక వెలసినదట ఇటీవలనే" అంటూ సోమనాథ విజయమును గురించి చెప్పారు హరీన్ 1926 లో అనుకుంటాను.

ఆ రాత్రి నోరి నృసింహశాస్త్రి మాఇంటనే ఉండిపోయారు. సాయంత్రం రైలుకు రేపల్లె వెళ్ళిపోవాలనుకున్నారు. కాని, మాటల ధోరణిలో రైలు ప్రయాణం సాగలేదు. మిక్కిలి శ్రోత్రియ పరులు నృసింహశాస్త్రి. ఆయన సంధ్య వార్చుకోడానికి కావలసినవి అమరుస్తూ పంచపాత్ర బదులు వెండి గ్లాసు ఉంచగలిగాను. కాని, ఉద్ధరిణికి బదులు టీ స్పూన్ ఇచ్చినందుకు చాలా కించపడ్డాను. ఎన్నడో జరిగిన ఉపనయనమప్పుడు మాతృస్వరూపిణి శ్రీమతి మునగాల రాణీవారు నాకు భిక్ష పెడుతూ వెండి పంచపాత్రా వెండి ఉద్ధరిణీ ఇచ్చారు. ఇప్పుడవి నా వద్ద ఉంటే ఎంత బాగుండును అనిపించింది.

మాటల సందర్భాన నా రచనల ప్రస్తావన వచ్చింది. కృష్ణాపత్రికలో ప్రచురించిన నా కథలన్నీ చదువ కలిగితే బాగుండును అన్నారు నృసింహశాస్త్రి. నేను వెంటనే లేచివెళ్ళి అలమారు తలుపుతీసి, ఎంతో జాగ్రత్తతో పదిలపరచిన

నా పుస్తకం తెచ్చి వారిచేతిలో ఉంచాను. పదివన్నెండేళ్లుగా, అప్పుడూ అప్పుడూ కృష్ణాపత్రికలో అచ్చయిన నా కథల 'కటింగ్స్' తీసి తెల్లకాగితంపైన పేజీ పేజీగా అంటించి, చక్కని పుస్తకంగా కుట్టి ఉంచాను నా ఫొటోతో సహా. 'ఏకాంత సేవ' లోని కొన్ని పద్యాలు పొందుపరచి ఉంచాను కూడా.

విడిచియు విడువని విరులెల్ల కోసి
తమ్మితూడుల నూలు దారాన గట్టి
మరపించి పోయిన మటుమాయలాని
పట్టి కట్టెదనని పరువెత్తుచుంటి !

అని వ్రాశాను పుస్తకానికి మకుటంగా. 'విడిచియు విడువని విరులూ', 'తమ్మి తూడుల నూలు' నా కెంతో నచ్చాయి.

సరే, ఈ పుస్తకం ఆయన చేతి కిచ్చి తీసుకువెళ్ళి తాపీగా చదువుకోండి అనేసరికి ఆయన "వద్దు! పొరపాటున ఎక్కడైనా పారవెయ్యగలను. ఎన్నాళ్ళ నుంచో పదిలపరచిన అమూల్యమైన కథలు ఇవ్వి. నేనే మళ్లా ఒక పర్యాయం ఇక్కడకు వచ్చి ఒక రోజంతా మీతో ఉండి కథలు చదివి వెళతాను" అన్నారు.

కాదూ కూడదు అని పట్టుబట్టి పుస్తకం వారి కిచ్చాను— "మీ విమర్శ నాకు విలువైనది. మీరు నా రచన చదివితే చాలా సంతోషిస్తాను" అంటూ. అప్పటికీ ఆయన ఒక పట్టానగాని పుస్తకం తీసుకోలేదు. "పారవేస్తానేమో పుస్తకాన్ని" అని మరీ మరీ సందేహించారాయన.

"పుస్తకం పారవెయ్యడమంటూ ఎందు కుంటుంది? అందులోనూ మీరు అందరిలా గాక, చాలా జాగ్రత్తగా ఉంటారని నాకు తెలుసు" అని ఒప్పించాను ఆయనను.

## సాగుతున్న యాత్ర

ఆ తరువాత ఒక పదిహేను రోజులకు నేను మేడమెట్లు ఎక్కుతూ ఉండగా వీధిలో నృసింహశాస్త్రి కనిపించారు నాకు. మన ఇంటివేపే వస్తున్నారు. నేను ఆగి, వారి వేపు చేయి ఊపాను. నన్నుచూచి చేయి ఊపలేదు సరికదా చటుక్కున తల వంచివేసుకున్నారు. ఇదేమిటని కాస్త ఆశ్చర్యపడుతూ క్రిందికి దిగివెళ్ళి గుమ్మం ముందు ఆయనను కలిసికొని మేడమీదికి తీసుకువచ్చాను. కూర్చోండి అని పడక కుర్చీ చూపించాను. ఆయన ఎంతో దిగాలుపడిఉన్న ట్టున్నారు.

కాళ్లు కడుక్కోడానికి నీళ్ళు ఇచ్చి, తుండుగుడ్డ ఇచ్చి, కాస్త పేద తీరాక, చల్లని పటికి బెల్లపు పానకం అందిచ్చాను. పానకం రుచి చూడకుండానే ఆయన ఎంతో దీనంగా నాకేసి చూస్తూ అన్నారు :

"పుస్తకం పారవేశాను" అని.

నా గుండె గతుక్కుమంది. అంత ఆప్యాయంతో పదిలపరిచి ఉంచిన నా కథల పుస్తకం పోవడం ఒక 'షాక్'లా తగిలింది. కాని, ఆ పెద్ద మనిషి పడుతూన్న బాధ చూచి సహింపలేక పోయాను. నా బెంగకంటే ఆయన బాధే ఎక్కువగా ఉంది. నేను నవ్వుతూ అన్నాను ; "ఈ మాత్రానికే అంత దిగులా! దొరుకుతుంది లెండి పుస్తకం ఎక్కడికి పోతుంది ? ఎవరో తెచ్చిస్తారు" అని నిజంగా లేని ఆశతో వారికి ధైర్యం చెప్పాను.

ఆయన "అల్లాకాదు! చాలా వెతికించాను. లాభంలేదు. ఆ మధ్య మా ఇంట శుభకార్యమైంది. మా వాళ్ళ అబ్బాయి, సాహిత్య ప్రియుడు ఒకతను వచ్చాడు. పుస్తకం చూచి వీరి కథలు నాకు ఇష్టము, చదువుతాను అని తీసు కున్నాడు. ఇంట్లో వాడుకదా అని నేను ఏమీ అనలేదు. ఆ ఉదయం అతను స్నానానికని కాలువకు వెళ్ళుతూ పుస్తకాన్ని కూడా చేత్తో పట్టుకు వెళ్లాడట. స్నానంచేస్తూ గట్టున తన బట్టలతో పెట్టిన పుస్తకం పోయింది—ఎలా పోయిందో!

తరువాత నేనూ వెళ్ళి వెతికాను. ఆ చుట్టుపట్ల పబల కాపరి కుర్రవాళ్ళ నంప రసూ ప్రశ్నించాను. రోజు రోజంతా వెతికాము ప్రతి పుట్ట, ప్రతి దుబ్బు. కాని, ప్రయోజనం లేకపోయింది" అని చెపుతూ, ఒక పెన్నిధిని పోగొట్టుకొన్నట్టుగా బాధపడ్డారు ఆయన.

ఇప్పటికీ నోరి నరసింహశాస్త్రి నాకు కనుపించినప్పుడల్లా ఆ ప్రస్తావన వస్తూనే ఉంటుంది. ఆ పుస్తకం అలా పోయినందుకు ఇప్పటికీ చింతిస్తూనే ఉంటారు ఆయన. జీవితంలో విలువైన వస్తువులు ఎన్నిపోతాయో! మనకు ఎంతో అప్యాయమైన వస్తువులు కొన్ని మనకు దక్కవు. కాని, కాదూ కూడదు అని ఒప్పించి నేను వారికిచ్చిన పుస్తకం అలా పోవడం చిత్రంగానే ఉన్నది. అదే అంటారు ఆయన, "నేను వద్దు అంటున్నా, నా చేతిలో ఉంచారు. అటువంటి విలువైన పుస్తకాన్ని పారవేశాను నాఅజాగ్రత్తవల్ల" అని.

ఇటీవల, మాటల సందర్భాన ఈ ప్రస్తావనే వచ్చి, స్నేహితుడు ముని మాణిక్యం నరసింహారావు పాపము ఆ కథలన్నీ తను స్వహస్తంతో కాపీచేసి పంపారు నాకు, పనిగట్టుకు కృష్ణాపత్రిక ఆఫీసుకువెళ్లి. ఆయనకు తెలుసు, తన పాత రచన అంటే ఎటువంటి రచయితకూ ఎంతటి ఆప్యాయత ఉంటుందో. ఆయన ఋణము తీర్చుకోలేను నేను.

మునిమాణిక్యం నరసింహారావును నాకు శ్రీ శివశంకరశాస్త్రి పరిచయం చేశారు. "మనిషి చూస్తే అలా ఉంటాడు గాని, భలే కులాసా మనిషి" అన్నారు ఆయన అతనిని గురించి నాతో.

ఆ రోజులలో అప్పుడే వెలువడిన మునిమాణిక్యం నరసింహారావు పుస్తకం నేను విమర్శించడము తటస్థించింది. 'ఉపాధ్యాయుడు' అనే పుస్తకం. మన తెలుగు భాషతో ఎంత పరిచయమున్నా మన కొలతబద్ద ఇంకా ఇంగ్లీష్ రచనలను బట్టే ఉంటుంది. ఆ కారణంగా నావిమర్శ కాస్త కటువుగా ఉన్న మాట వాస్తవమే.

పైగా, స్వతహాగా నాకు మనవారి హాస్యము అంతగా రుచించదు. అంటేహాస్యము ఎంతో ఉన్నతస్థాయిని ఉండాలని నా ఊహ. అంతేగాక, ఉపాధ్యాయుడు అనే రచనలో అప్పుడు నాకు గోచరించినది హాస్యముకంటే ఎక్కువగా, తక్కువ జీతముతో, నిరక్షరకుక్షులైన మొద్దుపిల్లలతో పడరానిపాట్లు పడుతూ, నానా ఇక్కట్టులకూ గురి అవుతూన్న బడిపంతులుదెస ఎంతో జాలి కలుగుతుందని.

కాని, బడిపంతులును గురించిన ఆ పుస్తకము హాస్యరచనగా వర్ణించి ఉండబట్టి, నా విమర్శలో నేను అన్నది: "పుస్తకము చదివినకొద్దీ పాపము ఆ బడిపంతులంటే మనకు పట్టరాని జాలి కలుగుతుంది గాని, ఆతనినిచూచి, ఆసన్ని వేశాలను చూచి నవ్వాలని ఉండదు. ఈ రచనలో ప్రధాన భావము అనుకంప గాని, హాస్యము కాదు" అని.

బందరువారు, మునిమాణిక్యం నరసింహారావు సమకాలికులు కొందరు ఈ విమర్శ చూడడముతోనే, కాస్త అల్లరి చేయసాగారు. వారి కులాసాకి నా మాటలు దోహద మిచ్చాయి. ఆ ఉదయం ఏ కాఫీ హోటల్‌లో నలుగురు రచయితలు కలసినా "హాస్యమా! అనుకంపమా!" అనే ప్రశ్న మారు మ్రోగినదట.

ఇది తెలిసి, తరువాత నేను కార్‌లో బందరువెళ్ళి మునిమాణిక్యం నరసింహారావును కలసికొన్నాను. నా విమర్శ గురించి బాధపడవద్దని కోరాను. ఆ పూట చాలా స్నేహాంగా గడిపాము మేము బందరు ట్రావెలర్స్ బంగాలో. అతడు తన పిల్లలను తీసుకువచ్చి చూపాడు, తన జీవిత గాథ అంతా చెప్పాడు నాకు.

ఆ తరువాత అతను రచించిన ఇంకో కథల పుస్తకం చూచాను. ఆ కథలలో 'నీలికొండలు' అనే కథ అనుకుంటా, నన్ను చాలా ఆకర్షించింది. నలుగు రైదుగురు స్నేహితులతో, ఆ రచనను ప్రశంసించి చెప్పడమేగాక, పత్రికా

ముఖాన విమర్శించాను కూడా. ఇది తెలియ వచ్చిన మునిమాణిక్యం గారు, నన్ను కలసికొనినపుడు అన్నారు :

"ఇప్పుడు తెలిసింది నాకు మీకు. ఎటువంటి విషయాలు నచ్చురాయో. జీవితం లోని కష్టాలను ఉన్నవి ఉన్నట్టు చూచి వర్ణించే రచనలు మీకు నచ్చవు. జీవితం లోని అందాన్నీ, ఆనందాన్నీ ఒకపాలు ఎక్కువచేసైనాసరే, మెరుగుగా చూపిస్తే మీ రిద్దే వివశులైపోరారు."

ఇది నిజమే. 'నీలికొండల' కథలో పరస్పరం ఎంతో ప్రేమతో ఉన్న భార్యాభర్తలు ఎంతో చనువుగా మాట్లాడుకుంటూ ఉంటారు. ఏదో ప్రస్తావన వచ్చి, ఆ అమ్మాయి లేతతమలపాకును చీల్చి, ఆ ఠొడిమను అతి సుతారంగా అతనిపైకి వీస్తుంది. ఈ వర్ణన నాకు ఎంతో వచ్చింది.

నిజానికి హాస్యము రుచించడమూ అంత సులభముకాదు. ఇతర రసాలను ఒప్పించినంత సులభంగా హాస్యరసము ఒప్పించలేడు ఎంతటి నిపుణతగల రచయితా. పైగా, కొందరికి నవ్వాలని ఉండదు, ఎక్కువగా నవ్వడము అసహజము అనిపిస్తుంది వారికి. ఇలాస్వతహాగా చాలా సీరియస్‌గా ఉండేవారిలో కొందరిని నేను ఎరుగుదును. ఆమాటకొస్తే నామిత్రులు చాలామంది అటువంటివారే. ఇందాక అనుకున్న నోరి నరసింహశాస్త్రి మరీను. స్నేహితులంతా జట్టుగా కలసి వీరినీ వారినీ తక్కువచేసి, ఏమో గమ్మత్తుకి వారిని గురించి కాస్త హేళనగా మాట్లాడితే, ఆయన ఆమాటలు వినిపించికోరు. ఆయనతీరు అంతే. పైగా, ఒకధోరణినికొంత చిత్తసంస్కారము కలవారు పేలవమైన విషయాల దెస తమ దృష్టినిపోనియ్యరు. నోరి నరశింహశాస్త్రి తన బృందములో వారి అందరికంటే కాస్త ఎక్కువగా ఆధ్యాత్మిక సాధనము అలవరచుకున్నారనిఅనుకుంటూ ఉంటానునేను, అటువంటి సాధన కొద్దో గొప్పో అలవరచుకున్నవారే, మనకు చిరపరిచితమైన భావాలనే ఇంత అందంగా, ఇంత ఉదాత్తంగా వర్ణించగలరు :

# సాగుతున్న యాత్ర

మురళి ముద్దిడు నీ మోవి ముకుపుచూచి
తమము తెర జీల్చి ప్రకృతి చైతన్యమూనె;
స్వరము వెలువడినంత గోపాలకృష్ణ,
పులకరించె బృందావన పుణ్యభూమి !

గోవులను వీడి యరుదెంచె గోపజనము;
కుడుచు లేగల విడివచ్చె గోగణంబు;
పరుగు పరుగున నీ పాదపదము జేర
ప్రియుని విడనాడి వచ్చె గోపీమనోజ్ఞ !

యమునలో జేరు వారిలేశము విధాన,
రాగమున నేకమైన స్వరమ్ము రీతి,
తన్మయత చెంది, కల సమస్తమ్ము విడిచి,
లీనమైపోతి నీ దివ్యగానసుధను !!!

తమము తెరజీల్చి ప్రకృతి చైతన్యము పూనడమూ, యమునలో జేరే వారి లేశమూ, రాగములో ఏకమయ్యే స్వరమూ చిరకాలము ఉండిపోతాయి మన మనస్సులో, మన హృదయంలో !

## ౧౭

కాలకంఠుని నాగసర్పము
కుబుస మూడ్చి పడగ బుస్సంది,
రెండు నాల్కలు
గండు మీసాలట్లు దూసింది
చెవులు మోసింది;
నాగసార మూదేది యెవరోయి,
రాగ మొలికించేది యెవరోయి ?
కారు నల్లని కాళరాత్రి !

కవికొండల వెంకటరావు

కాకినాడ కాలేజీ విద్యార్థులు వార్షికోత్సవ సందర్భంలో 'శివరాత్రి ప్రభ' రూపకంగా ప్రదర్శిస్తున్నారు — అద్భుతంగాఉంది. పులి చర్మం కట్టుకుని, ఒంటినిండా విభూతి పూసుకుని, అచ్చంగా పరమశివుని వేషంతో తయారైన నళినీకాంతరావు ఆ పాటలకూ, నేపథ్యంలో ఎంతో నిపుణతతో వినిపిస్తూన్న ఆ ధ్వనివిశేషాలకూ, అనుగుణంగా చక్కగా ఒప్పిస్తున్నాడు ప్రతి భావమూను. పాట వ్రాసిన కవి చూస్తే ఆశ్చర్యంతో తన్మయులై పోయేవారన్నమాట తన మాటలకు ఇంత గొప్పగా జీవంపోస్తూన్న ఈ దృశ్యమును చూచి :

నొసట గొసరిన మూడో కన్ను
నివురు లూదిన కొలిమి దెగడి

## సాగుతున్న యాత్ర

నెగడి ద్రిప్పింది,
పొగలు గప్పింది; . . .
కారు నల్లని కాళరాత్రి !!

అర్ధభాగపు మహాంకాళీ
కర్ధ మది కాలేదో
ఏమో ?

ఘునుకులా గలగలలు వింటూ
కునుకు గన్నాదో ?
నాధునీ వద్ద నదు నాట్యము,
నాధునీ కద్దనదు. . .
అరకే ఆడిపోతున్నాయ్ !
వాడిముమ్మొనవాలు,
హుతభుక్ ,
అజకపాలం,
ఢక్క— డుబడుక్
నాల్గు సేతుల నాడు లాతున్నాయ్ !
అశ్వగభ ! శరభ !!. . .

చంద్ర మకుటము,
జటా జూటము,
సాంద్రనీలపు జడలపాపట
సురిగిపోతున్నాయ్ !
చక్కనీ మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటియుండీ అంటకుంటున్నాదోయ్ !
...అహంకారము లేదు లోలో
మహార్ణటనము మొగము చాటదు,
మహాదేవా, యభయ మిడుమన
అభినయానకు హస్తమే లేదు !
రసభమున దన ముందు వెనుకల
ప్రభల గలిపించు !
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి,
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి,
కారు నల్లని కాళరాత్రి !

తాండవ నృత్యమును సాక్షాత్కరింపజేసిన ఆ ప్రదర్శన పూర్తియై, తెర వాలింది. కాని, నేను కొంతసేపటికి కాని తేరుకోలేక పోయాను — అంతటి వింత వాతావరణలోకి వెళ్ళిపోయింది, నా మనస్సు. విద్యార్థులు స్వయంకృషివల్ల

ఇంత చక్కగా చేయగలిగారని ఎంతో సంతోషించాను. వారు నా వారనే వింత ప్రేమతో నిండి వెల్లువైంది నా హృదయము.

ఈ బృందమువారే ముద్దుకృష్ణ రచించిన అనార్కలీ కూడా ప్రదర్శించారు ఆ రోజులలోనే. స్త్రీ పాత్రను స్త్రీలే ధరించాలని కచ్చితమైన అభిప్రాయం నాది. కాని, ఆ రాత్రి బి. ఏ. నరసింహారావు అనార్కలీగా ఒప్పించిన నటనా కౌశలాన్ని చూచి అతని విషయంలో మాత్రం, ఆ అభిప్రాయం మార్చుకోక తప్పినది కాదు. అనార్కలీ దురదృష్టగాథను అతను ప్రతి అక్షరమూ తన అనుభవంగా చేసుకుని నటించాడు; ముద్దుకృష్ణ మాటలూ ఎంతో హృద్యంగా అమరి ఒక్కొక్క భావమూ సూటిగా మన మనస్సుకు తగిలేది. అక్బర్ వేషము ఎవరు వేశారో కాని, అతనున్నూ చాలా బాగా వ్యక్తపరచాడు, తండ్రికీ, చక్రవర్తికీ కలిగిన చిత్త సంక్షోభను.

శ్రీ శివశంకరశాస్త్రి కొత్తగారచించిన 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' అనే పద్యనాటిక కూడా చాలా అందంగా ప్రదర్శించారు పిల్లలు. గీతగోవింద రచయిత జయదేవుని రసికావతంసుడైన చక్రవర్తి నిండు పేరోలగమున సత్కరించిన గాథ ఇది. జయదేవుని ప్రేయసి, భార్య, పద్మావతి మహిమవలననే అవతరించినది ఆ మహాకావ్యము గీతగోవిందము అని తెలిసి మహారాజు ఈ గౌరవాన్ని ఆమెనూ పంచుకోమంటాడు. నా కిప్పుడు ఆ మాటలన్నీ బాగా జ్ఞాపకంలేవుగాని, మహారాజు బహుమానంగాఇచ్చిన స్వర్ణకంకణాన్ని జయదేవుడు పద్మావతి కాలుకి తొడిగి, ఆమెను నృత్యము చేయమంటా డనుకొంటాను. ఏమైనా, శివశంకరశాస్త్రి పద్యనాటిక అందమైనది. ఆ నాటికను మరీ అందంగా ప్రదర్శించారు బి. ఏ. నరసింహారావు పద్మావతిగాను, అనంతం అనే నా ఆప్త మిత్రుడు జయదేవునిగాను.

కాలేజ్‌లో జరిగే ప్రతి విశేష సభకూ నన్ను ఆహ్వానించేవారు ప్రిన్సిపాల్ రామస్వామి. ఆ వార్షికోత్సవ సందర్భాలలోనే సంగీతపు పోటీలో ఇద్దరకు బహు

పూనాలు ఇచ్చారు ఆయన ఈమని శంకరశాస్త్రి అనే చిన్న కుమారునికీ బాలాంత్రపు రజనీకాంతరావు అనే యువకునకూ. వారికి బహుమతు లందజేస్తూ ప్రిన్సిపాల్ రామస్వామి అన్నారు: "ఇంత చిన్న వయస్సులో మీ రింతటి ప్రతిభ చూపడము మిక్కిలి ముదావహము. మీరు భావికాలమున అసమానమైన కీర్తి సంపన్నులవుతారని మా అందరి ఆశ" అని. గురుతుల్యులు రామస్వామి, వారి మాటలు అమోఘములైన వర్తిల్లినవి. వీణావాద్యమున ఈతరములో ఈమని శంకరశాస్త్రి తండ్రిపేరు నిలబెట్టడమే గాక అధునిక సంప్రదాయాలను అవగాహన చేసుకుని, ఎంతో ప్రతిభ ప్రకటించినవా డయ్యాడు. మన తెలుగు ప్రాంతాలలో 'రజని' పేరు ఇంటింటా వెలసినది. గానకళాకోవిదుడనీ, సుగమ సంగీత నిర్మాతనీ పిన్న వయసుననే పెద్ద పేరు సంపాదించుకున్నాడు 'రజని'.

బెంగుళూర్‌లో నేను గడిపిన ఏడేళ్లూ, కాకినాడలో ఆ రోజులలో తఫా, తఫాగా నేను గడిపిన మూడేళ్లూ నా జీవితంలో ఎన్నడూ మరువరానివి. ఎందరో స్నేహితు లయ్యారు నాకు ఆ మూడేళ్ళలో :-కవులు, జమీందారులు, సాధారణు లనబడే నావంటివారు,

కాకినాడలో నాకు బాగా జ్ఞాపకమున్నవి, ఉదయము పదిగంట లయేసరికి పూల దుకాణాలలో రాసులు రాసులుగా పేర్చే గులాబీపువ్వులు – వాటిచుట్టూ ఝుంకారముతో ప్రదక్షిణము చేసే తుమ్మెదల గుంపులు. కాడలు తీయకుండా కట్టలు కట్టలుగా అమ్మే లేత తమలపాకులు. సాయంత్ర మయ్యేసరికి సర్పవరం నుంచి వచ్చేవి గంపలతో మల్లెపూవులు. ఈమల్లెపూవులతోటలు చూడడానికి పని గట్టుకు ఒక ఉదయం వెళ్లాను. సర్పవరం చాలాబాగుంటుంది, ఆ అందమైన గుడీ. గుడిచుట్టూ మల్లెతోటలూ, ఎంతో ప్రశాంతముగా ఉంటవి, ఒక్కక్షణంలో మనస్సు మరేదో లోకంలోకి లాక్కుపోతుంది మనలను.

* * *

జగమెఱిగిన దుర్గాబాయి వీరవనిత, స్వాతంత్ర్య సమరయోధిని. కాని, ఆమెకు

సాహిత్యమూ చాలా ప్రియమనీ, ఆమెకూడా కథానికారచయితఅనీ ఏకొందరికోగాని తెలియదు—ఆమె నైజమునుబట్టి, తనరచనలకు ఆమె అంతటి ప్రచారమియ్యలేదు కాబట్టి. కాని, అప్తులైనవారు ఏ నలుగు రైదుగురో ఆమె రచించి, ప్రచురింపని, కథలు చదివి ఆనందించినది నే నెరుగుదును ఆ నలుగు రైదుగురలో నే నొక దను కాబట్టి. ఒకరోజు ఉదయము నేను వారిని చూడడానికి వెళ్ళగా, ఆవేళ వారి మేనకోడలు లీల పుట్టినరోజనీ, విందుకు నే నుండక తప్పదనీ అన్నారు. మరేదో అవసరమైన పని ఉన్నా ఆమె మాట తీసివెయ్యలేక, ఉండిపోయాను. ఏమి విందు ! ఊరంత పెద్ద అరటాకులో ముప్పై రెండు పిండివంటలు—మహారాష్ట్రి సంప్రదాయము కాబోలు, ఆకుచుట్టూ అందమైన ముగ్గులు. ఆ దృశ్యం చూస్తేనే కడుపు నిండిపోతుంది. ఇక వా రందరి ఆప్యాయమూనూ ! అది ఒక అనుభవము—అంతే !

భోజనాలయాక మేడమీదికి వెళ్లాము. తమలపాకులు వేసుకుని విశ్రమించి ఉండగా దుర్గాబాయి అన్నారు: "ఆవేళ గోదావరి ఒడ్డున నావలో నాకూ, కామేశ్వరికీ, విశ్వనాథానికీ మీకథ 'ఈ వియోగజలధి' చదివి వినిపించారు. చాలా బాగున్న దనుకున్నాము మేము. నేను మీఅంతబాగా వ్రాయలేనేమో కాని, నేనూ కొన్ని కథలు వ్రాశాను. ప్రచురించలేదు, ప్రచురించదలచుకో లేదు. చదువుతాను వింటారా?" అని ఒక్కొక్క కథే చదివారు. నాలుగు కథ లనుకుంటాను ఆనాడు నేను ఆసక్తితో విన్నాను. ఎంత ఉద్రేకము ! ఎంత సంస్కరణాభిలాష ! ! "ఇవి తప్పక అచ్చు వేయించాలి. ఏ పత్రికా సంపాదకుడైనా కళ్ళనద్దుకు ప్రచురిస్తాడు" అని, నేను అనగా, "స్వతహాగా వానిలోఉన్న విలువనుబట్టే వారు ప్రచురించాలి, నేను వ్రాసినవి అని కాదు. నా రచన ఇంకా పరిణతిని చెందాలి" అన్నారు దుర్గాబాయి. నా బసకు వస్తూ నేను అనుకున్నాను నా రచన అంతా నన్ను గురించే ఉంటుంది. నా అనుభవాలూ, నా ఊహలూ, నా కోరికలూ, నా ఆశా, నా నిరాశా ఇవే ఉంటాయి వివిధ రూపాలతో నా రచనలో. వారు అలా కాదు : సమకాలిక సంఘనిర్మాణములోని లోటుపాట్లను వ్యక్తపరుస్తూ అత్యవసరమైన సంస్కరణను

ప్రబోధిస్తూ చదువరుల దృష్టిని ఒక ప్రత్యేక సమస్య పైన కేంద్రీకరిస్తాయి – అటువంటి వారి రచనలు, అవే మనకు ఎక్కువ అవసరమేమో అని అను కున్నాము.

కాకినాడలో ఎక్కువగా ఇన్సూరెన్స్ కృషిచేయాలనే ఉద్దేశ్యంతో నేను మెయిన్ రోడ్‌లో ఒక చక్కని బంగళా తీసుకున్నాను. ఆ ఇంటికి 'మిథిల' అని పేరు పెట్టాను. ఆ రోజులలో గ్రామఫోన్ రికార్డులు ఎక్కువగా కాని, వినిన రికార్డే మళ్లా వింటూఉండేవాడను. కృష్ణశాస్త్రి రచన 'శిథిలాలయములో శివుడు లేడోయి' అనే పాట స్థానం నరసింహారావు పాడినది తరుచు వింటూండే వాడను. ఒకనాడు, నన్ను మా ఇంట చూడడానికి వచ్చారు కృష్ణశాస్త్రీ, అతని మేనల్లుడు శివరామమూ. ఆ నిమిషానికి నేను 'శిథిలాలయములో శివుడు లేడోయి' అని గట్టిగా అనుకుంటున్నాను, రికార్డ్‌లోని పాటను అనుకరిస్తూ. గుమ్మంలో అడుగు పెటుతూ, శివరామమే అన్నాడో, కృష్ణశాస్త్రే అన్నాడో చమ త్కారానికి:

శిథిలాలయములో శివుడు లేడోయి,

మిథిలాలయములో సీత లేదోయి ! !

అని.

వారితోపాటు నేనూ నవ్వాను. కాని, ఆ మాటలు అలాగే ఉండిపోయాయి నా మనస్సులో. కాకినాడలో నేనున్న ఏడాది రెండేళ్ళా, మరీ మరీ జ్ఞాపకం వస్తూనే ఉండేది నా మిథిలలో సీత లేదనే మాట.

అవి కృష్ణశాస్త్రి బదరిక వ్రాస్తూన్న రోజులు అనుకుంటాను. అతని రచన లలోకల్లా అతి ఉత్తమస్థాయికి చెందినది బదరిక. ఒకొక్కపద్యమూ తన అంద మైన చిన్న పుస్తకంలో సన్నని పెన్సిల్‌తో, అతి సన్నని అక్షరాలతో చెక్కుటూ

ఉండేవాడు, ప్రతి ఉదయమూ నేను నా ఇన్సూరెన్స్ పని మీద బయలుదేరుతూ మొదట కృష్ణశాస్త్రి వద్దకు వెళ్లేవాడను. అతను అప్పటికే స్నానంచేసి ఉండి తెల్లని చొక్కా తొడుక్కొని తల దువ్వుకు సిద్ధంగా ఉండేవాడు. అలా అతనిని నా కార్‌లో ఏ పిఠాపురము పైపో, ఏ సర్పవరము పైపో, ఏ సముద్రపు ఒడ్డుకో తీసుకొని వెళ్లేవాడను. అక్కడ అతి ప్రశాంతమైన ప్రదేశంలో కార్ ఆపగా, రాత్రి తను వ్రాసి ఉంచిన క్రొత్త పద్యమో, పద్యాలో చదివి వినిపించేవాడు. ఆ పద్యం చదువుతూన్నప్పుడు అతని కళ్లు వింతగా మెరిసిపోయేవి—ఉత్సాహంతో, ఉద్రేకంతో, భావవిస్ఫురణా ఉత్సుకతతో. కవి తన క్రొత్తరచనను సహృదయునితో పంచుకోవడము ఒక విచిత్రమైన అనుభవము—వినేవారికీ, వినిపించేవారికీ కూడా. వినేవారు మాత్రము, తాము ఆ నిమిషం కేవలమూ నిమిత్తమాత్రులము అనే మాట మరువరాదు. అతడు నన్ను ఎదుట ఉంచుకునే చదువుతున్నాడు, అతని కన్నులు నా కళ్ళలోకే సూటిగా చూస్తున్నాయి. కాని, అతనికి కనపడేది నేను కాదు; విశ్వప్రపంచము. ఆ విశ్వప్రపంచమునకు అందజేస్తున్నాడు కవి, తన సందేశాన్ని. మొట్టమొదటగా విని ఆనందించడానికి మనము పెట్టి పుట్టాలి.

ఆ రోజులలో కృష్ణశాస్త్రి రచనలో నన్ను ఎక్కువగా ఆకర్షించినది అతని సౌందర్య పిపాస. రవీంద్రుడు, ఇక్బాల్, సాదీ. ముగ్గురూ కలసిన వ్యక్తి అతను. అందుచేత, మాటి మాటికీ అతని ఊహలు సౌందర్యానుభూతి కోసము పడే ఆరాటాన్నో, క్షణిక సాక్షాత్కారమైనా, శాశ్వతంగా ఉండిపోయిన సౌందర్య దర్శనాన్నో వర్ణిస్తూ ఉండేవి. ఇటువంటి ఊహలను చక్కని మాటలలో పెట్టడానికి తగిన అద్భుతమైన పదజాలము అతని సొమ్ము. ఆనాటి మనవారిపై నాకున్న పెద్ద కోపకారణము వారు తమ చుట్టూఉన్న అపారమైన సౌందర్యముదెస కేవలము గ్రుడ్డివారై ప్రవర్తించడమే. నాలో అహంభావము కావచ్చు. కానీ, వీరు చిలిపి విషయాలలో మునిగిపోయి, ఎంతో విలువైన అనుభవాలను ఒదులుకుంటున్నారని

బాధపడేవాడను నేను. ఈనా భావాలను కృష్ణశాస్త్రి ప్రతి కొత్త పద్యమూ ఎంతో గంభీరంగా, ఎంతో అందమైన మాటలతో పొందుపరచేది. నా ఆత్మ అతని వాక్కుగా నాకు వినిపించేది అని ఎంతో ఆనందించేవాడను నేను. ఒకనాటి ఉదయము ఇల్లాగే ఇద్దరమూ నా కార్‌లో సర్వవరపు కేసి కాబోలు వెళుతూండగా, అతను ఉన్నట్టుండి తన అందమైన కంఠస్వరంతో ఎంతో శ్రావ్యంగా పద్యము చదివాడు. అది పద్యము చదివినట్లు చదువలేదు. అతి విలాసవంతమైన చిరునవ్వుతో శ్రీకృష్ణుడే, తన ముద్దుమరది అర్జునినితో చెపుతూన్న ఉపదేశంలా తోచింది నాకు. నా మనస్సును ఎంత చక్కగా గ్రహింపకలిగాడు ఇతడు అనుకున్నాను. నా ఇన్నేళ్ళ ఆరాటాన్ని నా ఇన్నేళ్ళ తీరని అన్వేషణను రెండు మాటలలో చెప్పివేయ కలుగుతున్నాడు సుమా ఇతను అనే అబ్బురపాటుతో, చటుక్కున కార్ ఆపి, ఆ పద్యాన్నే మళ్లా మళ్లా చదివించాను అతనిచేత. నా విజిటింగ్ కార్డ్ తీసి, కలం అతని చేతికిచ్చి వ్రాసిపెట్టమన్నాను. ముత్యాలకోవ వంటి అక్షరాలతో కృష్ణశాస్త్రి వ్రాసిఇచ్చాడు తన కొత్తపద్యాన్ని నాకు కానుకగా. ఆ విజిటింగ్ కార్డ్ అల్లానే నా కార్ డాష్ బోర్డ్‌పైన, దీపానికి దగ్గరగా తాపి ఉంచాను—రాత్రింబవళ్లు చదువుకోడానికి.

**ఏ మృగతృష్ణనో వలచి యేడ్చెదు నీ దురదృష్ట జీవిత**
**ప్రేమమునీ యెడంద కొసరెక్కల కేనియు నందరాని స్వ**
**ర్గామృత నందన ప్రసవమయ్యె! వెదకాడదే**
**లా మిహికామృషా పథము నందని రందరు నవ్వులాడుచున్!**

వ్యక్తిగతానుభవానికి విశ్వజనీనత కలిగిస్తుంది ఉత్తమ కవిత్వము అనే సిద్ధాంతానికి ఇంతకంటే గొప్ప ఉదాహరణ ఉంటుందా!

## ౧౩

అవి ధరాగర్భమున
మానవాస్థికా పరంపరలు!
సుప్తనిశ్శబ్ద సంపుటములు,
అటనొకే దీర్ఘయామిని !
ఆ నిశాశ్మశాన శయ్యకు
ప్రాతః ప్రసక్తిలేదు;
ఆ అగమ్యతమో రహస్యాంగణాన
తాండవించును మృత్యుశైత్య మొకటి !
అవి నితాంత హేమంత హృదంతరంత రనుభవాళి
ఘనీభవించిన సమాధులు !...
అవి చలించును
తమ చర్మకవచమెప్పుడో
బ్రతికిన దినాల తలపోత బరువుచేత !
నా కనుంగవ కన్నీళ్లై కరంగు
అవి ఒనర్చెడు నీరవాహ్వాన మెరిగి !
ఇంత శోషిల్లు నేడో నా హృదయపుటము,
వణకు నేటికో నా అస్థిపంజరమ్ము !!

ఈ పద్యము ఎవరు వ్రాశారు ?

# సాగుతున్న యాత్ర

పులిచంపిన లేడి నెత్తురూ, సల సల కాగే చమురూ, నరకలోకపు జాగిలాలూ, కుక్కపిల్లా — అగ్గిపుల్లా — సబ్బుబిళ్లా, అగ్ని సరస్సున వికసించిన వజ్రాలు, బ్రహ్మజెముడు డొంకలు, — ఇటువంటి వాటికి అలవాటుపడిన కవితాప్రియులు అస్థికలతో ప్రారంభింపకపోతే, ఈ రచన శ్రీశ్రీ రచన అంటే నమ్మరేమో, ఒకవేళ.

దీర్ఘయామిని, అగమ్యతమోరహస్యాంగణము, నితాంత హేమంత హృదంతరంతరనుభవాళి, నీరవాహ్వానము, హృదయపుటము—ఇవన్నీ కృష్ణశాస్త్రి రూప కల్పనను స్ఫురిస్తాయి. ఈ పద్యంలోనే.

ఆమనుష్యాస్థికలు నిద్రలోమునింగి
సంచరించును భైరవ స్వప్నవీథి,
అవి చలించును, తమ చర్మ కవచ మెప్పుడో,
బ్రతికినదినాల తలపోత బరువుచేత!

అని ఉన్నది 'చర్మ కవచం' శ్రీశ్రీదైనా, 'తలపోతబరువు' మాత్రం కృష్ణశాస్త్రి మాటలా లేదూ?

నిజానికి ఈ పద్యం యుగసంధిలో అవతరించిన రచన. ఆధునిక కవితా చరిత్రలో కృష్ణశాస్త్రి యుగమూ శ్రీశ్రీ యుగమూ అని గుర్తిన్నారు కొందరు విమర్శకులు. ఈ రెండు యుగాల సంధి సమయంలోనే శ్రీశ్రీ రచించింది ఈ పద్యం.

ఆ రోజులలోనే, వాల్తేరు రహదారి బంగళాలో ఒక మూడు గంటలసేపు చర్చించాము శ్రీశ్రీ నేనూ, శ్రీశ్రీ కవిత్వం గురించి. ఇన్సూరెన్స్ పనిమీద విశాఖపట్నం వచ్చి ఆ బంగళాలో ఉంటున్న నన్ను చూడడానికివచ్చారు, శ్రీశ్రీ.

అంతకు కొంచెంముందే అనుకుంటాను. ఈగలలో వేగలేక మూలుగుతూన్న ముసల్దాన్ని గురించి గేయం వ్రాశారు శ్రీశ్రీ.

నేను శ్రీశ్రీని అడిగాను : 'మీరు పూర్వకవిత్వ ధోరణిని చక్కని వృత్తాలూ వ్రాస్తారు కదా! ఏదీ, మీరురచించిన ఒక వృత్తం చదవండి, మీకునచ్చినది" అని. అప్పుడాయన, వసుచరిత్రలోని కవిత్వాన్నీ, మనుచరిత్రలోని కవిత్వాన్నీ కూడా అధిగమించి వెళ్ళగలిగిన ఒక వృత్తం చదివారు. మాటలు నా కిప్పుడు జ్ఞాపకంలేవు కానీ, భావంలోనూ, శైలిలోనూ చాలా అందంగా కనుపించింది ఆ ఊహా, ఆ రచనా.

అప్పుడన్నాను నేను, శ్రీశ్రీతో: "చూచారా, మరి! అంత అందంగా కవిత్వం చెప్పగల మీరు 'తనకన్నా శవం నయం' అంటూ, 'ఎముకముక్క కొరుక్కుంటూ ఏమీ అనలేదు కుక్క' అంటూ ఇంత అందవికారంగానూ, ఇంతటి జుగుప్సతోనూ వ్రాస్తున్నారే, ఇదేమి న్యాయము?" అని.

శ్రీశ్రీ అన్నారు : "ఆ వృత్తాలు ఎప్పుడో వ్రాసినవి, అవి ఒకానొక బానిసత్వపు చిహ్నము, ఒకానొక కృత్రిమపు ఊహాలోకములోనివి అవి, పట్టికల అది — ప్రత్యక్ష జగత్తు, ఇది. ఇది నిజము, అది అబద్ధము!" అని.

కవిత్వమంటే అందమైన ఊహ, అందమైన భావస్ఫురణ, అందమైన పదజాలం, అంటూ నా అభిప్రాయాలను వివరించాను. ఇంగ్లీష్ కవిత్వ సంప్రదాయాలను ఏకరువు పెట్టాను శ్రీశ్రీ ముందు. ఆయన చాలా ఓపికతో విన్నారు.

కాని, తన వాదనను సహేతుకంగా బలపరుప ప్రయత్నించారు. అందవికారమైన వస్తువుకు కూడా వర్ణించే విధంలో అందము సమకూర్చ వచ్చును

అన్నారు శ్రీశ్రీ. అంఎవికారమైన వస్తువులకు ఆమడ దూరాన ఉంటాలి కవి అన్నాను నేను.

నా వాదన ఎంత సబబైనదని నాకు తోచినా శ్రీశ్రీని నా మార్గానికి మార్చలేక పోయాను. ఇప్పుడనుకుంటాను, నేను ఇంకాస్త బలంగా వాదించి ఉంటే, ఆయనను నా మతం వైపు మరల్చుకొని ఉంటే, ఏమైఉండేదో అని. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను....నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను'అనే అందమైనఆశయమూ, 'నేనుసైతంవిశ్వ వీణకు తంత్రినై మూర్ఛనలుపోతాను' అనే అద్భుతమైన ఊహా, మనకవిత్వాన్ని ఆవేశించి, ఆదేశించి ఉండకపోయేవియేమో! 'జగన్నాధుని రథచక్రాలు' కదలి ఉండవేమో, మన నవకవిత్వంలో! 'ఉత్తరమందూ, దక్షిణమందూ, ఉదయము నందూ, ప్రదోషమందూ, వెన్నెలలోనూ, చీకటిలోనూ, గంటలు' మ్రోగి ఉండ వేమో మన నవ్యసాహిత్యంలో, ఏమో!

శ్రీశ్రీని నేను మొదట కలుసుకొనినది మద్రాసులో అన్నగారు మల్లంపల్లి సోమశేఖరశర్మ ఇంట్లో. వారింట్లో దాబామైన ఎవరితోనో ఎంతో ఆవేశంతో మాట్లాడుతూన్న శ్రీశ్రీని చూపుతూ అన్నగారిని నేను ప్రశ్నించాను, "ఆయన ఎవర"ని. సోమశేఖర శర్మ అన్నారు: "అతన్నెరుగరా? శ్రీశ్రీ" అని. "ఆలాగా! అతని కవిత్వం నాకు అంతగానచ్చదు. ఆరిపోయిన కుంపటీ కుక్కలు కొరుకుతూన్న ఎమ్ముకలూ ఇవా కవితా వస్తువులు? రక్తపుసరస్సు—ఎంత భయాన కము!" అన్నాను నేను.

అన్నగారన్నారు: "మీరు పొరబడుతున్నారు. అతని రచనలో సత్యాన్వేషణ ఉన్నది, ఉద్వేగమున్నది, అపరిమితమైన విప్లవశక్తులున్నాయి. తర తరాలుగా ప్రబంధపు సంకెళ్ళతో, అదీ నికృష్టపు ప్రబంధశైలి సంకెళ్ళతో, బంధింపబడిన మన కవిత్వానికి స్వేచ్ఛనిచ్చి, అద్భుతమైన నవజీవనము కలిగిస్తుంది శ్రీ శ్రీ రచన. అతను నవకవితా మార్గదర్శకుడవుతాడు!" అని.

## సాగుతున్న యాత్ర

సోమశేఖరశర్మమాట నాటు శిలాక్షరమైనా, ఆ నిమిషమున నేను ఊహించుకోలేకపోయాను శ్రీ శ్రీ కవితలో ఎంతటి వింత ప్రభావమున్నదో!

శ్రీశ్రీని కాబోయే మహాకవిగా గుర్తించాడు మరొకతను, నాఆప్తమిత్రుడు, అప్పుడే, 'ఉదయిని' స్థాపకుడూ, సంపాదకుడూ అయిన కొంపెల్ల జనార్దనరావు. "అతని ద్వారా ఎంతో కొత్త ఉత్తేజము కలుగుతుంది మన కవనానికి. విపరీతమైన భావ స్ఫురణ ఉన్నది అతని రచనలో. నేటి సాహిత్యపు విలువలు వింతగా మారిపోతాయి అతను తీసుకు వస్తూన్న విప్లవంద్వారా" అన్నాడు జనార్దనరావు, ఇది ఋషి వాక్యంగా ఫలించింది.

నిజంగా, బాలఋషివంటి వాడు జనార్దనరావు. అతనిని మొట్టమొదటిసారి చూచినప్పుడే అనుకున్నాను అతను ఈ లోకపువాడు కాడని. ఎంతటి సౌమ్యము అతనిలో! ఎంతటి వర్చస్సు ఆతని కన్నులలో! ఎంతప్రేమమయము ఆతని చిరునవ్వు!!!

ఉదయిని ఉత్తమశ్రేణికి చెందిన పత్రిక. మొదటి సంచికను చూచీ చూడడంతోనే ముగ్ధుడనైపోయాను. పాశ్చాత్య సంచికలలో మరీ గొప్పదనిపేరు పొందిన 'లండన్ మెర్క్యురీ'లా కనిపించింది నాకు ఉదయిని. ఎన్నాళ్ళనుంచో అనుకున్నాను నేను ఇటువంటి పత్రికే నెలకొల్పాలని. వెంటనే జనార్ధనరావుతో అన్నాను : "ఉదయిని నాది! శాయశక్తులా తోడ్పడతాను పత్రిక అభివృద్ధికి" అని. పత్రిక్క నాల్గవ సంచిక నుంచి కాబోలు, నాపేరు సహాయ సంపాదకునిగా ప్రకటించారు. ఈ గౌరవము మహా ఘనతగా భావిస్తున్నా ఇప్పటికీని.

జనార్దనరావూ నేనూ కలసి చాలా చోట్లకు వెళ్లాము ఉదయిని విషయమై కృషిచేస్తూ. అప్పుడు బెజవాడలో నాకు ఆప్తమిత్రుడు శీలంశెట్టి గోవర్ధనరావు. మేమిద్దరమూ రోజుకు రెండు మూడు పర్యాయాలైనా కలుసుకొనకపోతే అన్నం సహించేది కాదు నాకుగాని, అతనికిగాని! అంత స్నేహం మా ఇద్దరికీ. గోవర్ధన

రావును గురించి ఎంతైనా చెప్పవచ్చును. స్నేహశీలి. దానంలో కర్ణునివంటివాడు. పురుషోత్తముడు. అతనికీ ఉదయిని నచ్చింది. తన కారిచ్చి పంపాడు జనార్దన రావునీ, నన్నూ, శ్రీ ముక్త్యాలరాజావారిని దర్శించి వారి విరాళం అర్థించడానికి.

జగ్గయ్యపేటజేరి, తిన్నగా గురుభాగవతుల వెంకట సుబ్బారావువారి వద్దకు వెళ్లాము. ఆయన అప్పుడు సబ్ రిజిస్ట్రార్‌గా ఉన్నారు. మమ్మల్ని చూడడంతోనే ఆయన ఆరోజుకు ఆఫీస్‌పని మానివేసి మమ్మల్ని తన ఇంటికి తీసుకువెళ్లారు. ఆ రాత్రి తెల్లవార్లూ, సాహిత్యగోష్ఠి ! గు. వెం. సు. సాహిత్యప్రియుడు, మంచి విమర్శకుడు. ఉదయినికి ఎంతైనా సహాయం చేస్తానన్నారు, ఆయన.

తెల్లవారాక, అక్కడకు మూడు క్రోసుల లోపున ఉన్న చిరుమామిళ్ళ శివరామకృష్ణ ప్రసాద్ వారి ఊరు వెళ్ళాము. ప్రసాద్ తెలికిచర్ల వెంకటరత్నం శిష్యులు. వెంకటరత్నం శిష్యునికి ఉండవలసిన సాహిత్య ఆసక్తి, విమర్శనా పటిమ విపరీతంగా ఉన్నాయి, వారిలో. మనిషి రూపసి, సౌజన్యశీలుడు. ఆయనతో ఉన్నంతసేపూ నేను, నా మనస్సులో ఊహించుకున్న, పురూరవుని సమక్షాన ఉన్నట్టు అనిపించింది నాకు.

శివరామకృష్ణ ప్రసాద్ శ్రీ ముక్త్యాల రాజావారి మేనల్లుళ్ళు. మాతో కూడా, ఆయనా ముక్త్యాల వచ్చారు. రాచ మర్యాదలనుబట్టి సాధారణంగా అంత సులంభంగా లభించని రాజదర్శనం ప్రసాద్ స్నేహంవల్ల మాకు వెంటనే లభించడమే గాక, శ్రీ చంద్రమౌళీశ్వర ప్రభువు మమ్మలి ఎంతగానో ఆదరించారు. వారికీ నాన్న గారికీ చాలా స్నేహము. అందువల్ల కూడా, వారిని దర్శించడం మాకు అత్యంత ప్రియకరమైనది. రాజావారు ఉదయినిని గ్రహించి చాలా ప్రశంశిస్తూ, తమకు తోచిన సహాయము చేయగలమని సెలవిచ్చారు.

ఆ తరువాత కొన్నాళ్ళకు జనార్దనరావూ నేనూ, రాజమహేంద్రవరమునకు సమీపాన ఉన్న కడియము వెళ్ళాము. కడియము అద్భుతమైన గులాబీ పువ్వ

లకు ప్రసిద్ధి. రకరకాల గులాబీ పువ్వులు — అరచెయ్యంత ఉంటుంది ఒక్కొక్క పువ్వు. ఎంతో సువాసన. రెండు దోసిళ్ళ పువ్వులు తీసుకొని, ఆ పువ్వుల మధ్య ఉదయినిని ఉంచి, పూజ్యులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రికి సమర్పించాము జనార్ధనరావూ, నేనూ. ఆ సన్నివేశము ఇప్పటికీ కన్నులకు కట్టినట్లు ఉంటుంది.

పూలతో సమర్పించిన పుస్తకాన్ని అందుకుంటూ ఆయన ఒక చక్కని శ్లోకం చెప్పారు. భావగర్భితమైన శ్లోకము. "భేష్! చక్కని కృషి చేస్తున్నారు, మిమ్ములను మనస్సార ఆశీర్వదిస్తున్నాను" అన్నారు. ఉదయినిలోని ఒక గేయాన్నిచూచి గేయకవిత మనకు క్రొత్తకాదు, ఇదివరకూ ఉండేది అంటూ ప్రాచీన గేయ కవితను గూర్చి ఎంతో చక్కగా చెప్పారు. ఒక ప్రస్తావనలోంచి ఇంకో ప్రస్తావనకు వచ్చి ఎంతోసేపు ఏకధాటిగా మాట్లాడారు మాతో శత వృద్ధులు, ఆయన. ఆ రోజులలో వారు కృష్ణా పత్రికలో "నా కాశీయాత్ర" అనే శీర్షికను తమ అనుభవాలు వ్రాస్తున్నారు, ముద్దులొలికే శిష్టవ్యవహార భాషలో. ఇన్నేళ్లూ ప్రబంధధోరణినే ఒకప్పుడు నారికేళపాకంగానూ, ఒకప్పుడు ద్రాక్షా పాకంగానూ కవిత్వం చెబుతూ వచ్చిన ఆయన ఈనాడు ఆబాలగోపాలమునకూ అతి సులువుగా అర్థమయ్యే వాడుక భాషలో వ్రాస్తున్న ఈ వ్యాసాలు నన్ను ఎంతో ఆకర్షించాయి. మా ఉదయినికిన్నీ అటువంటి వ్యాసాలే వ్రాసి ప్రసాదించమని అర్థించాను వారిని.

సమకాలికసాహిత్య రీతులను గురించిన్నీ ఎంతో చెప్పారు ఆయన. వారితో మాట్లాడుతూంటే, అంటే, వారి మాటలు వింటూంటే, ఒక్క నిమిషంలా గడిచిపోయింది రెండు గంటలసేపు. ఒక్క ప్రస్తావనా? ఒక్క విషయమా? ఎన్ని కబుర్లు! ఎన్నెన్ని పూర్వస్మృతులు! ఎంత నిశితమైన విమర్శ! ఎంతటి అపార జ్ఞాన సముద్రము! ఎటువంటి వాగ్ధోరణి — వారికి వారే సాటి!! ఇంకా ఎక్కువసేపుఉంటే, వారిని ఆయాసపెట్టిన వారమవుతామని, కొంత అయిష్టంగానే, వారి వద్ద సెలవు తీసుకున్నాము. ఒక దేవాలయమునుంచి ఇవతలకు వచ్చిన

భక్తులులాగ వచ్చిపేశాము. జనార్దనరావూ, నేనూ, భక్తిపూరితమైన హృదయాలతో.

జనార్దనరావుతోటి నా స్నేహము జన్మచరితార్థం జేసేటటువంటి స్నేహము. మా దేహాలు వేరైనా, మా ఆత్మలు ఒకటే నన్నంత, సన్నిహితంగా ఉండేది మా స్నేహం. మరి, ఇంత అందమైన ఆపేక్షను విధి సహిస్తుందా? ఎలా వచ్చి దాపరించిందో అతనికి భయంకరమైన వ్యాధి వచ్చింది. ఆ జబ్బులోనే మన ఇంటికి వచ్చాడు ఒకరోజు, నా స్నేహితుడు. పదిహేను, ఇరవై రోజులు వైద్యం చేయించాము నిపుణులచేతనే. అప్పటికి ఆ జబ్బు ఉపశమించినా పరీక్ష చేసిన వైద్యులు అన్నారు అతనిలో జీర్ణమైపోయిన క్షయవ్యాధి ఉన్నదనీ, ఆ వ్యాధికి తగిన చికిత్స చేయాలనీ. మమ్మల్ని శ్రమపెట్టడం ఇష్టంలేక అతను తన సహోదరి చావలి బంగారమ్మ వద్దకు వెళ్లాడు, కొణితివాడ.

కొణితవాడలోనే నేను కొంపెల్ల జనార్దనరావును ఆఖరిపర్యాయం కలిసికొంట. మనుష్యమాత్రులు చేయవగిన వైద్యమంతా చేయిస్తున్నారు వారు. జబ్బు నయమౌతుందని అతనికీ ధైర్యంగానే ఉన్నది. నాకు బాగా జ్ఞాపకం: రాత్రివేళ అక్కడకు జేరిన నాకు ఉదయానే పళ్లు తోముకొనటానికి కచిక పనికిరాదని, ఆరుమైళ్ళ దూరానఉన్న భీమవరం పంపిస్తున్నాడు మేనల్లుణ్ణి సైకిల్‌పైన టూత్ పేస్ట్‌కోసం!

అతనూ విశ్వసిస్తున్నాడు ఈ జబ్బు నిమ్మళిస్తుందనీ, తన ఉదయిని మళ్లా తల యెత్తుతుందనీ. అంత జబ్బులో ఉన్నా అతని ప్రసక్తి అంతా ఉదయినిని గురించీ నన్ను గురించీ. నన్ను అతను ముఖాముఖిని 'మీరు' అనినా, ఉత్తరాలలో 'నీ్మరు' అనేవాడు. ఆప్యాయింవల్ల 'నీవు' అనాలని ఉన్నదనిన్నీ, ఆచారాన్ని అనుసరించి, 'మీరు' అనాలి కాబట్టి, ఈ రెండింటికీ రాజీగా 'నీ్మరు' అని వాడేవాడు. ఈసారి, చిరునవ్వునవ్వుతూ 'నీ్మరు' అని, నన్ను సంబోధిస్తూ నాకుటుంబ విషయాలు అడిగాడు. అప్పుడే నా జీవితాకాశంలో కారుమేఘాలు కమ్ముకు

వస్తున్నాయి. ఈ విపత్తు గురించి అతనికీ చూచాయిగా తెలిసింది. కాని, నన్ను వివరంగా ప్రశ్నించలేదు. నా వలన ఆ స్థితిలో అతనికి బాధ కలిగించడం ఇష్టము లేక నేనూ అంత వివరంగా చెప్పలేదు. కాని, సూక్ష్మబుద్ధి, అతనుగ్రహించాడు.

"ధైర్యంగా ఉండాలి. ప్రతిదీ ఏదో నిమిత్తం వల్లనే జరుగుతుంది. ఇది మీకు పరీక్షాసమయం!" అన్నాడు జనార్దనరావు.

ఆ పరీక్షలో నేను ఓడిపోయాను.

కొద్దిరోజులలో నా స్నేహితుడూ పోయాడు.

అమ్ముడుపోని, అతివిలువగల, ఉదయిని కాపీలు ఇన్ని మిగిలాయి.

శ్రీశ్రీ కవితలో మార్దవం తక్కువంటారు. అతను చాలా వరకు 'సినిక్' అనీ, అంటే మనమందరమూ అప్యాయంతో నమ్మే విషయాలలో అతనికి నమ్మకం లేదనీ, చిరకాలానుభవంవల్ల, నేటి జీవితపుపట్ల ఆతనికి అసహ్యం కలిగిందనీ, విమర్శకులంటారు. కాని, తన మహాప్రస్థానానికి అంకితంగా శ్రీశ్రీ రచించిన 'కొంపెల్ల జనార్ధనరావుకోసం' అనే విలాసం చదువుతూఉంటే నాకేకాదు, ఎటు వంటి ధీరస్వభావులకైనాసరే, కన్నులు చెమ్మగిల్లకమానవు. అంతటి ఆర్ద్రిత ఉన్నది, ఆతని మాటలలో. శ్రీశ్రీ అంతవాడు, జనార్దనరావును ఎంతగా పూజించే వాడో, పూజిస్తున్నాడో, ఈ పంక్తులు చెపుతాయి :

లేదు, నేస్తం! లేదు...

నీ ప్రభావం మమ్మల్ని వదలలేదు!

నిరుత్సాహాన్ని జయించడం

నీ వల్లనే నేర్చుకుంటున్నాము!

సాగుతున్న యాత్ర

ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు,
భయంలేదులే అయినప్పటికీ !
నీ సాహసం ఒక ఉదాహరణ !
నీ జీవితమే ఒరవడి !
నిన్న వదలిన పోరాటం
నేడు అందుకోనక తప్పదు !
కావున ఈ నిరాశామయ లోకంలో
కదనశంఖం పూరిస్తున్నాను !
ఇక్కడ నిలబడి నిన్ను
ఇవాళ ఆహ్వానం చేస్తున్నాను !
అందుకో ఈ ... విన హస్తం !
ఆవేశించు నాలో !
ఇలా చూడు నీకోసం
ఇదే నా మహాప్రస్థానం !

ఎటువంటి అంకితము !!

ఆ మధ్య ఒకరోజున అబ్బాయి సత్యవోలు కామేశ్వరరావు—అతనిప్పుడు ఉత్కళ దేశంలో ఫైనాన్స్ డిప్టీ సెక్రటరీగా ఉంటున్నాడు—బ్రౌన్ పేపర్ అట్టతో కుట్టిన చిన్నపుస్తకం నా చేతిలో ఉంచాడు "ఇదుగో ! మీకొరకరాయిలం తెచ్చాను" అంటూ, చిరునవ్వు నవ్వుతూ.

సాగుతున్న యాత్ర

ఏమిటా ఈ తాయిలం అనే ఉత్సుకతతో, కవర్ త్రిప్పగానే కనుపించినవి సువర్ణాక్షరాలు, మా జనార్ధనరావు స్వహస్తంతో లిఖించినవి :

కొమర్రాజు వినాయకరావునకు, ప్రేమతో, కొంపెల్ల జనార్ధనరావు, అని ఉన్నది.

అతను వినాయకరావునకు కానుకగా ఇచ్చాడు, కృష్ణశాస్త్రి కవితను గురించి తాను వ్రాసిన విమర్శా గ్రంథము, ఏదో పత్రికలో అచ్చైన వ్యాసము అది. మద్రాస్ నుండి విజయవాడ తరలి వెళ్ళిపోతున్న కొమర్రాజువారి ఇంటిలోని కొన్ని పాత పుస్తకాలతోపాటు, ఎలా కలిసిపోయిందో వానిలో, ఈ చిన్ని పుస్తకమున్నూ మూర్‌మార్కెట్ చేరి, అక్కడ సెకండ్‌హాండ్ బుక్‌షాపులో పదేళ్లు కనిపెట్టుకుంది సత్యవోలు కామేశ్వరరావు రాకకోసం. ఆ రోజులలో చారిత్రాత్మక పరిశోధనలో నిమగ్నుడైన మా కామేశ్వరరావు పురాతన శాసనపు పుస్తకాలకోసం వెతుక్కుంటూ ఉండగా, ఆ గ్రంథం అతని కంటబడింది. నా అదృష్టంవల్ల.

కామేశ్వరరావు చిన్నవాడు; ఈ తరము వాడు. అతనికి కొంపెల్ల జనార్ధనరావుతో ప్రత్యక్ష పరిచయం లేదు. కాని, నా ఆప్తమిత్రుడైన అతనితో నేను లక్షసార్లు చెప్పిఉంటాను పూర్వస్మృతులను నెమరువేస్తూ, జనార్దనరావును గురించి. అంచేతనే చూచీ చూడడంతోనే ఆ చిన్ని పుస్తకాన్ని కొనివేసి, వెంటనే నా కది కానుకగా ఇచ్చాడు కామేశ్వరరావు, నా మీది ప్రేమచేత.

అంతులేని ఆపేక్షకు ఆనవాళ్లు అనవసరం. జ్ఞాపకానికి వేరేవస్తువుకావాలా? హృదయంలోనే ఉండిపోతాయి ఆనాటి అపురూపమైన అనుభవాలు. కానీ, అప్పుడప్పుడు, నిస్పృహ నిండిన నిమిషాలలో, ఈపుస్తకము నా కెంతో ధైర్యమిస్తుంది. ఈ పుస్తకమూ, నేను జాగ్రత్తతో పదిలపరచుకొన్న, మా జనార్దనరావు మన కిచ్చి వెళ్ళిపోయిన, 'సృష్టి' అనే పద్యమూ:

## నా గు తు న్న యా త్ర

ఎప్పుడో
జయము తేగల ముదమొ,
మెచ్చులే జడిపించి
మనసు కదలించినా,
నాచంచువది పదను
చూచుకో నేమరదు.
సాయపడి చాలు విడు
మసకలన్నీ ముసరి
నా బర్హావనుల
రాగిల్లి రంగులజారు–
నింగిముట్టే కొండవనులు
నెయ్యములూర
గాలి పెన్నిధు లూర్చిపోయ.
మబ్బు లందము, చల్లదనము
పులకించేటి
నాకల స్వాదురేఖకు బొమ్మ
చెదకుట

## సాగుతున్న యాత్ర

అనుచు లేనే లేదు.

మనసె తాపాయ విచ్చినచోటు, నా కలము

మనసె, సర్వమె ఊతగా వ్రాసికొంటుంది-

అనురేఖ మదరు మెత్తని చిక్కదనముతో

నా కేల ననిచి సర్వము నర్తనము రేగ-

నా కలము చంచువు కలస్వాధుగీతి గుత్తులు

సర్గపుచ్చేటి వేళ.

అమర కవి, కొంపెల్ల జనార్దనరావు !

# ౧౪

పూవుల గుంపులందు మధుమాసముఁ బ్రసరించు కోకిలా
రావము పోలె, రాగ మధురమ్ముగ వీణ నదింపఁజాలు; నన్
బోవఁగ నిమ్ము, ప్రేమరసపూరిత విశ్వ విలాసగాన
మీవే వినిపింతువేని సుఖయించెద నేనది యాలకించుచున్ !

వేదుల సత్యనారాయణ

వేదుల సత్యనారాయణ కావ్యగానము జరుగుతోంది కాకినాడలో మన ఇంట. 'మిథిలలో'. పూజ్యులు శ్రీ వేంకట పార్వతీశ కవులు, అన్నగారు శ్రీ శివశంకరశాస్త్రి, ఆప్తుడు కృష్ణశాస్త్రి, స్నేహితులు కందుకూరి రామభద్ర రావూ, వింజమూరి శివరామమ్, అనంతం అన్నయ్య, బుద్ధవరపు నాగరాజా మాత్యుడూ—ఇంకా ఎందరో కవిసోదరులు వచ్చి ఉన్నారు. నా ఆతిథ్యం స్వీక రించి, నన్ను ఆనందింపజేయడానికి, మాననీయులు ప్రిన్సిపాల్ శ్రీ పెద్దాడ రామస్వామి కూడా విచ్చేసినట్టు జ్ఞాపకం. వేదుల తన రచన చదువుతున్నారు :

ఈ మధుమాసశోభ గతియింపక పూర్వమె పూలతోటలో
కోమలపుష్పముల్ వెదకికోసియమర్చిన ప్రేమదామమున్
'నా మెడలోనె వేయు' మని నా వపుడొక్క సుమమ్ముగన్నెఁ నా
స్వామిభవత్పదార్పణము సల్పగ లేనయితిన్ వియోగదశన్ !

ఏదో గొప్ప విశిష్టత ఉన్నది వేదుల రచనలో. ఎంతో హృద్యంగా ఉంటుంది అతని కవిత. శిల్పము—అద్భుతమైన శిల్పము. అతనికి సంస్కృతభాషా జ్ఞానము బాగా ఉన్నదేమో, మంచిమంచి మాటలు చక్కగా అమరుతవి. మరో ముఖ్యమైన విషయం ఏమంటే, అతనిలోని మనఃపూర్వకత్వము—ఇంగ్లీషులో సిన్సియరిటీ అంటారు. కొంతరు కవులు, గొప్పకవులు వ్రాస్తూఉంటే ఆ రచన ఎవరికి వినిపింపదలచుకొన్నారో వారు తమ యెదుటనే ఉన్నట్టు వ్రాస్తారువారు. వేదుల పద్యాలు పూర్తిగా తన కోసమే రాను వ్రాసుకున్నట్టు ఉంటాయినాకు. ఒక్కొక్క పద్యం ఒక ఆత్మానుభూతి. అందుకే అతని రచన నాకంత విలువైనది,

వేదుల సత్యనారాయణను చూడగానే, ఆయన 'భావకవి' అనుకోరు ఎవరూను, ఎన్నడూ. ఏవేవో కలలు కంటూన్నట్లూ ఉండడము, శరీరంలోను, మనిషి తీరులోనూ అతి సుకుమారత్వం ఆశించడము. కొంత అలసత్వము, కొంత పరధ్యానము—ఇటువంటి 'భావకవి లక్షణాలు' ఆయనలో లేవు, బొత్తిగా. మీదు మిక్కిలి, ఆయన, నల్లగా, పొట్టిగాఉంటారు. ముఖాన స్ఫోటకపు మచ్చలుంటాయి కూడా. కాని, కళ్లల్లో ఉంటుంది: విపరీతమైన తీక్షణత. అదే ఎంతో అనుభవ సంపద, ఎంతో స్నేహంతో పలుకరించే అందమూ. ఇక ఆయన చిరునవ్వూ, నవ్వూ — ఒక 'పేటెంటే!' అనగా, అవి, ఆయనకు విశిష్టతమైనవి — ఎవరూ అనుకరింప లేనివి.

కాని, ఒకప్పుడు ఆయన ఎన్నోబాధలు అనుభవించినట్టుఉంటారు. కారణం తెలియదు కాని, ఎందువల్లనో, ఆయనను అందరూ నిరసిస్తున్నారు అనే భావం ఏర్పడిపోయింది ఆయనలో ఆ పూర్వపు రోజులలో. ఒకసారి ఈ భావము మనలో అంకురించిందా, ఎంతైనా కీడు చేస్తుంది. మన పరిసరాలలో యథేష్టమై ఉన్న మంచికి బదులు చెడ్డనే చూస్తాము, మనము ఆస్థితిలో. భరింపరానినిస్పృహ కలుగుతుంది. విపరీతమైన కోపం కూడా కలుగుతుంది లోకంమీద :

## సాగుతున్న యాత్ర

కడుపు గాల్చెడు మండుటాకటను రేగి
కోర్కెలొండింటిని గ్రసించుకొనెడు కొలది
ఒకటెరుంగక కాలమృత్యువును నేనె
కొంచెముగ కొంచెముగ కబళించినాను ;
కాని, మ్రోడైన నా యెదలోని బరువు
దీర, నా బ్రతుకూపిరి దేరుకొనగ
కనికరపు చూపు, చిరునవ్వు తునుకయైన,
కటిక కరవయ్యె, పాడులోకాన నాకు;
ఏ కడల మిన్కుమను చుక్కయేని లేవి
ఈ నభము క్రుంగి కూలిపోయెడి విధాన
కారుమబ్బులె కాదు, చీకటులె కాదు,
క్రమ్ముకొననిమ్ము, కవడులు గట్టనిమ్ము;
వలపుతీపియెరుంగని వట్టి రాతి
గుండెలోకమ్ము నిప్పులు గురియనిమ్ము;
హృదయమున్నంతవరకు, నా ప్రేమకాంక్ష
బ్రతికియున్నంత వరకేడ్చి, బ్రతుకుచుందు !

ఎంత భయంకరంగా ఉన్నది, ఈ 'అశాంతి', ఈ ఆవేదన, ఈ శోకము! ఈ మాటలు ఋషిశాపంలా ఉన్నాయి కాని, కవి వాక్యంలా లేవు. కావి చివరకు

కవిలోని ఆశాభావమే జయిస్తుంది. ఆ పంక్తుల చివర, వేదుల సహజకవి కాబట్టి ఇలా అనక తప్పదు :

ఏ వెలుగు నన్ను తన దరి కీడ్చుకొనునో !

ఏ తలపు దారి సూపునో !!

అటువంటి వెలుగు ఏదో ఉన్నదనీ, అటువంటి తలపు ఏదో ఉన్నదనీ, అనిపించే ఆశ ఉంటేచాలు ఎంతటి ప్రొద్దైనా, ఎప్పటికైనా, చిగిరించక తప్పదు. ఈ అశాభావమే పరోకచోట మరీ అందంగా అమరింది వేదుల సత్యనారాయణ రచనలో.

ఆ రవికాంతి నీలజలదావళిపై బడ

చిత్రవర్ణ శోభారమణీయతల్ దివిని వ్రాలిన పోలిక,

ఈ ప్రభాతగంభీరసుగంధశీతలసమీరము

నామెయి సోకినంత విప్పారెను

నా విషణ్ణ హృదయాన

అపూర్వ విముగ్ధ భావముల్ !

ఎంత అనుభవనీయంగానూ ఎంత ఉదాత్తంగానూ ఉన్నది ఈ రూపకల్పన।

సాహితీసమితి సభ్యులవంటి 'భావకవుల' రచనలలో ఒక కొత్తదనము, ఇంతవరకు ప్రబంధ ధోరణిని ఉన్న కవితలోలేని లక్షణము, స్త్రీ మూర్తిని గురించి వారు చూపే పూజ్యభావము, అనుకుంటాను. స్త్రీ అందమైన ఆటవస్తువు అనుకోకుండా, ఆమె తమలో విపరీతమైన గౌరవభావాన్ని రేకెత్తించి. తను జీవితాన్నే పునీతముచేయగల అపూర్వవ్యక్తిఅని చూపారు శ్రీ శివశంకరశాస్త్రి.

కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు. పూర్వమెలా ఉండేదోగాని, ఈభావన చాలవరకు పాశ్చాత్య సంప్రదాయమే. షెల్లీ తెలుగులో వ్రాస్తే స్త్రీని గురించి ఇలా వ్రాస్తా రనుకుంటాను, వేదుల వ్రాసినట్లే :

**ఆమె నవనీత హృదయ, నా యంతరంగ**

**శాంతి దేవత, ఆశాపథాంతరాళ**

**పారిజాతమ్ము, ప్రేమజీవన విభాత**

**కైశికీ గీతి, నా తపఃకల్పవల్లి ;**

**ఆమె జగదీశమకుటాగ్ర సీమనుండి**

**యుర్విపై జారిన సుధామయూఖరేఖ...**

ఆశాపథాంతరాళ పారిజాతము ! ఎంత చక్కని వర్ణన !! ఈ వర్ణన వింటూ ఉంటే, నాయెదుట నా ఆరాధ్యదేవత సాక్షాత్కరించింది. భక్తితో కన్నులు మూసుకున్నాను. వేదుల రచనలోని ఒక్కొక్క మాటా ఎంతో చక్కగా అన్వ యించింది నా ప్రేమరాశికి, నా ఆరాధనకు.

వేదుల సత్యనారాయణ పద్యం ఎంతో చక్కగా చదువుతారు భావగర్భి తంగా, అర్ధగౌరవంగా. ఒక్కొక్క మెట్టూ అతిశయించే ఆ ఆరాధనా వాక్యాలు వింటూఉంటే నేను ఏమో, ఏమో ఐయిపోయాను. అతని చెయ్యి గట్టిగా పట్టుకో వలసివచ్చింది పొరలు కన్నీటిని ఆపుకోడానికి బలంకోసం; అంత ప్రస్ఫుటంగా కనిపించింది నా హృదయంలోని బొమ్మ :

ఆ రాత్రి వేదులను వారి ఇంటివద్ద దిగవిడిచి రావడానికి పెద్దాపురం తీసుకువెళ్లాను, నాకార్‌లో. కార్తీకపౌర్ణమి అనుకుంటాను. ఆ కార్ ప్రయాణంలో

తనివితీరా విన్నాను వేదుల పద్యాలు. కాని, ఆతని అన్ని పద్యాలూ ఒక యెత్తూ, నేను ఆప్యాయంతో దాచుకున్న ఈ పద్యము ఒక ఎత్తూ! ఎన్నిసార్లు, ఎన్ని వందలసార్లు, నాలో నేను అనుకున్నానో ఈ మాటలు :

ఈ వెడయూర్పు గాడ్పుటలయింపుల గ్రుచ్చినదండ భిన్నమై
పూవులు రేకులూడి పడిపోయె, మిగిల్చితి ప్రేమ వాసనా
ప్లావిత తంతు వద్ది యురివైతువా నా మెడ, నీ మృణాలరే
ఖావర హాస్య మంద భయకంకణమై ధరియింతువో సఖీ !!

ప్రేమవాసనా ప్లావిత తంతువు! గుప్పుమని సువాసన వీయడం లేదూ!! అసలు పద్యంలో, 'ధరియింతువో ప్రభూ!' అని ఉన్నది. కాని, ఆ రచన నాలో కలిగించిన భావాలనుబట్టి ఆ 'ప్రభూ' అనే మాటను 'సఖీ' అని మార్చి వ్రాసుకున్నాను, నేను. వేదులతో అన్నాను అలా మారుస్తున్నానని, అతను వెంటనే "అదే సరెమో! నా ఊ-లోనూ 'సఖి' యే ఉన్నదేమో !!" అన్నాడు.

కాకినాడలో ఉండగా, నాకు పిఠాపురం దివాన్‌గారి అబ్బాయి కోకా శివనాథ శాస్త్రితో స్నేహమైంది, కృష్ణశాస్త్రిద్వారా. కృష్ణశాస్త్రి అంటే, శివనాథశాస్త్రికి అపరిమితమైనభక్తిభావము. ఒకనాడు శాస్త్రి 'మేష్టార్'ను చూడడానికి వచ్చినపుడు, నన్ను అతనికి పరిచయం చేశాడు కృష్ణశాస్త్రి. శివనాథశాస్త్రీ నేనూ చాలా దగ్గరస్నేహితుల మయ్యాము, ప్రతిరోజూ ఉదయమొకమారూ పడుకోబోయేముందు ఒక పర్యాయమూ ఒకరినొకరు చూచుకోకుండా ఉండలేక పోయేవారమన్నమాట.—అంతగా అతిశయించింది మా పరస్పర ఆప్యాయము!

అతనికీ నాకూ అనేక విషయాలలో తేడా ఉండేవి. కాని, ఎందుకో, ఏలాగో మా మనస్సులు కలిసిపోయాయి. అతని అతి ఉదారస్వభావం ఒక

కారణం కావచ్చు. అదిగాక, లోపపూరితాల్లో, అతనిలో 'అన్నీ' ఉన్నా, ఏదో ఒక గొప్ప వెలితి కనిపించేది అతని చూపులనుబట్టి, అతనిజీవితంలో. ఇది నాకు అతని దెస అపరిమితమైన సానుభూతిని కలిగించింది. నేనంటే అతని కెందుకో ఎంతో ఇష్టము.

అతి దయార్ద్రహృదయుడు శివనాథశాస్త్రి. ఎందరికి ఎన్నివిధాల సహాయం చేసేవాడో, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ! స్నేహితులంటే ప్రాణము అతనికి. రాత్రి పది గంటలకు వచ్చేవాడు, తన కార్‌లో. కృష్ణశాస్త్రినీ నన్నూ బీచికి తీసుకువెళ్ళడానికి. అలా ఎంతోదూరం వెళ్లి, సముద్రపు నీటి అంచున కొంత సేపు ఉండి తిరిగి వచ్చేవాళ్ళము. మమ్ములను విడువలేక, విడువలేక, విడిచి వెళ్లేవాడు అతను. మళ్ళీ ఉదయాననే హాజరు, అతని ఇంట నేను గాని, మా ఇంట అతనుగాని.

ఒకసారి అతను ఎస్టేట్ పనిమీద కపిలేశ్వరపురం వెళుతూ నన్నూ తనతో కూడా రమ్మన్నాడు శివనాథశాస్త్రి. అతనితో ఉండాలనే ఆసక్తివల్లా, వీలైతే కపిలేశ్వరపురం జమీందార్ వారిని చూడవచ్చుననే ఆశతోనూ, బయలుదేరాను నేను శాస్త్రితో. దూరప్రయాణానికి కావలసిన సరంజామంతా ఉన్నది కార్‌లో. వీనితోపాటు వెనుక సీట్‌లో కూర్చున్న బంట్రోతు ఒడిలో పెద్ద తుపాకీ కూడా ఉంది. ఆ తుపాకిని చూపిస్తూ "ఇది ఎందుకు?" అని అడిగాను నేను శాస్త్రిని. "మరేం ఫరవాలేదు, మీకేమీ భయంలేదులెండి!" అన్నాడు శాస్త్రి నవ్వుతూ, అతను నవ్వితే పట్టి అర్భకుడు నవ్వినట్లుంటుంది. నేను ఊరుకున్నాను.

ద్రాక్షారామమూ అవన్నీదాటి చక్కగా ప్రయాణము చేశాము, ఈమాటా, ఆ మాటా మాట్లాడుకుంటూ. బలే సరదాగా కబుర్లు చెపుతాడు శాస్త్రి స్నేహితులతో. మళ్ళీ కొత్తవారియెదుట 'పలుకే బంగారం'గా ఉండిపోతాడు. కొంతదూరం వెళ్లాక, ఒక ఊరు దాటాక ఒక తామరకొలను తగిలింది మాకు, మైళ్ళ పర్యంతం తెల్లతామరలు — అన్నీ తెల్ల తామరలే! బ్రహ్మాండమైన సరస్సు అది. సరస్సు

గట్టునే కార్ పోనిస్తున్నాడు శాస్త్రి. "మీరు కవులు; పువ్వులనుచూచి ఈ లోకాన్ని మరచిపోవద్దుసుమా !!" అని ఆక్షేపిస్తున్నాడు నన్ను.

ఆత్రోవ వెళ్ళి వెళ్ళి మరీ నీటి అంచుకు వెళ్ళింది. నీటి అంచునే ఇటూ అటూ చూస్తూ కార్ నడుపుతున్నాడు శాస్త్రి. చుట్టూ, కనుచూపుమేర ప్రదేశమంతా తామర పువ్వుల మయమే ; ఒకొక్కచోట మనిషి అంత ఎత్తున పెరిగింది తామర ఆకు పువ్వుల కాడలతో సహా. పైన రకరకాల పక్షులు. కొన్ని, తామరాకుల పైననే తచ్చాడుతున్నాయి — అప్పుడప్పుడు కాస్త పైకి ఎగురుతూ. కొన్ని అల్లా నీటిపైననే గాలిలో రెక్క లల్లారుస్తూ మెల్లిగా ఎగురు తున్నాయి చేపలకోసం నిరీక్షిస్తూ.

కార్ ఆపి, శివనాధశాస్త్రి క్రిందికి దిగాడు. నేను దిగలేదు. బంట్రోతు కిందికి దిగి తుపాకీ అతనికి అందించి, తూటాలు ఇచ్చాడు అతనికి. శాస్త్రి గురి చూచి పిట్టలను కొట్టసాగాడు.

నా ఒళ్ళు ఒణికిపోయింది. శాస్త్రి దెస నాకున్న స్నేహమంతా ఏమై పోతుందో అని భయపడ్డాను. అమానుషము, ఈ పిట్టలవేట ; నాగరికులు చేయ వలసిన పనికాదు. కాని, అతనిని వారించి ప్రయోజనం లేదు. అతని నైజము అటువంటిది. ఏ పనైనా ఒద్దంటే, అతను మరీ పట్టుదలతో చేసి తీరుతాడు. కాని, ఒకొక్కప్పుడు కష్టాలలో ఉన్నవారిని చూచి ఎంతగానో జాలిపడే అతను, ఇలా, తన విలాసం కోసం, జీవహింసచేస్తూ ఉండడము నేను భరింపలేక పోయాను. కాని, ఏమి చెయ్యను ? ఏమీ తోచక, అలా చూస్తూ కూర్చున్నాను, యమయాతన అనుభవిస్తూ. ఒకొక్క గుండు పేలినప్పుడు ఆ చప్పుడికి నాగుండె ఆగిపోతుందేమో అనిపించేది — ఆ గుండు తగిలి నేలకు ఒరిగిపోయే పిట్టను తలుచుకుని. ఆ మారణ హోమమును అలా చూస్తూ ఉండడము ఒకరీతి శిక్ష — అనుభవింపక తప్పినది కాదు.

ఒక గుండు దెబ్బకు పడిపోయిన పక్షి రక్తం చిమ్మి వికసించిన ఒక

తెల్ల తామరపువ్వుపై పడి మధ్య రేకలన్నీ ఎంతో భయంకరంగా ఎర్రపడ్డాయి. ఆ దృశ్యం చూడలేక, కళ్ళు గట్టిగా మూసుకున్నాను.

కాని, అతని ఈ పర్యవసాన నాకు శాస్త్రిపైఉండే ప్రేమభావము తగ్గలేదు. అదెప్పటికీ తగ్గదు. అతనిలో — నా అభిప్రాయమున — లోపమున్నదని తెలిసి, ఆ లోపాన్ని సహించాలి నేను. ఆ లోపంతోపాటే అతను నా స్నేహితుడు. అదృష్ట ముంటే ఎన్నాళ్ళకో, ఎప్పటికో, అతనిని నా అహింసా మతానికి మార్చు కోగలనేమో, ఏమో,

శాస్త్రీ, ఎన్ని లోపాలను సహిస్తున్నాడో, స్నేహితుడనైన నాలో !

*　　　*　　　*

బుద్ధవరపు నాగరాజామాత్యుడున్నూ నాతో ఎక్కువగా ఉండేవాడు, ఆ రోజులలో. నాగరాజు కవి, మిక్కిలి స్నేహశీలి. జీవితంలో, ఏదో సందర్భంలో, అతను గొప్పదెబ్బ తిని, బాధ పడుతున్నాడు, అందుచేతనే కాబోలు అత నంత ఆప్తుడయ్యాడునాకు. అతనికి కృష్ణశాస్త్రి పద్యాలన్నీ కంఠతా వచ్చును. అవీ, అవిగాక తెనాలిరామకృష్ణుని నిగమశర్మను గురించిన పద్యాలూ, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణములోని పద్యాలూ ఎంతో చక్కగా చదివేవాడు నాగరాజు. అతను పద్యాలు చదువగా వినాలనే కుతూహలంతోనూ, అతనియందు నా కున్న స్నేహభావం వల్లా, ఎప్పుడూ అతనిని నాతోకూడా తీసుకువెళుతూండే వాడను, నేను నా కార్‌లో.

కటిక చీకటి, ఎంతో దూరాన నక్షత్రాలు మినుకుమినుకు మంటున్నాయి. సముద్రపుఒడ్డున, పై కెగసే కెరటాల నీటితుంపరలు మామీద పడేటంత సీటి అంచున కార్‌లో కూర్చుని ఉన్నాము నాగరాజూ నేనూ. నిరంతర సముద్రఘోష శృతిగా, కంఠమెత్తి చదువుతున్నాడు అతను 'సీతమ్మ శోకము' !

కటకట లక్ష్మణా! పిడుగుకంటెను బెట్టిదమైనమాట నే
డిటువలె విని యుండియున్ బగుల దింతలు సింతలుగా దుగుండె యె
ప్పటివలె నున్న దీ కటిక భావముతో నసువుల్ భరించి యి
య్యటవినె యింక నేవలన నాపదలొందగ నున్నదాననో?

ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిక రామచంద్రుడున్
గన్నుల జూడగల్గ దొకొ, కల్గక యుండిన బ్రాణమేల పో
దన్న రఘుప్రవీరు చెవులారగ నింతయు దెల్పు నాదు మే
నున్నది చెంత గంగమడుగున్నది యైనటు లయ్యెడున్ దుదిన్!

మహాసాధ్వి, పేదరాలు ఆ సీతమ్మను తలచికొని, తలచికొని, జాలితో గుండె నీరయ్యేది. ఎంత గొప్పగా వ్రాశాడు కవి! ప్రబంధశైలి ఐనా, గొప్ప 'భావ కవిత్వానికి' ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయి ఈ కవితలో అనుకుంటాను నేను పదేపదే. "పిడుగు వంటి మాట విని, గుండె పగులలేదు; ఎప్పటిలాగే ఉన్నది, ఈ కటికభావంతో ఇంకెలా బ్రతుకను!" అంటుంది ఆ సుకుమారి. "ఇంక నాదు మేనున్నది, చెంత గంగమడుగున్నది" అనే మాటలు వినే సరికి ఆ తల్లి గభాలున మడుగులోకి దూకినట్టే అనిపించి, కడుపు చెరువయ్యేది జాలితో. ఎంత చక్కగా వాడాడు భాషను పాపరాజు! 'గంగమడుగు' అద్భుతంగా కుదిరింది, ఈ సందర్భంలో.

లక్ష్మణుడు సీతను విడిచి వెళ్లిపోవడము పాపరాజు చిత్రణలో ఒక మహా అద్భుతమైన ఘట్టము. క్రమ క్రమాస్తమిత రథకేతనములను గురించిన వర్ణన గొప్పగా కుదిరింది :

రమణి మరికొంత పడిదాక రథము జూచు
దమణి మరికొంత సేపు కేతనము జూచు
గాంత మరిమీద రథపరాగంబు జూచు
బడతి మరి కొంతటను వట్టిబయలు సూచు

'వట్టి బయలు'—ఎంత అందంగా వాడాడు కవి!

ఇది ఒక పాతికయేండ్ల క్రిందటి మాట. 'గంగమడుగు', 'వట్టి బయలు' ఎన్నటికీ, మరువలేను నేను. మాటలు ఎంత ప్రభావము కలవో తెలుపడానికి తరుచు వీనిని ఉదాహరిస్తూ ఉంటాను. "మన భాషలో పాపరాజు ఇటువంటి మాటలు వాడి, అద్భుతమైన భావమును సూటిగా స్ఫురింపజేసినట్టే, రష్యన్ భాషలో మాక్సిమ్ గార్కీ కూడా, మాటలను ఎంతో పెంత ప్రభావంతో ఉపయోగిస్తాడు" అని వ్రాశాను ఒక పర్యాయము, గార్కీ రచనా కౌశలాన్ని విమర్శిస్తూ.

అనంతరోదన గల ఆ సముద్రాన్ని విడిచిపెట్టి, ఇంటివైపు మరలేముందు మళ్లా ఒక్కసారి చదివించుకొనేవాడను నేను నాగరాజుచేత, 'సీతమ్మ శోకం':

ఒడిమీద నిడుకొని యురముపై జేర్చుట
చేరికకది కడసారియేమొ

చెక్కు చెమ్మట చీరచెరగున దుడుచుట
చెలిమికి నది తుది చేటియేమొ

పుక్కిటతావి కప్పురపుబీడె మిచ్చుట యనురాగ
మునకది యవధి యేమొ

కోరిన పని కియ్యకొనుటది కరుణా ప్రబంధ
మునకు ఫలగ్రంథమే మొ!

ఒకొక్క ఊహ ఒక్కొక్క అద్భుతమైన రూపకల్పనను కలిగిస్తాయి. ఎంతటి ఆర్ద్రమైన బొమ్మలు! వానితోపాటు అనుకంపాపూరితమైన 'చేరికకు కడసారి,' 'చెలిమికి తుది చీటి', 'అనురాగమునకు అవధి', 'కరుణాప్రబంధము నకు ఫలగ్రంథము.' శ్రీరాముదే ఈ మాటలు విని ఉంటే ఏమై పోయి ఉండేవాడో!

లక్ష్మణుని పంపివేసినప్పటి ఆ లోకమాత, ఆ నిర్భాగ్యురాలి, మాటలు మరీ మరీ బాధను కలిస్తాయి: "ఏ యనువున నీ ప్రతిక్షణ మహా యుగముల్ క్రమి యింతు లక్ష్మణా!" అని వాపోతుంది, ఆ తల్లి.

'ప్రతిక్షణ మహాయుగము' — ఎంత భావగర్భితమైనమాట! ఎంత అను భవనీయమైన మాట!

సీతమ్మ అంటుంది మరదితో:

"తలప నాకేటుగడయును దానెయనుము
భావమెప్పుడు తన మూర్తి బాయదనుము
నెమ్మియొక యింత నామీద నిల్పుమనుము!"

"నేను అతనిని (ఆ నిర్దయాస్వాంతుని) మరువను ఎన్నటికీ. అతనినీ. నాపైన ప్రేమ ఉంచుకోమని చెప్పు" అంటుంది ఆ మహనీయమైన ప్రేమికురాలు.

నాగరాజును ఇంటివద్ద దిగవిడిచి, ఒక్కడనూ ఇంటికి జేరేవాడను దిగులు పడిన హృదయంతో. కార్ షెడ్‌లో ఉంచి చీకటింటిలో ప్రవేశించేవాడను. అర్ధ రాత్రివేళ, శిథిలమైన నా 'మిథిలలో' ఎత్తుటరుగులపైన స్తంభాన్ని జేర్లబడి నిలిచి మళ్లా ఒక పర్యాయం అనుకునేవాడను:

## సాగుతున్న యాత్ర

మోము మోమున గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపు బనికి దీరు దంయేమొ
యెలనగవుదేర జూచి లోపలి కనచుట
మేలు చిన్నెల కది పొలిమేర యేమొ !!

'ఎల నగవుదేర జూచి, లోపలి కనచుట మేలు చిన్నెల కది పొలిమేర యేమొ' !—ఇంత జాలిగల వేదనను అనుభవిస్తూ కన్నీరు ఆపుకోవడం ఎలా?.... ఎందుకు ఆపుకోవాలి ?

కాని, ఈ జాలి అంతా సీతమ్మనుగురించేనా ?

నన్నుగురించి, యేమో !

కవితాస్వాదన అంతా ఇంతేనా?... ఏమో !

౧౨

స్వామి ! పరిగాఢ శర్వరీచ్ఛవి, దరిద్ర
తానిధానము, తేజోవిహీన, మనవ
రత పరిస్రుత భాష్పధారా మిళితము,
నన్ను నీవుండు మన్నంగణంబు తండ్రి !
ఈ మహాంధకారంబున నెప్పుడో యొక్క-
సారి మెరసితి, వానాడు సామి ! నా కు
టీర మానందవాయు ప్రచార శత స
హస్రకుసుమ పరిమళ వ్యాపృతంబు !
దానితో సరి, మరల నాంధ్యమ్ము క్రమ్మె,
తొలి చివర లేని ఈ చీకటులును, నేను,
ఒక్కరొకరప్పళించు కొంచుండి నాము,
నిన్ను, నాటి మెరుపు మన్నించు కొంచు !!

విశ్వనాథ సత్యనారాయణ

విశ్వనాథ సత్యనారాయణ ఒక అద్భుతమైన నవల కూడా రచించారు. ఏకవీర ఒక విచిత్ర కథా మంటపము; దీనికి ఏకవీర, ఆమె భర్త కుట్టాన్, వీర భూపతి, అతని భార్య మీనాక్షి — వీరు నలుగురూ స్తంభాలు. ఈ 'అంగణం' లో అంత బాధా అనుభవిస్తారు ఈ నలుగురూను, ఎప్పుడో ఒకసారి తళుక్కుమనిన 'ఆనాటి మెరుపును' మన్నించుకుంటూ, కన్నీరు కారుస్తూ.

సాగుతున్న యాత్ర

"ఏకవీర మహాప్రబంధమువలెను. ప్రేమ సంబంధమైన కథ అయినా, వీరరసము ఉప్పతిల్లుతూ ఉంటుంది. నలుగురూ వీరులే — జితేంద్రియులైన నీరులు! కొంతవరకు అంతరంగ యుద్ధము. తగిలిన గాయాలు ఒకరికిచూపించు కొని గర్వింపతగ్గవికావు. అనుభవింపక తప్పదు. నలుగురున్నూ జయముపొంది నారు" అని వ్రాశాను, ఇరవై రెండేళ్ళ క్రితం విశ్వనాధవారి క్రొత్త నవల గురించి మా 'ఉదయిని' లో.

నాలో ఏమాత్రము విమర్శనా కౌశలమున్నా అందుకు కారణము అన్న గారు మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆప్త స్నేహితుడు కొంపెల్ల జనార్దనరావూను. అసలు నాకు విమర్శనా పద్ధతి నేర్పింది శర్మగారే. ఆయన అప్పుడు భారతి సహాయ సంపాదకులుగా ఉండేవారు. విజ్ఞాన సర్వస్వము పని, చారిత్రక పరిశో ధనపనీ, వీనితో కూడా భారతిపనీ యెక్కువై, వారికి ఊపిరి సలుప నంతగా ఉంటే చూచి, ఉడుతాభక్తిగా, వారి శ్రమ కాస్త తగ్గించాలనే ఉద్దేశ్యంతో ఆరోజు వారు విమర్శనార్థం తమతో ఇంటికి తీసుకు వచ్చిన చంద్రగుప్త నాటకానికి నేను విమర్శ వ్రాస్తానని ఆ పనికి పూనుకున్నాను. చప్పునే పూర్తిచేశాను విమర్శ. కాని, నా విమర్శలో అన్నీ ప్రశంసా పాత్రము, ప్రశంసనీయమే; మెప్పుల కుప్పగా పరిణమించిన నా విమర్శ చూచి అన్నగారు అన్నారు: "చాలా శ్రద్ధ గానే విమర్శించారు; బాగానే ఉన్నది; కాని ఇన్ని అంకాల నాటకంలో మీకు అన్ని విషయాలూ ప్రశంసనీయంగా ఉండటమే కాస్త వింతగా ఉంది. నాటక లక్ష్య లక్షణాలు, పాత్రపోషణ, శైలి, ప్రదర్శనత్వము — ఇటువంటివన్నీ చూచి విచక్షణతో వ్రాస్తేనే విమర్శ సమగ్రంగా ఉంటుంది" అని.

వారి మాటలు నాకు నచ్చాయి. మళ్ళీ ప్రయత్నించాను. శర్మగారు నేర్పిన పాఠము నాకు చాలాఉపకరించింది. తరువాత ఏడాదికో, రెండేళ్ళకో అవతరించిన ఏకవీరను చదువుతూ ఆ క్రొత్త నవలలోని అందచందాలకు ముగ్ధురాలనై పోయి వెంటనే స్నేహితుడు జనార్ధనరావుతో ఆ పుస్తకం గురించి ఎంతో వివరంగా

చెప్పాను. జనార్ధనరావు చాలా సంతోషిస్తూ "నేనూ చదివాను ఏకవీర, కాని మీ అంత లోతుగా వెళ్ళలేదు. మీరు నాతో చెప్పినదంతా వ్రాతగా జేస్తే మన 'ఉదయిని'లో వేద్దాము చాలా బాగుంటుంది" అన్నారు. ఆ ప్రోత్సాహంతో వ్రాశాను 'ఏకవీర'ను గురించిన విపులమైన విమర్శ. ఉదయినిలో ఒక ఏడు ఎనిమిది పేజీలు వచ్చినది. అందరూ చాలా బాగుంది అన్నారు. మన విమర్శనా పద్ధతిలో ఒక క్రొత్త రీపు ఇది అన్నారు కొందరు. నేనూ చాలా సంతోషించాను ఇంగ్లీష్ రివ్యూస్‌లో చాలా సమగ్రంగా వ్రాసిన నిపుణుల విమర్శలాగేకుదిరింది ఈవిమర్శ అని. విశ్వనాథ సత్యనారాయణ అంతవారి శైలినిగురించి ఇలా అనటానికి జంక లేదు నేను ;

"గ్రంథమంతా కవి 'సులభశైలి'నే వ్రాశారు కాని, వీరు ఒక మోస్తరు గ్రాంథిక భాషలో వ్రాయకుండా ఈ రోజులలో ఎక్కువ అమలులోనికి వస్తూ ఉన్న, మన మందరము మాట్లాడుకునే, ఆలోచించుకునే, అనుభవించే సజీవమైన వాడుక భాషలో వ్రాస్తే ఈ గ్రంథము మన హృదయాలకు మరింత దగ్గరగా, పదింతలు గొప్పగాఉండేది. వాక్యాలు ఇప్పటివలె విడివిడిగా ఉండకుండా ఒకదానిలోనికి ఒకటి దొర్లిపోయి కలిసిపోయి ఒకబిగి ఏర్పడేది" అని వ్రాశాను.

ఐతే వారు ఉపయోగించిన ఉపమానాల గురించీ. అలంకారాల గురించీ మెచ్చుకుంటూ వ్రాశాను ;

"ఉపమానాలు వింత వింతవి :

(వైగైనది) ఇసుక తిన్నెలు మొగిలిపువ్వొళ్లు చల్లి సిద్ధముచేసిన విశ్రాంతి స్థలములవలె నుండెను.

ఒత్తుగా పరచిన మల్లెపూవులలో నేకపీర గోధుమవన్నె త్రాచువలె ముడుచుకొని పండుకొన్నది.

కనులలో నిండుప గింజలంత బాష్పములు నిలచినవి.

ఆమెయందే వాడిపోయిన మందారమువలె మంచమున కంటుకొనిపోయి యున్నది.

సన్నని నీటిపాయలలోని చిరు కెరటములు త్రాచుపాము పిల్లలవలె ఒడ్డునకు కొట్టుకొని వచ్చుచు నుండెను.

గదిలో గోడమీద ఎర్రనిబొట్లు రెండు నెత్తురుల చిమ్మినవి. అప్పుడే రెండవ సంవత్సరము గుర్తుపెట్టిన ఏకవీర చేతికైన సూనె కలిపిన కుంకుమ వర్ణమాతని హృదయమునుండి యామె నెత్తురును తీసినట్లతనికి తోచెను.

ఒకచోట అద్భుతమైన ఉత్ప్రేక్ష ఉన్నదని చూపాను. ప్రేయసి వ్రాసి పంపిన పరిమళ భరితమైన భూర్జరీపత్ర లేఖను ప్రియుడు చదువుతున్నప్పుడు: "కస్తూరియు పునుగును నలంపబడియున్నవి. ఆ వాసన లిల్లంతయు గ్రమ్మి వేసినవి. ఆ వాసవలచేత దీపముపోవునే మోయనుకొంటిని."

ఒకచోట వ్రాశాను: "వీరు తమ వ్యక్తుల మనోభావాలను, వారి అనుభవాలను వర్ణించేటప్పుడు పదే పదే వారి కంటివెంట నీరుచెప్పిస్తారు. వీరి నాయికా నాయకులు ఇట్టే ఏడుస్తారు. కాని, ఆమాటకొస్తే కొన్ని సన్నివేశాలను అనుభవిస్తూవుండే మనకుకూడా అక్షరాలు నీటితెరలోంచే కనబడతాయి." అని.

ఏకవీర కథాసంవిధానము, పాత్రచిత్రణ, వ్యక్తుల మానసిక పరివర్తనా పరిశీలనా నన్ను చాలా ఆకర్షించాయి. కథావస్తువు సృష్టి మొదలు నేటివరకు మనహృదయాలలో ప్రేమ ఉన్నంతవరకు మనలను వేధించే ప్రేమ సమస్య: ప్రేమ ముఖ్యమా? విధ్యుక్త ధర్మము ముఖ్యమా? ఈసమస్యచేతనే ఆనలుగురినీ బాధించి దీనివలన వారికి తీరని ఆత్మపరీక్ష గొప్ప నిగ్రహమూ అందుబాటులో

జయము—కాని, దుఃఖము భరించడానికి అలవికాని ఆశాభంగమూ కల్పించారు విశ్వనాథ సత్యనారాయణ.

ఈ నవలలో సంభాషణలూ ఆత్మగతాలూ చాలా ఇంపుగా ఉంటాయి. ఒకచోట కుట్టాన్ అనుకుంటాడు :

అందరును ఏకపత్నిని ప్రేమించుమనుచున్నారు. వీరభూపతి అదే మాట. మా తల్లియు నదే మాట. ఇందులో నేదో రహస్యమున్నది. నేను ప్రేమించిన స్త్రీని వదలిపెట్టి బలవంతముగా నా మెడకు కట్టిన స్త్రీనా ప్రేమించవలె? నాకర్థమగుటలేదు. ప్రేమించుట, ప్రేమించకపోవుటయనునది నాస్వాధీనములోనున్నదా? ఎవరి స్వాధీనములో నున్నది? భగవంతుని స్వాధీనములో నున్నది. ఏభగవంతుని స్వాధీనములో నిది యున్నదో ఆ భగవంతుడే నా కీ స్త్రీని తెచ్చి పెండ్లిచేసెను కదా! భగవంతుడు కాడు; నా తండ్రి చేసినాడు. భగవంతుని ఇచ్ఛలేనిది నా తండ్రి ఎట్లు చేయుటకు? ఈ స్త్రీకిని నాకును సంబంధ మేమున్నది? ఏమియు లేకున్న మే మిరువురము భార్యాభర్తలుగ చేయబడుట? పూర్వజన్మలోనే సంబంధమున్నదేమో!"—ఇలా ఉంటాయి ఆ స్వగతాలు! ఇంచుమించు నాజీవితము గురించి నేను అనుకున్నట్టే!

ఏకవీర నవల చదువుతూ ఉంటే, కొన్నిచోట్ల అది కథగా కన్పించదు. వ్యక్తుల నిత్యజీవితంలో జరుగుచున్న హృదయ విదారకమైన సంఘటనలు ఉన్నవి ఉన్నట్టుగా పొందుపరచినట్టు ఉంటుంది. అందుచేతనే నావంటివారిని ఇంతగా ఆకర్షించింది ఈ రచన.

ఈ విమర్శ వ్రాయడంవల్ల నాకు కలిగిన అనుభవం ఆధారంగా కొన్ని ఏండ్ల తరువాత ప్రఖ్యాత రచయిత్రి వర్జీనియా ఉల్ఫ్‌ను గురించి వ్రాశాను రెండు వ్యాసాలుగా, ఆంధ్రశిల్పిలో. కాస్త కష్టమైనా, ఆ మహనీయురాలి ఆశయాల

గురించీ, రచనా నైపుణ్యం గురించీ విశదంగా పొందుపరుపగలిగాను. ఆమె రచనలో అందచందాలను మన తెలుగు మాటలలోనే చూపించ గలిగాను.

ఆ తరువాత, ఉత్తమకవీ, శిల్పీ, నాకుస్నేహితుడూ ఐన ఒకరి 'ఆత్మకథ'ను విమర్శించాను, ఇంగ్లీషులో. ఈ విమర్శ చూచిన మార్సెలాహార్డీ, పేరుపొందిన విమర్శకురాలు ఆమె, అన్నారు : ''అసలు పుస్తకంకంటే విమర్శే ఎక్కువ అందముగా ఉన్నది'' అని!.

నిజమే! ఒక్కొక్కప్పుడు అలా అవుతూంటుంది. అది ఆ మొదటి రచనలోని లోపమువల్ల కాదు—రెండవరచన ఐన విమర్శకు కలిగిన మంచిఅవ కాశంవల్ల. అంటే ఏ మూడు వందల పుటలలోనో అక్కడా, అక్కడా ఇమిడి ఉన్న అందమైన అంశాలను అన్నిటినీ ఒకచోట గ్రుచ్చిఎత్తి చక్కని పద జాలంతో, తగిన సానుభూతితో పాఠకులకు అర్పింప కలిగినామంటే, ఇదే ఎక్కువ ఆకర్షణీయంగా ఉండదూ, మరి!

ఇంచుమించు ఇటువంటి తమాషాయే జరిగింది ఒక సందర్భంలో. ఒకా నొక సుప్రసిద్ధ భారతీయ తత్వవేత్త, మహాజ్ఞాని, వచించిన మన సనాతనధర్మ గ్రంథమునకు అనీబిసెంట్ 'పరిచయం' వ్రాశారు, ఆయన కోరికపైననే. ఏదో కారణంవల్ల అనీబిసెంట్ పరిచయమున్న భాగము అచ్చువావడము ఆలస్యమై, ఆ పరిచయం లేకుండానే ఆ గ్రంథము వెలువడింది. తరువాత కొద్ది నెలలకు అనీబిసెంట్ పరిచయం వేరే చిన్న పుస్తకంగా వేశారు ఆయన, తన గ్రంథాని కిది ఉపోద్ఘాతమని తెలియజేస్తూ. చిత్రము! అసలు పుస్తకము ఏ ఐదారువేల కాపీలో అమ్ముడైతే ఆ పుస్తకానికి అనీబిసెంట్ వ్రాసిన పరిచయం ఒక పది హేనువేల కాపీలు అమ్ముడైనవి. ఇప్పటికీ, ఆ అసలు పుస్తకాన్ని మరచి పోయినవారు ఈ పరిచయాన్ని శ్రద్ధతో చదువుకొంటూ ఉంటారు! ఇలా ఉంటుంది ఒకొక్కప్పుడు.

* * *

# సాగుతున్న యాత్ర

కాకినాడలో ఉండగా నాకు నాడీ జ్యోతిష్యంతో పరిచయం కలిగింది. వడ్లమాని సోమనాథశర్మ అనే ఒక ఆయన, బాలాంత్రపువారి కోసము ఆ నాడీ గ్రంథము చదువుతూండగా అక్కడకు వెళ్ళి కూర్చున్నాను. ఆయన అప్పుడు అతి అద్భుతంగా ఫలాలు చెప్పేవారు అని ప్రసిద్ధి. ఫలం చెప్పడమంటే వేరే గణించి, చెప్పడం కాదు. ఒక పురాతన తాటియాకు గ్రంథంనుంచి ఒక మోస్తరు సంస్కృత భాషలో చదువుకుంటూ పోతూ, ప్రస్తారంచేసి చెపుతారు మనలను గురించిన విషయాలు. చాలా వింతగా ఉంటుంది.

ఆ చెపుతూన్న విషయం పూర్తిఅయ్యాక నాకేసిచూస్తూ ఆ యనంతట ఆయనే అన్నారు—"ఏదీ మీ చెయ్యి" అని. సాముద్రికశాస్త్ర రీత్యా నాజాతక చక్రం సిద్ధం చేసి కొద్దిసేపటిలో, నన్ను గురించిన పూర్వ విషయాలు చదవజొచ్చారు, నాడీ గ్రంథమునుంచి. మా తండ్రిగారిని గురించీ తల్లిగారిని గురించీ వివరాలుచెపుతూ ముఖ్యమైన సంఘటనలు అన్నీ జరిగినవి జరిగినట్టుగా తు. చ. తప్పకుండా చదివారు. అంతేగాక మా తండ్రిగారికీ నాకూ మధ్యఉన్న విపరీతమైన అన్యోన్య ప్రేమభావాన్ని చక్కనిభాషలో వర్ణించారు. "పైకి తెలియనివ్వరు ఇతని తండ్రి: కాని, ఈ పుత్రువి దెర తేనెపట్టు ఎలా అమృతంతో నిండిఉందో అలా ప్రేమతో నిండిఉన్నది ఆ తండ్రి హృదయం"అని చదివారు. ఇది నన్ను వింతగా కదిలించి వేసి, నేను బోరుమని ఏడ్చివేశాను. శర్మగారు వారి భార్యను పిలచి, చెంబెడు నీళ్లు తెప్పించి ఇచ్చారు నాకు మొఖం కడుక్కోను. అ తరువాత మళ్ళీ ప్రారంభించారు. ఎన్నెన్నో చెప్పారు పూర్వ విషయాలు నా అడయార్ నివాసము గురించీ బెంగుళూర్‌లో నా శాస్త్రపరిశోధనా విషయాల గురించీ నా ప్రేమ గురించీ అది విఫలమైన యుదంతము గురించీ.

తరువాత, ప్రస్తుతానికి వచ్చి, కొద్ది రోజులలో నాకు ఉత్తరదిశ ప్రయాణ మున్నదనీ వంశధారా ప్రాంతంలో ముహూర్తకాలము ఆగి ఆ తరువాత ఒక మహానగరము జేరుతాననీ అక్కడ నేను వెళ్ళిన కార్యము ఒక్క మూడు

రోజులలో పూర్తి అవుతుందనీ విజయవంతంగా తిరిగి వస్తాననీ చదివారు. మొదటిరోజు నా పైఅధికారులతో పరిచయము, రెండవరోజు సంప్రతింపులు, మూడవరోజు నేను వారిని పూర్తిగా ఆకర్షించివేయడంవల్ల నాకే సంపూర్ణ విజయము అని ఉన్నది ఆ నాడిలో. నిజమే ! ఇన్సూరెన్సు పని విషయమై పైఅధికారులతో సంప్రతించడానికి ప్రయాణము పెట్టుకుని ఉన్నానునేను. త్రోవలో వంశధార ప్రాంతానఉన్న పర్లాకిమిడిలో నా స్నేహితుడు ఉలవభద్రదొరను చూడాలని సంకల్పించి ఉన్నాను కూడా.

ఇలా ప్రయాణమై వెళ్లాక, శర్మ చెప్పినట్లే మొదటిరోజు వారందరితోను పరిచయమైంది. నాకంటే చాలా పెద్ద హోదాలో ఉన్నవారు నలుగురు డైరెక్టర్లు నన్ను చాలా ఆదరించారు. రెండవ రోజున నేను వారితో జరిపిన సంప్రదింపుల ఫలితంగా వారు నా సూచనలను అన్నిటినీ ఆమోదించి వానిని గురించి నాన్నగారి అంగీకారము పొందటానికి వారి ఆఫీసునుంచే మద్రాస్‌లో ఉన్న నాన్నగారితో ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లాడమన్నారు.

అదే మొదటిసారి నేను ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లాడటము. నెంబర్ ఇచ్చిన కాస్సేపటికి మద్రాసునుంచి నన్ను పల కరించారు. పదకొండు వందలమైళ్ళదూరం నుంచి మా పినతల్లిరుక్మిణమ్మగారి కంఠం వినిపించింది సమీపానేవున్న ఇంకొక గదిలోంచి మాట్లాడుతూన్నంత స్పష్టంగా. నేను విస్తుపోయాను. నాన్నగారు మా స్వగ్రామమైన మాధవరంలో సుస్తీగావున్నమా పినతండ్రి భార్య రాజేశ్వరిమ్మగారికి వైద్యం చెయ్యడానికి వెళ్లారనీ, రేపు ఎల్లుండి వస్తారనీ అన్నారు రుక్మిణమ్మగారు. నేను డైరెక్టర్లతో చేసిన సంప్రతింపుల విషయం సవిస్తరంగా చెప్పి, నావలన జరిగిననిర్ణయాల గురించి నాన్నగారికి ఆ విధంగా తెలియజేయవలసిదని ఆమెను కోరాను.

మరునాడు డైరెక్టర్లను కలుసుకొన్నప్పుడు ఇంత సులభంగా ఆఫీసు కార్యాలను చక్కబెట్ట కలిగినందుకు వారు నన్ను ప్రశంసిస్తూ, నాన్నగారిని

సరించీ. నన్ను గురించీ చాలా స్నేహపూర్వకంగా మాట్లాడారు. వారి ఆతిథ్యం స్వీకరించి ఇక రెన్నాళ్ళు కలకత్తాలో ఉండి కాకినాడ వచ్చేశాను.

నాడీ గ్రంథములో నాకు నమ్మకమెక్కువైంది. శర్మ నాకు దగ్గర స్నేహితుడైనాడు కాబట్టి చీటికీ మాటికీ అతని వద్దకు వెళ్ళనారంభిచాను. ఒకసారి అతనిని మా స్వగ్రామం మాధవరం తీసుకువెళ్లాను—మాపినతండ్రి గారిని గురించిన నాడి చదివించడానికి.

ఇది ఒక ఇరవైమూడు ఏళ్ల క్రితం జరిగినది. మంచిచెడ్డల బాధ్యత పూర్తిగా మనదికాదు అని నేను విశ్వసింపక తప్పదు. ఐనా ఆ రోజులలో నాడీ క్రంథములో నన్ను గురించి తెలుసుకున్న కొన్ని విషయాలు నా జీవిత ధోరణిని వింతగా మార్చి వేశాయి అనీ ఒప్పుకోక తప్పదు. కొన్ని అనివార్యమైన కారణాలవల్ల అప్పటి నా కుటుంబ వ్యవస్థలో అల్లకల్లోలము ప్రబలుతోన్న రోజులవి. కాని, విశ్వప్రయత్నముచేసి, పడిపోనున్న పేకమేడ పడిపోకుండా పదిలపరచి ఉండవచ్చు — ఈ నాడీ గ్రంథముద్వారా కొన్ని విశేషాలు తెలిసికొని కొన్ని ఆకర్షవంతమైన ఊహలు ఊహించకుని ఉండకపోతే నేను ఎల్లాగైనా ఆ గృహచ్ఛిద్రాన్ని అరికట్టి ఉందునేమో. ఎటువంటి పరిస్థితులలోనూ మనస్సు చెప్పిన తీరునగాక హృదయము సూచించిన తీరునే నిర్ణయిస్తాను నేను, అని అప్పటికే స్నేహితులందరూ అనేవారు. ఈసారి నా వ్యక్తి ధర్మాన్ని పాటింపవలసిన అగత్యం చాలా ఉంది. అలా చేసివుంటే నా కుటుంబజీవనము నిలబడివుండేది. అలా చేయక హృదయానికి ఎక్కువ ప్రాధాన్య మిచ్చాను. ఈప్రకృత్వథావికి నాడీ పఠనము దోహదమిచ్చింది.

ఇక మార్చడానికి వీలులేనంత ఖండితమైన నిర్ధారణకు వచ్చిన నేను ఆ సాయంత్రం బెజవాడ చేరడానికి గోదావరి దాటుతున్నాను. జరిగిన విషయాల గురించి నెమరువేస్తున్న నా మనస్సులో వేదుల మాటలు జ్ఞాపకము వచ్చాయి :

## సాగుతున్న యాత్ర

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగు విషయంబులను దటస్థముగ నా య
నంత గగనమునం దుండి యరయుచుండు
తారలై, మదశ్రుకణముల నేరుకొనియె;

నేనె మిగిలితి నీ గౌతమీనదీ ప
విత్ర గర్భంబులో మ్రోత పెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్ర దుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ !

# ౧౬

కుల్లా యుంచితి, కోక జుట్టితి, మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టయున్ మెసవితిన్ విశ్వస్థ వర్ధింపగన్
చల్లా యంబలి త్రావితిన్ రుచులు దోసంబంచు బోనాడితిన్
తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మీ ! దయలేదా నేను శ్రీనాథుడన్ !!

కవిసార్వభౌముడు పడినన్ని పాట్లూ పడుతున్నాను, ఈ ఒక్క ఇన్సూరెన్స్ పాలసీ కోసమూ ! ఈ ఒక్క పాలసీ కోసము, సెక్రటరీనైన నేను ఇంతగా ప్రయాస పడనక్కరలేదు. అది ఏజంట్లపని. కాని ఈ జమీందారుగారి పేరు మా జాబితాలలో ఉంటే అది మా కంపెనీకి గొప్ప అనీ, వారిని బట్టి వారి వంటివారు ఇంకా కొందరు మాకంపెనీలోజేరుతారేమోననీ ఈ విశ్వప్రయత్నము.

జమీందారుగారు చాలా మంచివారు. సౌజన్యశీలురు ఆయన. మాకిద్దరికీ మొదట యెలా పరిచయమైనదో జ్ఞాపకం లేదుగాని, మొదటి నుంచీ నేనంటే ఆయనకు ఎంతో ప్రీతి. కాని, ఇన్సూరెన్స్ పని మీద నేను వారి వద్దకు వెళ్ళడం ఏదో ఎబ్బెటుగానే తోచింది నాకు. నేను ఊళ్ళోకి వస్తున్నానని తెలిసి ఆయన నేను వారి బంగాళాలోనే బస చెయ్యాలని పట్టుపట్టి, స్టేషన్‌కి నా కోసము వారి గుర్రపు సార్ట్ పంపారు. ఆ రోజులలో కాకినాడ గుర్రపుసార్టులకు ప్రసిద్ధి. కార్లు ఉన్నా, సంపన్నులు, దూరపు ప్రయాణాలకు మాత్రము కార్లు ఉపయోగిస్తూ ఊళ్లో ఎక్కడకు వెళ్ళవలసి వచ్చినా గుర్రపు బండిలోనే వెళుతుండేవారు. ఎంతో ఠీవిగా ఉంటుంది అందమైన గుర్రములాగే కోచ్‌బండి. కుచ్చు తలపాగాతో బండితోలే కోచ్‌మన్, వెనుక నుంచిని జనాన్ని తప్పుకోమని అదలకించే జవాను, ఎంతో హుందాగా ఉంటుంది. నాకు చాలా ఇష్టము ఇటువంటి కోచ్‌లో

వెళ్ళడము. ఇప్పటికీ అనుకుంటూ ఉంటాను నాకు అటువంటి కోచ్ కావాలని. అదీ, చిన్నప్పుడు నాకు పంచకళ్యాణి గుర్రమని ఒక గుర్రాన్ని చూపారు, స్వచ్ఛమైన తెలుపు — కాని, నాలుగు మోకాళ్లకును కొస్త క్రిందుగా, ముఖాన, గోధుమ రంగుగా ఉంటుంది. మెడ బలే ఠీవిగా ఉంటుంది. ఇక ఆగుర్రపు కళ్ళు ఉంటాయి ఎంతో అందంగా. ఇటువంటి గుర్రముగల కోచ్‌లో తాపీగా షికార్ వెళ్లాలని నా కోరిక.

కోచ్ నుండి దిగిన నన్ను, నా రెండు చేతులూ తమ చేతుల లోనికి తీసుకుని ఆహ్వానించారు సూర్యనారాయణ. ఆయన ఎక్కువ మాట్లాడరు. కాని, మనచేత మాట్లాడిస్తారు అడుగడుగునకూ ఏదో ప్రశ్న వేసి. మేడ మీదికి తీసుకు వెళ్లి నా కోసము తయారుచేసిన గది చూపించారు. ఎంతో బాగుంది. క్రిందంతా చలువరాయే! కిటికీలోంచి వారి తోట కనిపిస్తుంది. ఎక్కడెక్కడ నుంచో తెప్పించివేశారు అపురూపమైన మొక్కలు. గదిలో కుర్చీలు, బల్లలు, సోఫాలు అందమైనవి. చక్కగా అమరిఉన్నవి. సూర్యనారాయణ నాలాగే దివ్యజ్ఞాన సమాజానికి చెందినవారు. తరుచు, అడయార్ వెళ్లి వస్తూఉంటారు. ఆ వాతావరణం అనుభవించి, అచ్చటి అలవాట్లు, కొన్ని అమరినవి వారికి. చాలాసేపు మాట్లాడుకున్నాము అడయార్ విశేషాల గురించీ, అచ్చటి ప్రముఖులను గురించీ.

మరునాడు ఉదయమే చాలా వేకువనే లేచి, తోట అంతా ఒకసారి తిరిగి వచ్చి, స్నానానికని, చలువరాయితాపిన నీళ్ళగదిలోకివెళ్లాను. అద్భుతంగా అమరి ఉంది. ఈ గది ప్రక్కనే డ్రస్సింగ్ రూమ్ అందమైన శృంగార మేజాతో. ఆ రోజులలో మన ఇళ్ళలో ఇంకా అపురూపము షవర్‌బాత్. ఆ షవర్‌బాత్‌ను ఇక్కడచూచి సంతోషించాను. షవర్ క్రింద స్నానము ఎంతో హాయిగాఉంటుంది. సూదులలా ఆ చన్నీరు తగులుతూ ఉంటే అదో వింత అనుభవము. నాగదిలోకి వచ్చి, బట్టలు తీసుకోబోతూ ఉండగా, జవాను వచ్చి దొరగారు రమ్మంటున్నారు అన్నాడు. నేను అతని వెనుకనే వెళ్లాను.

గుమ్మంలో కోచీ నిలిచిఉన్నది. సూర్యనారాయణ పేపర్ చదువుతూ పేపర్ లోని ఏదో విషయంగురించి నన్ను ప్రశ్నించారు. మేము ఆ మాటలలో ఉండగా వంటమనిషి కాఫీ తెచ్చిఇచ్చాడు—చల్లార్చి వెండిగ్లాసులతో. మేము కాఫీ ముగించే సరికి ఇందాకటి జవాను నేను బల్లపై ఉంచిన నా బట్టలు, జమీందార్‌గారి తుండు గుడ్డ, ఒక జత పంచలూ వగైరా తెచ్చి కోచ్‌లో ఉంచాడు. సూర్యనారాయణ నావైపు చూచి "రండి, వెళదాము." అన్నారు.

ఆ వెళ్ళడము చామర్లకోట వెళ్ళేరోడ్డు మొగకు కాలువ ఒడ్డుకు. కాలువ గట్టున కోచ్ ఆగింది. ఆయన దిగి, నన్ను దిగమన్నారు. అటునించి వచ్చి కోచ్‌మాన్ మా బట్టలు పుచ్చుకుని నీటి ఒడ్డుకు వెళ్లాడు. నీరు క్రొత్త నీరు, ఎఱ్ఱగా ప్రవహిస్తోంది.

"ఉదయమే ప్రవాహపు నీటిలో స్నానం చాలా మంచిదని మీ నాన్నగారు చెప్పారు. రండి." అంటూ కాలువలోకి దారి తీశారు ఆయన. నేను ఒక క్షణం అనుమానిస్తూఉంటే "ఇంటికి వెళ్లాక మళ్ళీ స్నానం చేద్దురుగాని" అని మరీ బల వంతం చేశారు. నాకు అట్టే ఇష్టంలేదు. కొలాయిగుడ్డ కట్టుకుని అంచరిలో ఇంత బహిరంగంగా ఆ ఎఱ్ఱని నీటిలో మునుగడము. కాని తప్పింది కాదు. కార్యార్థిని నేను, మరి. ఇంటికి వచ్చి, ఆయనతో కూడా బస్కీలు, ఎలక్ట్రిక్ మసాజ్ ఇటువంటి వ్యాయామంకూడా చేశాను—శరీరవ్యాయామంటే ఛీదరించుకునే నేను!

ఆ సాయంత్రం సూర్యనారాయణతో బిలియర్డ్స్ ఆడుతూ — నాకంత బాగా రాదు, వారికి బాగా వచ్చును ఈ ఆట — మెల్లిగా, ఇన్సూరెన్స్ ప్రస్తావన తెచ్చాను. మద్రాస్ ప్రాంతానికంతా మా నాన్నగారు మానేజింగ్ డైరెక్టర్‌గా ఉన్న మా సంస్థకు తెలుగుజిల్లాలకు నేను సెక్రటరీగా ఉన్నాననీ, ఈ ప్రాంతాలలో మా కంపెనీ అభివృద్ధిలోనికి రావాలంటే సూర్యనారాయణ వంటివారి సహా యమూ సానుభూతీ అత్యవసరమనీ, వారి ఆస్తినిబట్టి వారికి ఇన్సూరెన్స్ పాలసీ

అంత అవసరం కాదని తోచినా, నన్ను ప్రోత్సహించే నిమిత్తం ఒక పాలసీ తీసుకుంటే నాకూ, నాన్నగారికీ కూడా చాలా సంతోషకరంగా ఉంటుందని చెప్పాను. నామాటలు శ్రద్ధతో విన్నారు ఆయన. కాని, నేను చెప్పి ముగించి నంతనే చిరునవ్వు నవ్వి మళ్లా ఆటలో నిమగ్నులై పోయారు. "ఇదిగో! ఈ 'పొజిషన్' లో అతి చమత్కారంగా ఆడవచ్చు !" అంటూ బిలియర్డ్స్ ఆటలో వారు అలవరుచుకొని ఉన్న ప్రావీణ్యతను నా కొరకు ప్రదర్శించారే గాని, నా ఇన్సూరెన్స్ ప్రస్తావన గురించి ఏమీ అనలేదు ఆయన.

ఆ రాత్రి వారితో కూడా నాటకానికి వెళ్లాను నేను. కంఠాభరణము. నాకు స్టేజి నాటకాలంటే తలనొప్పి. రచన పానుగంటివారిదైనా, ఆ వాతావరణ, ఆ గల్లంతు, ఆ గొంతుక చీల్చుకోవడము నాకు ఏమాత్రమూ కిట్టదు. కాని, సూర్యనారాయణగారితో వెళ్ళక తప్పింది కాదు. మాతో కూడా వారి అనుచరులు మరి ఇద్దరు వచ్చారు. వారిద్దరూ మా వెనుకవరుసలో కూర్చున్నారు. నటుల ఫేస్ పౌడర్ ముఖాలు దిష్టిబొమ్మలలా కనిపించాయి అంత దగ్గరనుంచి. జోగినాధము అనుకుంటా, సుబ్బిసెట్టి పాత్ర నిపుణతతో నిర్వహించి అందరిని కడుపుబ్బ నవ్వించారు. అక్కడక్కడ చమత్కారంగా కన్పించినా ఈ హాస్యము నాకంత గొప్పగా కనిపించలేదు. 'సోడా ! అనే కేకలు, ఆ సోడా సీసా తెరచేటప్పుడు కీచుమనే ఆ వివరీతపు ధ్వని, పిల్లల ఏడ్పులు — ఈ వాతావరణలోంచి ఎప్పుడు బయటపడదామా అనిపించింది.

మరునాడు నాలుగైదు సెట్లు టెన్నిస్ ఆడాను జమీందారుగారితో. ఈ ఆట నాకు ఒక కొంత బాగావచ్చును. అంటే, బక్కపలచగాను, పొడుగ్గాను ఉంటాను కాబట్టి ఎదుటివారు పంపే బంతులను నెట్ వద్ద నుంచే, తీవ్రంగా 'స్మాష్' చేస్తూ ఉండేవాడను. ఇది సూర్యనారాయణగారికి ఎంతో ఆనందంగాఉండేది. ఊళ్లో ఉన్న తన స్నేహితులకు కబురుచేసి, వారిని నాతో ఆడమని, ఆ వింత చూస్తూ సంతోషించేవారు — ఆయనా ఆడుచూ ఉండేవారు మాతో.

రోజూ నన్ను వారితో కూడా క్లబ్‌కి తీసుకువెళ్లేవారు. క్లబ్‌లో వారి స్నేహితు లందరికీ నన్ను పరిచయపరచేవారు. కాని, నాకు ఆక్లబ్ వాతావరణ అట్టే నచ్చేదికాదు. వారికోసం ఎంతోసేపు ఆ వాతావరణంలోనే ఎలాగో అలా ఉండిపోయేవాడను.

మత విషయాలలో సూర్యనారాయణగారికి చాలా ఆసక్తి. ఆ రోజులలో తోటపల్లి ఆశ్రమంలో ఉన్న శ్రీ ఓంకారనాధస్వామి కాకినాడ వచ్చారు. వారితో కూడా ఒక అమెరికన్ భక్తురాలున్నూ వచ్చారు. వీరిద్దరూ జమీందార్‌గా రింటనే బస. ఆ అమెరికన్ భక్తురాలితో మాట్లాడుతూ, మన దేశం గురించీ మన సంప్రదాయాల గురించీ ఆమెకు తెలియజేయడానికి సూర్యనారాయణగారు నన్ను నియమించారు. ఓంకారనాధస్వామి కాకినాడలో సభలుచేసి అక్కడనుంచి తుని వెళ్లారు. వారితో తుని వెళ్లుతూ నన్నుకూడా తీసుకువెళ్ళారు జమీందార్‌గారు.

తుని నించి వచ్చాక జమీందార్‌గారితో మళ్లా ఒకపర్యాయం ఇన్సూరెన్సు మాట ఎత్తాను. ఈసారి ఆయన అన్యాసక్తులై ఉండకుండా నా మాటలు సావధానంగా విన్నారు. నన్నడిగారు ఆయన : "నే నొక పది వేలకు ఇన్సూర్ చేస్తే మీ కెంత కమీషన్" అని. నే నన్నాను : "కమీషన్ విషయమై కాదు, మీ అంటి వారు మా సంస్థలో ఉంటే అది మాకు ఒక గౌరవము. నేను ఈ సంస్థకు ఈ ప్రాంతాల ఆఫీస్‌కు సెక్రటరీని కాబట్టి నా కిది చాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది" అన్నాను.

"మీ కెంత జీతం" అన్నారు ఆయన.

"నెలకు నూట డెబ్బది ఐదు" అన్నాను నేను.

వెంటనే అన్నారు ఆయన : "నెలకు రెండు వంద లిస్తాను, నాతోనే ఉండిపొండి మీరు ! మీరు రెండు మూడుసార్లు అన్నారు ఎవరికైనా సెక్రటరీగా

ఉండాలని ప్రయత్నించారని. ఇక్కడ పనికూడా అట్టే ఉండదు. మీరు నాతో ఉంటే నా కెంతో సరదాగా ఉంటుంది" అని.

నాకు ఏమనాలో తెలియలేదు. ఆయన నా యందలి స్నేహభావంవల్ల, నేను సదా వారితోనే ఉండాలి అనే కోరికవల్ల, నాకీ ఉద్యోగాన్ని ఇయ్యాలనుకున్నారు. ఎంత మంచి హృదయం వారిది! కాని అంత జీతానికి తగినంతగా చేయగలిగినంత పని లేదు నాకు. ఊరికే పుచ్చుకుంటూ ఉన్నట్టు, ఉంటుంది. అది ఏమి బాగుంటుంది అనుకుని, వారితో అన్నాను: "మీరు చాలా దయతో మాట్లాడుతున్నారు. నేను మా నాన్నగారి కోసం ఈ ఉద్యోగంలో ఉన్నాను. వారు చేస్తున్న పనికి కొంత తోడుగా ఉన్నాననే సంతుష్టి ఉన్నది ఈ పనిలో" అని.

మరునాడు నేను బెజవాడ వచ్చివేశాను. బయలుదేరేముందు ఇన్సూరెన్సు మాట ఎత్తలేదు కాని, మరి ఒక ఏడాది ఐనాక, ఈసారి కాకినాడ వెళ్ళినప్పుడు అక్కడ ఉన్న మా ఏజంట్‌ను తీసుకువెళ్లాను జమీందార్‌గారి వద్దకు. పిల్లలుగలవాడు, మిమ్మలను కనిపెట్టుకున్నాడు. మీరు దయతలచి ఒక పాలసీ ఇస్తే అతనికెంతో మేలు చేసినవారవుతారు అని నచ్చచెప్పి వారిచేత ఒక పదివేలకు ఇన్సూర్ చేయించాను మా ఏజెంట్ చేసే బిజినెస్‌తో కలిసి వచ్చేటట్టు. ఆ పాలసీ బాపతు సాలీనా ప్రీమియమ్ చెల్లిస్తూ ఆయన అన్నారు: "ఈ సొమ్ముకు వడ్డీ నష్టమే మాకు. మీ రన్నారు కాబట్టి ఈ పాలసీ తీసుకుంటున్నాను. కాని ఇది మా వంటివారికి కాదు, నెల జీతము తీసుకుంటూ, ఏ నిమిషము ఏమై, ఆ జీతము ఆగిపోయి, కుటుంబానికి ఇబ్బంది ఏర్పడుతుందో అనే భీతి కలవారికే ఈ సదుపాయము. మా వంటివారి కెందుకు!" అన్నారు.

ఎలాగైతేనేమి సాధించాను. అందుబాటులో చక్కని షవర్‌బాత్ ఉండగా, బురదనీటిలో స్నానమూ, జన్మలో అలవాటు లేని శరీర వ్యాయామమూ బిలియర్డ్స్ ఆటా టెన్నిస్ పందాలూ తలనొప్పివచ్చే స్టేజ్ నాటకమును చూడడమూ

ఇష్టంలేని క్లబ్ వ్యాపకమూ మత ప్రచారకుల శుశ్రూషా — ఇవన్నీ చేశాను. అయితే, ఆయన చాలా మంచివాడు. నేనంటే నిజంగా ఎంతో ప్రేమ ఆయనకు. అందుచేత ఇన్సూరెన్స్ విషయం కాకపోయినా, ఆయనతో స్నేహం కొలదీ ఐనా, నేను అవన్నీ చేసి ఉందునేమో ఆయన కోసం!

బెజవాడలో ఉండగా ఒక రోజున చెల్లెలు కొమర్రాజు అచ్చమాంబ కబురు చేసింది : "నా స్నేహితురాలు కుమారి ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళుతోంది. ఆమెను స్టేషన్‌లో చూడాలి, నీ కార్‌లో నన్ను స్టేషన్‌కు తీసుకువెళతావా ?" అని. స్టేషన్ చేరే లోపుగా అచ్చమాంబ చెప్పింది కుమారిని గురించి. తనతో కాలేజ్‌లో చదుపుకొనిన ఆమె, టీచర్ పరీక్ష ప్యాసై ఆ ఉద్యోగంలోనే ఉండి, రాజకీయ కృషిలోకి దిగినదనీ, కాంగ్రెస్ కమిటీ సభ్యురాలుగా ఢిల్లీ వెళ్ళుతున్నదనీ, కుమారి రూప విశేషాలను గురించీ, ఆమె గుణగణాలను గురించీ అచ్చమాంబ చాలా ఎక్కువగా చెప్పింది.

ప్రఖ్యాత ఆంగ్లేయ చిత్రకారుడు బర్న్‌జోన్స్ చిత్రించిన ముఖంలా కనిపించింది నాకు కుమారి ముఖం. బర్న్‌జోన్స్, రోసెటీ, వీరి స్త్రీ మూర్తులను ఇట్టే ఆనవాలు పట్టవచ్చును. ముఖం పూర్తిగా గుండ్రంగా ఉండక, కాస్త కోలగా ఉంటుంది — ఎంతో అందంగా. అతి విశాలమైన నెన్నుదురు, చారెడేసి కళ్ళు, ఇంత తలకట్టు ! చెంపకుచేర్చి దువ్వటవల్ల ఏదో వింత అమాయకత్వం రాణిస్తూ ఉంటుంది. కుమారి మాటా అంత సౌజన్యం వెల్లువారుతూనూ ఉన్నది. అచ్చమాంబతో ఏదో చెపుతూ చటుక్కున చిరునవ్వు నవ్వేది ఆమె — ఎంతో స్నిగ్ధ లావణ్యము విరిసేది, ఆ చిరునవ్వులో.

ఎంతోసేపు ఉంటుందనుకున్న రైలు ఇట్టే వెళ్ళిపోయినట్టు తోచింది కాని, అచ్చమాంబ చెప్పింది : ఢిల్లీలో సభలు పూర్తి ఐనాక తిరిగి వచ్చేటప్పుడు బెజవాడలో దిగి, ఒక రోజైనా ఉంటానని మాట ఇచ్చింది కుమారి అని. ఇంటికి వెళ్లేవరకు, కుమారిని గురించి పొగుడుతూనే ఉన్నది అచ్చమాంబ.

ఢిల్లీసభా కార్యక్రమాలను అన్నిటినీ పూర్తి చేసుకొని బెజవాడ వచ్చింది కుమారి. ఆమె కొండపల్లి చూచి ఉండదు. కొండపల్లి ఎంతో అందంగా ఉంటుంది ఈ సమయంలో, తీసుకు వెళదామన్నాను. "లేదు; వ్యవధిలేదు, నేను ఉండడానికి వీలుకాదు రేపు స్కూలువేళకు అందుకోవాలి తప్పదు" అన్నది ఆమె. బెజవాడకు ఓ డెబ్బదిమైళ్ళ దూరాన గర్ల్స్‌స్కూలుకి ప్రిన్స్‌పాలుగా పనిచేస్తున్నది కుమారి. పోనీ ఊరు చూద్దామని, అందమైన నా టూసీటర్ స్ట్రాయన్‌లో తీసుకు వెళ్లాను అచ్చమాంబనూ, కుమారినీ. గులాబీ పువ్వులు కొని ఇద్దామని బజారులోకి తీసుకువెళ్లాను. కుమారి అన్నది: "అన్నట్టు నేనో అద్దం కొనుక్కోవాలి. ఢిల్లీలో నా అద్దం పారవేసుకున్నాను" అని. చటుక్కున కార్ ఆపి షాప్‌లోకి వెళ్ళి ఉన్న అద్దాలలోకల్లా చాలా మంచి అద్దము కొని తెచ్చి ఇచ్చాను.

అద్దాలలో చాలారకాలు ఉంటాయి. ప్రశస్తమైన అద్దమును ఏరడము అదీ ఒక కళే. కొన్ని అద్దాలలోకి చూస్తూ ఉంటే ఎవరో క్రొత్తవాడు మనలను పలుకరిస్తూన్నట్టు ఉంటుంది. కొన్ని అద్దాలు మనకు లేని సొబగును కలిగిస్తాయి. కొన్ని అద్దాలు మాత్రం ఉన్నది ఉన్నట్టు చూపుతూ, చక్కని వెలుతురును అందిస్తూ ఉంటాయి ముఖానికి.

నే తెచ్చి ఇచ్చిన అద్దాన్ని చూచి వారిద్దరూ మురిసిపోతున్నారు. ఆ వ్యవధిలో నేను పల్లా అంగడికి వెళ్ళి ఇంత మంగుళూరు కుంకుమ తెచ్చాను. మంగుళూరు కుంకుమ నాకు చాలా ఇష్టము. ఈ కుంకుమలోనూ చాలా రకాలుంటాయి. చూచి తీసుకురావాలి. పైగా, ఎవరు వాడుతారో వారి ముఖవర్చస్సుకు తగినట్టు దోర రంగో, లేత రంగో చూచి తీసుకోవాలి. నే తెచ్చి కుమారి చేతిలో ఉంచిన కుంకుమ పొట్లం విప్పిచూచి అచ్చమాంబ అన్నది: "చూచావా! ఇన్నాళ్ళ నుంచి ఈ ఊళ్లో ఉంటున్నాను—ఒక్కసారైనా, ఇంత మంచి కుంకుమ తెచ్చి ఇచ్చాడా, చెల్లాయీ ఇతగాడు! అని? నువ్వంటే ఎందుకూ ఇతనికి ఇంత పక్ష

పాతము !" అని, తెచ్చిపెట్టుకున్న రోషంతో. కుమారి చిరునవ్వు నవ్వి, పర్స్ తీసి సొమ్ము ఇవ్వబోయారు.

"అబ్బే ! ఈ మాత్రానికేనా !" అన్నాను నేను. ఆమె అచ్చమాంబ కేసి చూశారు. అచ్చమాంబ నవ్వుతో అన్నది : "ఇంతటితో ఐందీ ! ఓ వంద గులాబీ పువ్వులు నీ ఒళ్లో పోస్తేనేకాని అతనికి తృప్తి ఉండదు—అతనిని నువ్వు ఇంకా ఎరుగవు!" అని, ఆమె అన్నట్టుగానే కాస్త ముందుకు వెళ్లాక కార్ ఆపి, ఇన్ని గులాబీ పువ్వులు కొనిఇచ్చాను వా రిద్దరికీని.

కుమారిని రైలు ఎక్కించడానికి వచ్చాను స్టేషన్‌కి. పేషంట్లు వచ్చేవేళ, నేను రాను, అని అచ్చమాంబ ఉండిపోయింది ఇంటి వద్దనే. మేము స్టేషన్ ఆవరణలోకి చేరుతూ ఉండగానే రైలు వచ్చింది. మేము తొందరపడవలసి వచ్చింది. ఆమె పర్స్ తీసి ఇంటర్ క్లాసుకు కావలసిన పైకము నా చేతిలో ఉంచి "చప్పున వెళ్ళి మీరు టికెట్ కొనండి. నేను మీ వెనుకనే వస్తాను" అన్నది.

సెకండ్‌క్లాస్ టికెట్ కొని, రైలు వద్దకుజేరి, లేడీస్ సెకండ్ క్లాస్ పెట్టె తలుపుతీసి, తలుపును పట్టుకుని నుంచున్నాను నేను.

తొందర తొందరగావచ్చి ఆమె బండిలో ఎక్కి కూర్చున్నారు. ఆమె కాస్త సేదతీర్చుకున్నాక, టికెట్ ఆమె చేతిలో ఉంచినప్పుడు అన్నారు "ఇదేమిటి !" అని. అప్పుడు కాని, ఆమె చూచుకోలేదు, నేను ఆమెను సెకండ్ క్లాస్‌లో ఎక్కించానని. మళ్ళీ అన్నారు ఆమె "సెకండ్ క్లాస్ ఎందుకు కొన్నారు !" అని.

"మీరెప్పుడూ సెకండ్ క్లాస్‌లోనే వెళ్ళాలి." అన్నాను, ఆమెకు చెప్పగల స్వతంత్రం నా కున్నట్టు. కాని, నా ఉద్దేశ్యం అంతే : ఒక అంతస్థున ఉంటూన్న మనం ఎలాగో పీలు చేసుకుని సెకండ్ క్లాస్‌లోనే వెళ్లాలి — ఎప్పుడూ పరి

శుభ్రమైన బట్టలు కట్టుకుంటూ, పరిశుభ్రమైన పరిసరాల్లో ఉంటున్నాము కాబట్టి. మరేదైనా ఖర్చు తగ్గించుకుని అవసరమే, సెకండ్ క్లాస్‌లోనే ప్రయాణంచెయ్యాలి, అని నా అభిప్రాయం.

అపసేపు సొమ్ము నా చేతికి ఇయ్యబోయారు ఆమె. నేను తీసుకోలేదు. ఆమె బలవంతం చెయ్యలేదు. కాని, "మీరు నాకోసం చాలా శ్రమ పడ్డారు" అంటూ చిరునవ్వు నవ్వారు. ఆ చిరునవ్వుకు ఎన్ని గులాబీ పువ్వులైనా ఇయ్య వచ్చు........రైలు వెళ్ళిపోయింది.

తరువాత, పత్రికలో వచ్చింది పార్లమెంటరీ కమిటీవారు ఆమెను శాసన సభకు అభ్యర్థినిగా నియమించారని. పేపర్‌లో ఈ విషయం చదివిన నేను ఆ మధ్యాహ్నమే వారి ఊరు బయలుదేరాను. చెల్లెలు అచ్చుహాంబతో చెప్పడానికి వ్యవధి లేదు. కృష్ణ వచ్చి ఉండడమువల్ల నా కార్‌లోగాక, రైలులోనే వెళ్లాను.

సాయంత్రానికి ఆమె బస చేరాను. ఆరోజు వారి పాఠశాల వార్షికోత్సవము, బడి పిల్లలతో కలిసి, ఊరికి ఒక క్రోసు దూరాన ఉన్న తోటలో జరుగుతున్న ఉత్సవంలో ఉన్నారు ఆమె. ఆమె వచ్చేవరకూ కనిపెట్టుకున్నాను.

నన్ను చూచి ఆమె ఆశ్చర్యపోయారు "ఇదేమిటి, ఇలా వచ్చారు!" అని. "పేపర్‌లో ప్రకటన చూచి వచ్చాను" అన్నాను

"అదా! నన్ను అభినందించడానికి వచ్చారా! మీకు నేను చాలా కృతజ్ఞు రాలిని" అన్నారు.

నే నన్నాను: "అభినందించడానికి రాలేదు నేను. రాజకీయ వ్యవహారాల నుంచి మీరు విరమించుకోవాలి అని చెప్పడానికి వచ్చాను" అని.

ఆమెకు అర్థం కాలేదు. ఎవరికోగాని ఇంత మంచి అవకాశము రాదు. అటువంటి గొప్ప అవకాశం ఆమెకు లభించినపుడు నేను ఆమెను వారింప ప్రయత్నించడం ఆమెకు అర్థం కాలేదు.

నేను నా అభిప్రాయం చెప్పాను: "రాజకీయాలు మీ వంటి వారికి కాదు. అందుకు ఇతరులున్నారు. అసలు మీ వంటివారు ఉద్యోగాలు చెయ్యకూడదు" అని.

"మరేం చెయ్యాలి?" అన్నారు ఆమె.

నాకు తెలుసు కస్తూరి వంటివారు ఏమిచెయ్యాలో. నాఅభిప్రాయంలో, అంత కత్తె లనతగినవారు, కొంత సంస్కారము అలవరచుకున్నవారు చక్కగా తమకు ఇష్టం వచ్చిన, అన్నివిధాల తమకు అనుకూలమైన, సంబంధం చూసుకు పెళ్ళి చేసుకోవాలి. చక్కని ఇల్లూ, వాకిలీ అమర్చుకుని కళకళ్లాడుతూ సంసారం గడపాలి. రత్నమాణిక్యాలలాంటి పిల్లలను కని, చూచేవారికి కన్నుల పండువగా ఉండాలి. ఇటువంటి కుటుంబాలతో విలసిల్లిపోవాలి మన దేశము.

కాస్త ధైర్యంతెచ్చుకుని, ఎంతో చనువుతో ఈ అభిప్రాయాలన్నీ ఏకరువు పెట్టాను ఆమె ముందు. ఆమె ఓపికతో విన్నారు. కాస్సేపు నిశ్శబ్దంగా ఉండి ఆలోచించారు కూడాను. కొంతసేపటికి అన్నారు:

"మీరు చెప్పినదాంట్లో చాలా సబబు ఉండవచ్చును. కాని, నాకు శాసన సభలో పని చెయ్యాలని ఉన్నది గట్టిగా. ప్రస్తుతం అది చాలా ముఖ్యమైన కార్యక్రమం," అని.

ఆమె ఇంకా ఏమో చెప్పాలి అనుకున్నారు కాని, మళ్లా మనస్సు మార్చుకున్నట్టు తోచింది. "మీరు చాలా శ్రమపడి వచ్చారు. మీకు నా కృతజ్ఞత ఎలా తెలపాలో తెలియడం లేదు." అన్నారు.

## సాగుతున్న యాత్ర

నేను లేచాను. ఆమెతో వాదించి లాభంలేదని తోచింది. పైగా, నేనెవరిని, ఆమె భావిజీవితాన్ని గురించి కలుగజేసుకోడానికి! ఆమెవద్ద సెలవు దీసుకుని వచ్చివేశాను.

కాని, ఆమె ఉండవలసినంత సంతోషంగా ఉన్నట్టు తోచలేదు. అదేమిటో, అలా ఒంటరిగా ఏదో పనిలో ఉన్న స్త్రీలను, ఎంత పెద్ద ఉద్యోగంలో ఉన్నవారినైనా సరే, చూచినప్పుడల్లా, నా మనస్సులో ఏదో బెంగ కలుగుతుంది. వీరి జీవితము అసంపూర్ణ జీవితము. భర్త, ఇల్లు, పిల్లలు — ఇవి ముఖ్యము. ప్రతి స్త్రీకి విద్య అవసరమే. కాని, అది జీవనోపాధి నిమిత్తం గాదు. స్త్రీ ఉద్యోగంచేసి, కుటుంబాన్ని పోషించడము నా కెంతోకష్టంగా ఉంటుంది అప్పుడూ ఇప్పుడూకూడా. మగవారుండగా వారెందుకు కష్టపడాలి!

తిరిగి వస్తూన్న నేను కుమారిని గురించి మరీ మరీ అనుకున్నాను. ఢిల్లీకి వెళుతూ ఆమె నాకు మొట్టమొదటిసారి కనిపించినప్పటి దృశ్యమును, మరీ మరీ జ్ఞాపకం చేసుకున్నాను. అప్పుడు అనుకున్నాను, కవి కృష్ణశాస్త్రి మాటలలో, ఇలా:

ఆమె కన్నులలో ననంతాంబరపు
నీలి నీడలు కలవు;

విశ్వమలాంబ

పూర గంభీర శాంతకాసార చిత్ర
హృదయములలోని గాటంపు నిదుర
ఛాయలందు నెడ నెడ గమ్మ్రక్

## సాగుతున్న యాత్ర

సంధ్యావసాన
సమయమున నీపశాఖికాగ్ర
పత్రకుటిల మార్గముల లోపల
వసించు ఇరుల గుసగుసల్ వానిలో
నిప్పుడు నపుడు వినబడుచునుండు;

మరికొన్ని వేళలందు
వానకారు మబ్బుల మెయివన్నె వెనుక
దాగు బొమ్మమ్ము లామె నేత్రములలోన
బొలచుచుండును;

ఎదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించు కాని అర్థమ్ము కాని
భావగీతమ్ము లవి.........

ఈ నా ప్రయాణ విషయము పూస గ్రుచ్చినట్లు చెల్లెలు అచ్చమాంబతో చెప్పాను మరునాడు ఉదయాననే. సాంతమూ విని, ఆమె అన్నది;

"నీవు పిచ్చివాడవని తెలుసు. కాని, ఇంత పిచ్చివాడ ననుకోలేదు నేను!" అని.

# సాగుతున్న యాత్ర

కాదు మరీ, తగుమరమ్మా అంటూ, ఇతరుల జీవితాలలో కలుగజేసుకోవటం పిచ్చి కాదూ? కాని, వసుధైక కుటుంబము అని గట్టిగా నమ్మినవారికి ఇది పిచ్చిగా తోచదు.

చిత్రం ఏమిటంటే, కుమారి శాసనసభలో చేరి, చాలా గణింపతగిన కృషిచేసి మంచి కీర్తి సంపాదించుకున్నాడు. అంతే కాదు; మరికొన్నాళ్ళకు తనకు నచ్చిన ఆతనిని పెళ్ళి చేసుకుని ఉత్తమ గృహిణి అయ్యారు. ఆమె తొలిచూలు కనక నిగ్రహం, ముద్దులొలికే పాపాయి, తల్లి ఫోలికే కాని, ముఖం గుండ్రని ముఖం. కళ్ళు మాత్రం ఆ కళ్ళే! పాపాయి నవ్వితే రత్నాలు రాలుతాయి! దొండ పండువంటి చిన్నారి పెదవులు. ఎంతో అందంగా కబుర్లు చెపుతుంది.

# ౧౨

తులసీదళములచే సంతోషముగా బూజింతు
పలుమారు, చిరకాలము - పరమాత్ముని పాదముల
సరసీరుహ పున్నాగ చంపక పాటల కురవక
కరవీర మల్లికా సుగంధ రాజ సుమముల్
ధరనివి యొక పరిమాయము, ధర్మాత్ముని, సాకేత
పురవాసుని శ్రీరాముని, వరత్యాగరాజనుతుని
తులసీ దళములచే సంతోషముగా బూజింతు!

నరసారావుపేట ఊరిబయట, ఒక మూడు మైళ్ళ దూరాన రోడ్ ప్రక్కన ఏటి ఒడ్డున కూర్చొని డాక్టర్ మాధవాచారి భక్తిగానము వింటున్నాము మేము నలుగురము. త్రివేణీ సంపాదకులు కోలవెన్ను రామకోటీశ్వరరావు, వకీలు నడింపల్లి లక్ష్మీనారాయణ, కవి బెల్లంకొండ రాఘవరావు, నేను.

మాతో కూడా నాయని సుబ్బారావున్నూ ఉండవలసింది. ఆ పూట వారి బడిలో ఇన్స్పెక్షనో ఏదో, ఆయన రాలేకపోయారు మాతో కార్ షికారుకు మాధవాచారి అపరిమిత గానప్రియుడు. త్యాగరాజ భక్తుడు. ఆయనకు సంగీతకళలో ఎంత అసక్తి ఉన్నదంటే, ఉద్యోగరీత్యా ఆయన ఏ ఊళ్లో నాలుగు నెలల పాటుఉన్నా, ఆ ఊళ్లో గానసమాజాలు వెలిసేవి. ఆయన వద్దకు వైద్యంకోసం వచ్చినవారు తమ వ్యాధి మాట మరచిపోయి సంగీతము నేర్చుకోవడం మొదలు పెట్టేవారు. ప్రతివారికీ, కృషిచేస్తే తప్పక సంగీతము వస్తుందని మాధవాచారి దృఢమైన నమ్మకము. అసలు మాతో ఈ కార్ షికారుకు బయలుదేరే ముందు ఆయన ఒక షరతు పెట్టారు. మేము నలుగురమూ మాకు తోచిన ఏదో ఒకపాట పాడు

తామని ఒప్పుకుంటేనే మాతో షికారుకు వస్తానన్నారు ఆయన. ఏటి ఒడ్డుకు చేరాక ఈ షరతు కొద్దిగా మారి, నేను ఇంగ్లీష్‌లో ఒక పద్యం చదివాను. ఇదివరకు ఎప్పుడో రచించినది. బెల్లంకొండ రాఘవరావు ఏవో పద్యాలు చదివారు, నడింపల్లి వారు నృశింహశతకంలోది ఒక సీస పద్యం చదివారు. రామకోటేశ్వరరావు తనకు పాటలూ పద్యాలూ నేర్చుకోడానికి వ్యవధే లేదని, తన బదులు మాధవాచారే మరొక్క త్యాగరాజకృతి పాడాలనీ అన్నారు, ఒక్క కృతేమి! ఆ సాయంత్రం చాలా కృతులు పాడారు ఆయన. త్యాగరాజ హృదయాన్ని ఎంతో చక్కగా వ్యక్త పరుస్తూ. ఇది పాతిక ఏండ్ల క్రితం మాట. ఇప్పటికీ ఆ ప్రాంతాలలో సంగీత కళ ప్రస్తావన వచ్చినప్పుడల్లా గానకళాప్రియుడు, గానకళాపోషకుడు అని డాక్టర్ మాధవాచారి పేరు చెప్పుకుంటారు భక్తి ప్రేమలతో.

మరునాడు బెల్లకొండ రాఘవరావు ఇంట విందు, గోష్ఠి. నాయని సుబ్బారావు వచ్చారు. రామకోటీశ్వరరావు అక్కడే ఉన్నారు. నాయని సుబ్బారావును నేను కలసి కొని చాలాకాలమైంది. ఎప్పుడో మద్రాస్‌లో తుల్లంపల్లి వారింట గోష్ఠిలో కలుసు కున్నాము. ఆ తరువాత మళ్లా ఇన్నాళ్ళకు. అసలు నేను నా ఇన్సూరెన్స్ పర్యట నలో నరసారావుపేట వేసుకున్నది నాయనివారిని కలుసుకుందామనే ఉద్దేశ్యంతోనే రామకోటీశ్వరరావును అప్పుడప్పుడు మద్రాస్‌లో కలుసుకుంటూనే ఉండేవాడను.

నాయని సుబ్బారావు రచనకూ దేవులపల్లి కృష్ణశాస్త్రి రచనకూ కొన్ని పోలికలుండవచ్చును. కాని, వ్యత్యాసమూ చాలా ఉంది. వారి తరహాలూ అంతే. కొన్ని అంశాలలో వారిద్దరూ ఒకే మోస్తరు ఐనా, కొన్ని అంశాలలో చాలా చాలా తేడా ఉన్నది, ఇరువురిలోనూ ఒక దీక్ష, ఒక ఆరాధనా ఉన్నా వారి దృశ్యాలు వేరు; ప్రవర్తన వేరు. ఇద్దరూ నాకు చాలా ఇష్టమైనవారే కవులుగానూ, వ్యక్తులుగానూ కూడ.

నాయని సుబ్బారావు పద్యం ఒకటి నేను మరీ మరీ జ్ఞాపకం చేసుకునేది గాలిపటమును గురించినది. ఆ మాటలు, ఆ భావాలూ నాకు చాలా నచ్చాయి. అంతే

గాక, నా జీవితంలో కొన్ని సంఘటనలు జరిగినప్పుడు ఆ పద్యంలోని కొన్ని పంక్తులు ఎంతో ప్రస్ఫుటంగా జ్ఞాపకం వచ్చి, ఆ మాటలు అప్పటి నా మానసిక స్థితికి ఎంతో దగ్గరగా అన్వయించేవి :

...కండె చుట్టుచు దారమ్ము క్రమమ్ముగా త్వ
దీయ సామీప్యమునకు రావించి నన్ను
నీదు హృదయాంతరమున బంధింపు మంచు
వేడుకొనుచుంట లేదు. నీ వ్రేళ్ళ మధ్య
నలరు దారమ్ము తెంపకు మంతె చాలు ! !

ఆ గోష్టిలో నాయని సుబ్బారావు చదివిన మరో పద్యమున్నూ చాలా అర్ధవంతంగానూ, భావగర్భితంగానూ తోచింది నాకు ;

భాద్రపదమట ! విమలాభ్రపథము గ్రమ్మె
నీ వినీలాంబు దోద్గత మిమ్మె యఖండ
వర్ష ధారా ప్రవాహమ్ము వచ్చి వచ్చి
నా హృదయ గోళమున యందు నదులుగట్టె !

జీర్ణపవనుండ, నీ చలి చించుకొనెడు
నా కృశీభూత దేహమ్ము పైకి పొర్లు
నీ ప్రవాహ వేగము నిల్వనీదు నన్ను,
ప్రళయసూచన యేమొ నాప్రయాణమునకు !

అంతకంతకు దుర్వారమై, ధరిత్రి
యంతయును ముంచుకొను నశే, ఈ యకాండ

విలయ జలరాశి నా నిరుపేద జీవ
తరిత తనలోన నొక యణుకణము జేసి !
ఆ మహాక్రూర జలరాశి యందసంత
భంగము లుదగ్రగతుల నుప్పొంగు ననుము,
అచట, నా ప్రేమయను మర్రియాకు పఱచి,
నేను పవళించెదను, సుధానిభృతమూర్తి ! !

ఆ మహాప్రళయంలో తను అలా వటపత్రశాయి ఐ ఉండిపోవడము ఎంతో అందంగా కనుపించింది నాకు. బ్రహ్మాండమైన ఆ జలార్ణవంలో నా నిరుపేద జీవనం ఒక కన్నీటిబొట్టు!—చక్కని భావము.

బెల్లకొండ రాఘవరావు చాలా మంచివాడు. నిగర్వి. ఎంత నెమ్మది! ఎంత మర్యాద! ఎంత స్నేహభావము!! అన్నివిధాలా కోలవెన్ను రామకోటీశ్వరరావుకు తగిన స్నేహితుడు రాఘవరావు. త్రివేణికోసం చాలా పాటుపడ్డారు ఆయన.

త్రివేణే రామకోటీశ్వరరావో, రామకోటీశ్వరరావే త్రివేణో చెప్పలేము. ఏ పత్రికాసంపాదకుడూ తన పత్రికకు తన జీవిత సర్వస్వాన్ని అంతగా ధార పోశాడు అనుకోను నేను. నిద్రిస్తూన్న రామకోటీశ్వరరావును ఏదో అత్యవసర మైన పనివచ్చి లేపామంటే మేలుకుంటూనే ఆయన మొట్టమొదటిమాట త్రివేణిని గురించే "వచ్చిందా? త్రివేణికోసం డాక్టర్ రాధాకృష్ణ వ్రాసిపంపుతానన్నవ్యాసం" అని ప్రశ్నిస్తారు ఆయన నిద్ర మేల్కొనడముతోనే! తాము పూనుకున్న కార్య ములో అంతగా లీనమైపోయేవారు చాలా అరుదు—నూటికీ కోటికీ ఏ ఒక్కరో ఇద్దరో ఉంటారు అటువంటివారు. ఐతే! ఆ అపరిమిత ఉత్సాహము చుట్టూఉన్న

వారిని సైతము క్రమ్మివేస్తుంది. మనమూ ఏదోవిధంగా త్రివేణికి సాయపడదా మనే దీక్ష మనలనూ ఆవహించి వేస్తుంది, తప్పదు.

పత్రికారచనలో ఒక ఉత్తమ అంతస్తును ఏర్పరచినది త్రివేణి. అంతే గాక, సాహిత్యరంగంలోనూ కళారంగంలోనూ రాజకీయ రంగంలోనూ కూడా కొన్ని గొప్ప విలువలను యేర్పరచి, జనులు ఈవిలువలను పాటించేటట్టుచేసింది కొంతవరకు. ఏదిచేసినా చాలా బాగుగా చెయ్యాలి. గుణముప్రధానము. వట్టిలాభము కాదు, ఆశయము ముఖ్యము, ఆర్థిక సంపాదనకాదు—అని చాటింది త్రివేణి. అందుచేతనే "త్రివేణీ మెంటాలిటీ—త్రివేణీ దృక్పథము" అనే మాట వాడుక లోకి వచ్చింది కొన్నిచోట్ల. రచనలు బాగుండాలి; కాగితము ఒకటోరకం కాగిత ముగా ఉండాలి, ముద్రణ ముద్దులొలుకుతూ ఉండాలి, ఒక్క అచ్చుతప్పు లెక్కకు ఒక్కటైనా ఉండరాదు, పుస్తకం సర్వాంగ సుందరంగా ఉండాలి ఖర్చు యెంతైనా సరే!

వ్యక్తిగతమైన ఇబ్బందులు ఎన్నివచ్చినా సరే, తన త్రివేణి చాలా చాలా అందంగా తయారుకావాలి అనే దీక్ష రామకోటీశ్వరరావుకు. మూడురోజులు పస్తుండి ఐనాసరే అతి శ్రేష్ఠమైన కాగితము కొనాలి త్రివేణికి. తనకు కావలసిన ఖండువా లేకపోయినాసరే త్రివేణి అట్టబాగుండాలి. ఇటువంటి తహతహ ఎందరి కుంటుంది!

ఒకపర్యాయము మాననీయురాలైన ఒకరిని చూడడానికి వెళుతూ, అప్పుడే కొలనులోంచి కోస్తూన్న తామర పూవులు కనిపించి, జేబులోఉన్న రూపాయీ ఇచ్చివేసి పన్నెండు పువ్వులు పుచ్చుకున్నాను ఆమె కివ్వడానికి నేను. పువ్వులను చూచి పరమానందభరితురాలైనది ఆమె. కాని, అద్భుతమైన ఆ అందములో లీనమైపోతూన్న ఆమెకు తెలియదు నేను కాలినడకను ఆమె వద్దకు వచ్చాననీ, కాలి నడకనే తిరిగి వెళుతున్నాననీ. అయితే, ఆమాత్రం శ్రమపడవచ్చు, ఆమెకు అంతటి ఆనందాన్ని చేకూర్చకలిగినందుకు. ఇలాగేఉంటుంది "త్రివేణీ దృక్ప

థము." ఇటువంటి భావాన్ని వర్ణిస్తూనే అన్నాడు 'చివరకు మిగిలేది' అనే గ్రంథాన్ని రచించిన 'బుచ్చిబాబు': సౌందర్యంకోసం సౌకర్యాన్ని త్యాగంచేసే కళాజీవి' అని. ఇది కోలవెన్ను రామకోటీశ్వరరావుకు పూర్తిగా వర్తిస్తుంది.

వట్టి అమాయకుడు రామకోటేశ్వరరావు. చిత్ర విచిత్రమైన మానవస్వభావము ఆయనకు ఒక అద్దంలా కనిపిస్తుంది. అందరిలోనూ తన స్వరూపమే చూచు కుంటారు ఆయన. అందరూ తనలాగే నిష్కల్మష హృదయు లనుకుంటారు ఆయన. ఈ నమ్మకంలో, ఒక్కొక్కప్పుడు దెబ్బ తగులక మానదు. కాని, అటు వంటప్పుడు ఆయన మనలాగ బాధపడరు. ఒక పర్యాయం చాలా కష్టమైంది నాకు. ఎవరో ఒకరు చాలా పెద్ద హోదాలో ఉన్నవారు రామకోటీశ్వరరావుకు మాట ఇచ్చిన ప్రకారంచెయ్యడంలేదని నాకు తెలియవచ్చింది దృఢంగా. ఆప్తస్నేహితు నికి కలుగబోయే ఆశాభంగాన్ని నివారించాలనే ఉద్దేశ్యంతో నేను ఉన్నసంగతి చెప్పాను రామకోటేశ్వరరావుతో. అప్పటి కప్పుడే ఆయన ఏవో కలలు కంటు న్నారు, ఏవేవో ఆకాశహర్మ్యలు నిర్మించుకుంటున్నారు. నా మాట నమ్మలేదు ఆయన_నమ్మాలని లేదు కాబట్టి. పర్యవసానం నేను శంకించినటులనే ఐంది. కాని, రామకోటేశ్వరరావు బాధపడలేదు. "పోతేపోయె! నేను మా నరసారావుపేట వెళ్లి అక్కడే ఉంటాను ఒకరితో జోక్యంలేకుండా" అన్నారు ఆయన.

మరొకసారి, బెంగుళూరులో అనుకుంటా, తోటలో కూర్చుండగా నా వద్దకు వచ్చి అన్నారు ఆయన: "ఫలానా మన స్నేహితుని ద్వారా నాకొక ఉద్యోగము వస్తూన్నట్టున్నది, నాకు చాలా ఇష్టమైన ఉద్యోగము వచ్చేటట్టు ఉంది. నెలకు ఏ ఏడువందలలో, ఎనిమిది వందలలో జీతమిస్తామంటున్నారు. తీసుకోమంటావా?" అని,

"ఆలోచన యెందుకు? వెంటనే అంగీకరించండి!" అన్నాను నేను.

రామకోటేశ్వరరావు అన్నారు: "ఇది ఒక మోస్తరు సర్కారు ఉద్యోగము. ఇతర సర్కారు ఉద్యోగాలలాగే పెద్ద జీతము, పనేమీ ఉండదు. అంత

జీతము తీసుకుంటూ ఆ జీతానికితగిన పని చేయకుండడము నాకు ఎలాగో ఉంటుంది" అన్నారు ఆయన. ఇటువంటివారే అనుకుంటాను 'ఆదర్శజీవులు.'

త్రివేణి మొదటి సంచికలో కృష్ణశాస్త్రి గేయానికి నా ఇంగ్లీష్ అనువాదం అచ్చయింది. త్రివేణి ప్రారంభోత్సవ సమయాన నేను వారితో కూడా మద్రాస్ వేపేరీలో మలబార్ హౌస్‌లో జరిగిన సమావేశంలో ఉన్నాను అంటారు, రామ కోటేశ్వరరావు. అలా ఉన్నట్టు జ్ఞాపకంలేదు నాకు. కాని ఆయన అంటారు: "మీరు ఉన్నట్టే భావిస్తూ వచ్చాను ఇన్నాళ్ళూ నేను. కనుక మీరు తప్పక ఉండి ఉండాలి!" అని. ఆ మాట ఎల్లా ఉన్నా అప్పుడో, ఆ తర్వాత కొద్ది రోజులకో ఆ మలబార్ హౌస్‌లోనే జరిగిన 'జయంతి' సంచిక ప్రారంభోత్సవ సమయంలో నేను ఉన్నాను అక్కడ.

అప్పుడే విశ్వనాథ సత్యనారాయణ కాళ్ళు కడుక్కు వచ్చి మల్లంపల్లి సోమశేఖరశర్మను కుర్చీలో కూర్చోమని, ఆయన కాళ్ళు కడిగి, ఆ నీళ్ళు నెత్తిమీద చల్లుకుంటూ తన 'ఆంధ్ర ప్రశస్తి'ని శర్మగారికి అంకిత మిచ్చారు, ఆఖరుగా ఈ మాటలు అంటూ :

నీ వనుకోనులేదు మరి నే నిది చెప్పనులేదు కాని, అ
న్నా, వినవయ్య నేటి కిది నా చిరు పొత్తము నీకు నంకితం
బై వెలయింప జేసు హృదయంబులు నీకును నాకును మాతృదే
శావిల దుఃఖదారితములై శ్రుతి గల్పె విషాద గీతికన్ !

మేమందరమూ విస్మితులమై పోయాము! ఎంత మనఃపూర్వకంగా ఉన్నది ఈ కృతి సమర్పణ! శర్మగారికి డిగ్రీలు లేవు. అందుచేత వారి చరిత్రజ్ఞానము ఎంత గొప్పదైనా, లోకం వారిని తగిన రీతిని ఆదరించడములేదు. ఆ మాట చెపుతూ విశ్వనాథ సత్యనారాయణ అన్నారు :

...నీ యచ్ఛతర కమనీయశీల జ్యోత్స్న
అడవిగాసిన వెన్నెలగుచు చెలగి...
అంతేకాని, గౌరీశంకరాచ్ఛ శృంగ
తుంగము త్వదీయము మనస్సు పొంగి తెలుగు
నాటిపూర్వ చరిత్ర కాణాచి యెల్ల
త్రవ్వి తలకెత్తిలేదె యాంధ్ర జనములకు !
కొందమతు మ్మెద రెక్కల గుస్తరించు
మీసముల నీ ప్రసన్న గంభీర ముఖము
కన్నులంటగ గట్టినట్లున్న నిన్ను
మరచి పోలేను జన్మ జన్మములకైన !

ఇది నీకై యిడినట్టి నాయుపద మున్నే నాడొ ఘూసాగ్రముల్
పదునై యాంధ్ర విరోధికంఠ దళన ప్రారంభ సంరంభ మే
చు దినాలన్ మరి తోడి సైనికులమై చూరాడు ప్రేమంబులో
నిది లేశంబనిమైన చెప్పుటకు లేవే నాటి స్వాతంత్ర్యముల్ !

గంభీరమైన సోమశేఖరశర్మ ముఖకమలమునుండి జలజల రాలాయి ఆనంద భాష్పాలు. లేచి నుంచుని అమాంతంగా కౌగిలించుకున్నారు ఆయన ఆంధ్ర ప్రశస్తి కృతికర్తను.

ఎంత సంతోషించిందో ఆంధ్రభారతి ఆ నిమిషం !

## ౧౮

త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైః శిలాయా
మాత్మానం తే చరణ పతితం యావదిచ్ఛామి కర్తుం।
అస్రైస్తావన్ముహురు పచితైః ర్దృష్టిరా లుప్యతేమే
క్రూరస్తస్మిన్నపి న సహతే సఙ్గమం నౌ కృతాన్తః॥

కాళిదాసుని యక్షుడంటున్నాడు ఆషాడమేఘముతో, నా ప్రియురాలితో నా మాటగా ఇలా అను, స్నేహితుడా: "ప్రణయకోపంతో ఉన్న నీ రూపమును చిత్రఫలకసుపైన చిత్రించి, నీ ముందు వినమ్రుడనై మోకరిలుతూన్నట్టు నీ రూపాన్ని చిత్రించాలని కుంచె యెత్తేసరికి, కళ్ళు నీళ్ళు గ్రమ్మి ఏమీ కనిపించకుండా పోతోంది, ఏమి చెయ్యను! బొమ్మలోనైనా నీతో కలసి ఉండడానికి నోచుకోనైతిని, నేను"—అని.

చిన్నప్పుడు ఎప్పుడో, ఒక సంస్కృత విద్యార్థి మేఘసందేశంలోని శ్లోకాలు వల్లింపగా విన్నాను. మా పినతండ్రి కృష్ణమూర్తిస్నీ అప్పుడప్పుడు చెపుతూ వచ్చారు, మేఘ సందేశ మహాకావ్యమును గురించి. కాని, ఈవేళ సబ్ కలెక్టర్ విశ్వనాధన్ వర్ణించినంత అందంగా వర్ణించలేదు వారు, ఆ కావ్య ప్రతిభను.

పెరవిలి రాహదారీ బంగాళాలో కాంప్‌లో ఉన్నాము, సబ్ కలెక్టరుగా ఆయన, ఇన్సూరెన్సు సెక్రటరీగా నేను. సాధారణంగా సబ్ కలెక్టర్ క్యాంప్ చేసిఉన్న బంగళాలో ఇంకెవరినీ ఉండనియ్యరు, గదులు ఖాళీ ఉన్నా. కాని, విశ్వనాధనూ నేనూ స్నేహితులము కాబట్టి నా విషయంలో అట్టి అభ్యంతరము.

లేకపోయింది. మిట్టమిక్కలి, నా కార్ బంగళా ఆవరణలో ప్రవేశించేసరికి ఆయనే ఎదురుగా వచ్చి "నువ్వు నాలోనే భోంచేస్తున్నావు. ఈపూట!" అన్నారు. నా ప్రక్కనే కూర్చుని ఉన్న మా పినతండ్రి కృష్ణమూర్తిగారిని చూచి, "మీరున్నూ" అన్నారు విశ్వనాథన్. కార్‌నుంచి దిగాక, వారి నిద్దరినీ ఒకరి కొకరిని పరిచయం చేశాను.

మేము వచ్చేసరికి సబ్ కలెక్టర్ విశ్వనాథన్ కాళిదాసుని మేఘసందేశం చదువుకుంటున్నారు. మా పినతండ్రినీ నన్నూ ఆయన ప్రక్కనే ఉన్న కుర్చీలలో కూర్చోమని విశ్వనాథన్ తాను చదువుతున్న శ్లోకాన్ని మాకు వినిపించి అన్నారు మా పినతండ్రితో, తర్జనితో నా వైపు చూపుతూ. "వీరంతా భావ కవులట! ఏవేవో అపూర్వమైన విషయాలను తెచ్చి పెడుతున్నాము కవిత్వం లోకి అంటారు, ఈ రూపకల్పనా, ఈ భావసంపదా ముందు వీరి కవిత్వమంతా ఏపాటి! ఈ శ్లోకము చూచే ఉంటారు, మీరు" అని, ఆ తరువాత శ్లోకం చదివి అర్థం చెప్పారు:

మామాకాశ ప్రణిహిత భుజం నిర్దయాశ్లేషహేతో
ర్లబ్ధాయాస్తే కథమపి మయా స్వప్న సందర్శనేషు।
పశ్యన్తీనాం న ఖలు బహుశో కేనస్థలీ దేవతానాం
ముక్తాస్థూలా స్తరుకిసలయే ష్వశ్రులేశాః పతన్తి॥

"నాకు నిద్దర పట్టక, నిద్దర పట్టక, ఏ ఆఖరి ఝామువనో ఒక్క క్షణం కళ్లుమూస్తాను. వెంటనే కల వస్తుంది—నిన్ను గురించిన కల. ఆ కలలో నిన్ను మనసార, గట్టిగా కౌగలించుకోబోతాను. వట్టి ఆకాశంలోకి చాచిన నా చేతులను చూచి వన దేవతలు సైతము పట్టరాని జాలితో చెట్ల చిగుళ్ళ నుంచి ఆణిముత్యము లంతలేసి కన్నీటి బొట్లను రాలుస్తారు."

మా పినతండ్రి అందుకున్నారు. వారికి మాఘుని, మేఘము, సంస్కృత నాటకాలూ ఖంఠాపాఠము. ఇక ఆ పూటపూటంతా సాహిత్య గోష్టే!

విశ్వనాథన్‌కి సాహిత్యమందే కాదు, సంగీతమందున్నూ గొప్ప అభిరుచి. అసలు ఆయనను నేను మొట్టమొదటిసారి చూచినప్పుడు ఆయన వీణ వాయిస్తున్నారు నరసాపురంలో వారి బంగళాలో. సబ్‌కలెక్టర్ విశ్వనాథయ్యర్‌ని నీకు పరిచయం చేస్తానంటూ జిల్లా వ్యవసాయ ఇలాఖా ఆఫీసర్ రాఘరావునాయుడుగారు తీసుకు వెళ్లారు నన్ను వారి వద్దకు. పూర్వము ఎవరో హాలెండ్ వర్తకులు కట్టిన బంగళా, చాలా బాగుంటుంది. పెద్ద పెద్ద కొలువుకూటాలూ పెద్ద గదులూ ఎత్తయిన స్తంభాలూ. ఆ భవనంలో ఒక మూల ఎక్కడో, ఒక్కరూ కూర్చొని వీణ వాయించుకుంటున్నారు సబ్ కలెక్టర్.

మమ్మల్ని చూచి, వాద్యము ఆపి, లేచి వచ్చి, ఎంతో మర్యాద చేశారు ఆయన. లోనికి తీసుకువెళ్లి మమ్మల్ని ఇద్దర్నీ శతవృద్ధులు, ఆయన తండ్రిగారికి పరిచయం చేశారు.

ఇలా మొదలైన మా స్నేహము నేను ఇన్సూరెన్సు పని మాని మరేదో వ్యాపకంలో పడిన పదేళ్ళవరకూ విస్తరిల్లింది. అప్పు డాయన కాంగ్రెస్ ప్రభుత్వంలో ఆరోగ్యశాఖామంత్రిగా ఉన్న మాపినతల్లి రుక్మిణమ్మగారికి హెల్త్ డిపార్ట్‌మెంట్ సెక్రటరీగా ఎంతో సహాయం చేస్తున్నారు. చిత్రంగానే ఉండేది: మంత్రి ఐన మా పిన్నిగారిని కలుసుకున్నప్పుడల్లా ఆమె, "నీ స్నేహితుడు విశ్వనాథయ్యర్" అంటూ తన సెక్రటరీని పొగుడుతూ ఎంతో చెప్పేవారునాతో. "అతని సహాయము ఉండబట్టి నేను నిర్వహించుకు వస్తున్నాను, ఈ పని అంతా. ఏమి అవగాహన, ఎంతటి కుశాగ్రత, ఎంతటి స్వామిభక్తి!" అంటూ. విశ్వనాథయ్యర్‌ని కలుసుకొనినప్పుడల్లా నాతో అంటూఉండేవారు ఆయన: "మీ అమ్మగారని చెప్పడం కాదు, నిజంగా ప్రజాస్వామ్య ఫలితంగా అధికారంలోకి వచ్చిన మంత్రులలో ఇంతటి తెలివి కలవారు, ఇంతటి కార్యదీక్ష కలవారు, ఇంతటి కుశా

గ్రత కలవారు చాలా అరుదు. అందరు మంత్రులూ ఇటువంటివారైతే కాంగ్రెస్ ప్రభుత్వం ఎంతటి ఘనకార్యాలైనా చేయవచ్చును" అనేవారు.

ఆ రోజులలో ఐ. సి. ఎస్. ఉద్యోగస్తులకు ఇంకా కాంగ్రెస్ సంస్థపైన సంపూర్ణమైన అభిమానం కలుగలేదు. మంత్రులుస్నూ ఐ. సి. ఎస్. వారిని పూర్తిగా విశ్వసించలేకపోయేవారు. అటువంటి సందర్భంలో వీరిద్దరిమధ్య పరస్పర గౌరవభావము కలుగడము నాకు చాలా సంతోషం కలిగించింది.

ఆ తరువాత కొన్నాళ్ళకి — అప్పటికి రుక్మిణమ్మగారు మంత్రిపదవిని చాలించుకున్నారు—ఒక రాత్రి మా పినతండ్రి ఉన్నట్టుండి మా ఊరినుంచివచ్చారు నా వద్దకు. "మన ఊళ్ళో త్రాగడానికి మంచినీళ్లు లేవు. ఊరచెరువు మరమ్మతు విషయమై కాగితాలు జిల్లాబోర్డ్ నుంచివచ్చి, సెక్రటేరియట్‌లో ఉండిపోయాయి. నీ స్నేహితుడు విశ్వనాధయ్యర్ తలుచుకుంటే నిమిషంలో అయిపోతుంది ఈపని; ఆయన వద్దకు వెళదాంపద" అన్నారు, వెంటనే వెళ్ళాము విశ్వనాధయ్యర్ వద్దకు — రాత్రి తొమ్మిది గంటలకు. ఒక్క నిమిషమైనా తడుముకోకుండా ఆ చెరువు విషయం యావత్తూ పూసగుచ్చినట్టు చెప్పారు ఆయన మాకు. "మాధవరం గురించిమీరు నాకు చెప్పాలా! ఆ గ్రామం నా గ్రామంలా పాటిస్తాను నేను. నేను చేయవలసినదంతా చేశాను. ఆలస్యమంతా మీ డిస్ట్రిక్ట్‌బోర్డ్ వారిదే" అంటూ అన్ని విషయాలూ వివరించి, మాకో మార్గం కూడా సూచించారు. తదుపరి ఇంకా, ఇంకా శ్రద్ధ తీసుకుని మాధవరం ఊర చెరువును ఆ చుట్టుపట్ల ప్రదేశానికంతా అందమైన దివ్యకాసారంగా చేశారు ఆయన. కలెక్టర్ విశ్వనాధయ్యర్ పేరును భక్తి ప్రేమలతో చెప్పుకుంటారు, ఈ నాటికీ మా ఊరి జనం.

కాని, ఇటువంటి సత్కార్యాలు చేశాక ఆయన ఎక్కువ కాలం జీవించలేదు. "దేవుడు ప్రేమించినవారు పిన్న వయస్సులోనే చనిపోతారు" అనే సామెత ఉన్నది, ఇంగ్లీష్‌లో. అలాగే విశ్వనాధయ్యర్ మృత్యువువాత బడ్డారు—సర్కార్ పనిమీద విమానంలో వెళుతూ, డమ్‌డమ్‌వద్ద విమానం కూలిపోయి ఆ మంటలో కాలి

పోయారు. ఒక మంచి ప్రతిభావంతుడు, స్నేహశీలి—ఇంకా ఎంతో ఎంతో వృద్ధిలోకి రావగినవాడు, క్షణంలో భస్మమైపోయాడు. మనకు మిగిలినవి ఆయన మంచి గుణాలను గురించిన జ్ఞాపకాలే!

నరసాపురం క్యాంపులోనే వ్యవసాయ శాఖాధికారిరాఘవరావు నాకు మరి యొకరిని పరిచయం చేశారు. పరిచయం కాదు, నిజంగా పునః పరిచయము. జిల్లా సబ్ జడ్జి శ్రీనివాసాచార్యావారికి నన్ను చూపిస్తూ "ఇతను ఫలానా" అని రాఘవరావు ఇంకా ఏదో చెప్పబోతూండగా వారి మాట వినిపించుకోకుండా జడ్జిగారు నాకేసే నిదానించి చూస్తూన్నట్టు చూచాను నేను. ఆయన ముంచుకువచ్చే ప్రేమభావంతో చిరునవ్వు నవ్వుతున్నారు. ఎక్కడిది, ఆ చిరునవ్వు! ఎన్నేళ్ళ క్రితమిది ఆ సౌజన్యత? మనస్సు ఒక్కసారి ముప్పది ఏళ్ళు వెనక్కు వెళ్లింది. మద్రాస్ చింతాద్రిపేట, మా ఇంట్లో మేడమీద, నాకు ఐవన్‌హో పాఠము చెపుతూన్న ముఖము; శ్రీనివాసాచార్య! "అవును, నేను మీ ప్రయివేట్ మేష్టార్ని. ముప్పది యేండ్ల క్రితము; నీకూ, మీ అక్కయ్య లక్ష్మీదేవికీ రోజూ పాఠం చెప్పేవాణ్ణి. ఇంగ్లీష్‌లో మంచి ఆసక్తి ఉండేది నీకు" అంటూ నన్ను తమ కౌగిట జేర్చుకున్నంతగా ఆదరించారు. రాఘవరావు చాలా సంతోషించారు, ఈ పునస్సమాగమము తనవలన అయినందుకు.

ఆ రాత్రి జడ్జిగారింటనే భోజనము. పూర్వవిషయాలెన్నో చెప్పారు శ్రీనివాసాచార్య. ఆయన కొన్నాళ్లు వకీలు పని చేసి తరువాత డిస్ట్రిక్ట్ మునసబుగా ఉండి కొద్దికాలం క్రితమే ఈ పదవిలోనికి వచ్చిన వివరాలు చెప్పారు. నన్ను గురించీ, మా అక్కయ్యను గురించీ తెలుసుకోవాలనీ అప్పుడప్పుడూ ప్రయత్నించినట్టూ, కొన్నేళ్లయినాక, మమ్మల్ని గురించి సరిగ్గా చెప్పగలిగిన వారిని వారు కలుసుకోలేక పోయినట్టూ చెప్పారు. నేను ఇన్సూరెన్స్‌లో ఉన్నానని తెలిసి ఆయన మొదట కొంత చిన్నబుచ్చుకున్నారు కాని, ఈ ఉద్యోగము కేవలము ఉద్యోగము గురించి కాదనీ నాన్నగారు చేస్తూన్న ఒక పనిలో వారికి తోడుగా ఉన్నాననీ తెలిసి ఆయన చాలా సంతోషించారు. "నేను ఇక రెండు ఏళ్లలో రిటైర్ అవు

తున్నాను. కనుక నీ పాలసీ నాకంత ప్రయోజన పడదు. మా అబ్బాయి ఒకతను మద్రాస్‌లో వకీల్‌గా ఉన్నాడు. నేను అతనికి ఉత్తరం వ్రాస్తున్నాను. నీవు క్రిస్టమస్‌కి మద్రాస్ వెళితే అతను నీకు పాలసీ ఇస్తాడు" అన్నారు. ఆయన అనిన్నట్లుగానే ఆ డిసెంబర్ నెలలో మద్రాస్ వెళ్ళి, వారి అబ్బాయిచేత ఒక పదివేలకు ఇన్సూర్ చేయించాను.

శ్రీనివాసాచార్య చెప్పినట్టు, నేను ఇంగ్లీష్ పాఠాలను ఆసక్తితోనే చదివేవాడను. లెక్కలు మాత్రం చాలా ఇబ్బంది పెట్టేవి నన్ను. కూడికలో కూడాతప్పే! చిన్న కూడిక అయినా, క్రిందినించి పైకికూడితే ఒక మొత్తమూ పైనుంచి క్రిందికికూడితే ఒక మొత్తమూవచ్చేవి. ఇది పాపము, ఆ అంకెల తప్పుకాదు. మొదటిసారికూడిక మొత్తంఅంకెవేశాక, రెండవసారి సరిజూడ దానికి పైనుంచి క్రిందికి కూడడము ప్రారంభించేలోపల, ఆక్షణిక విరామంలోను మనస్సు ఎక్కడకో పారిపోయేది: చిటారుకొొమ్మరి ఆకుపైన వ్రాలిన చిలుక మీదికో, దోరగావచ్చినైన అరటిగెలపైకి ప్రాకుతూన్న ఉడుత మీదికో! మళ్ళా జామెట్రీ, అల్జీబ్రాలతో మంచి నేర్పు చూపేవాడను—జామెట్రీలో మరీను. కొన్ని కొన్ని తప్పనిసరియైన నిబంధనలకు లోబడే ఆ గీట్లూ, ఆ కోణాలూ, నాకు ఎంతో సరదాగా ఉండేవి. తేటతెల్లమై అందరూ నిజమని అంగీకరించే జామెట్రీ సిద్ధాంతాలను అవి అసలు లేనట్టు భావించి, అవి లేకపోతే కలిగే అల్లకల్లోలాన్ని విశదపరుస్తూ, అంచేత అవి తప్పకుండా నిజమై ఉండాలి అని నిర్ణయించడము నాకు ఏదో ఘనకార్యాన్ని సాధించినట్టు ఉండేది. లెక్కలు మాత్రం నాకు రావు—వడ్డీ లెక్కలు మరీ భయం కరంగా ఉండేవి. మా అక్కయ్య చిటికెలో పూర్తిచేసి కూర్చునేది తన అన్ని లెక్కలనూ. నాకు ఒక్క లెక్కా సరిగ్గా రాదు. తతిమ్మా సబ్జక్ట్సులోనూ ఆమె చదువు చక్కగా రాణించేది, ఆమె కష్టపడి చదివేది — ఏకాగ్రతతో. నాకు ఎప్పుడూ ఆటపాటలే. కన్యాశుల్కంలోని గిరీశాన్ని అనుకరిస్తూనో, ప్రసన్న యాదవములోని ఇంద్రుని 'కాళీయ ఫణిఫణాగ్రముల దాండవమాడు నడుగు

దమ్ములకు జోహారు లనుము' అనే పద్యాన్ని అభినయిస్తూ పాడుత్తూనో గడిపి వేసేవాడను ఇంట్లో పాఠాలు చదువవలసిన సమయాలను. ఇక ఏకాగ్రత ఎలా వస్తుంది !

మాకు ప్రయివేట్ చెప్పుతూన్న మరి ఒకర్నిన్నీ కలుసుకున్నాను ఈ నా ఇన్సూరెన్స్ వ్యాపకపు రోజులలోనే. బెజవాడలో పెద్ద కాన్ఫరెన్స్ అవుతోంది. భీమా ఏజంట్ల కాన్ఫరెన్స్— సూరంపూడి కనకరాజు ఏర్పాటు చేశారు, ఎంతో అట్టహాసంతో. ఆ మహాసభకు అధ్యక్షులుగా ప్రఖ్యాత ఇన్సూరెన్స్ గణితజ్ఞుడు. ప్రొఫెసర్ కె. బి. మాధవా మైసూరు నుంచి వస్తున్నారు. వారిని రైలువద్ద కలుసుకొని, నా టూ సీటర్ సిట్రాయన్ కార్‌లో వారిని విడిదికి తీసుకురావలసిన పని నాకు అప్పగించారు. ప్లాట్‌ఫారంమీద వారికి పూలదండలువేసి స్వాగతము చేప్పే టప్పుడు ఎవరికీ తోచలేదు నన్ను వారికి పరిచయం చెయ్యాలనే సంగతి. కాని, వారు, ప్రొఫెసర్ కె. బి. మాధవా మన కార్ ఎక్కబోతూవుంటే మాత్రం సూరంపూడి కనకరాజుకు జ్ఞాపకం వచ్చి ఆయన అన్నారు ప్రొఫెసర్ గారితో : "అన్నట్టు ఈయన ఫలానా, ఫలానా కంపెనీ సెక్రెటరీ, ఫలానావారి కుమార్లు" అంటూ.

నాన్నగారి పేరుతో కలిసిన నాపేరు వినేసరికి ప్రొఫెసర్ మాధవా కార్‌లో ఉంచిన కాలు అలాగే ఉంచి ఊరికే నిలబడిపోయి నాకేసి ఒక్కక్షణము నిదానించి చూచి "అరి పిడుగా! ఎంత వాడవయావు!! చిన్నప్పుడు నీకు చదువు చెప్పిన మాష్టార్నే మరచిపోయావూ!!" అన్నారు. "నన్నే మరచిపోయావా? నీకూ, మీ అక్కయ్యకూ ఒక ఏడాది ప్రయివేట్ చెప్పలేదూ నేను మద్రాస్ చింత్రాదిపేటలో, ఆ పోకచెట్ల తోటలో ఉన్న మేడలో. లక్ష్మీదేవి ఎక్కడుంది ఇప్పుడు? అన్నట్టు,

ఢిల్లీలో ఉన్నదటగా. గొప్ప లేడీడాక్టరటగా?" అంటూ ఏకధోరణిని చెప్పుకు పోసాగారు.

నాకు జ్ఞాపకం వచ్చింది. వారివద్ద చదువు నేర్చుకున్నరోజులను తలుచు కుంటూ, భక్తితో నమస్కరించాను వారికి. ఎంతో ఆప్యాయంతో నా భుజము పైన చేయివేశారు ఆయన. అందరూ వింతగా చూస్తున్నారు మమ్మల్ని !....

నరసాపురంలో జడ్జి శ్రీనివాసాచార్యా, బెజవాడలో ప్రొఫెసర్ మాధవా ఇద్దరూ కూడా సావధానంగా చెప్పారు నాతో, పెద్దచదువు చదువడానికీ, తగిన వృత్తిలో ప్రవేశించడానికీ అందు రాణించడానికీ తాము పడిన ఇబ్బందులను గురించి. మొదట తాము పడుచుండిన అపారమైన ఇబ్బందిసమయంలో ఆర్థి రంగా నాన్నగారు తమకు చేసిన సహాయమును గురించి ఎంతోగా పొగడి చెప్పారు. సమయానికి ఈ ప్రయివేట్ ట్యూషన్ పేరట వారు తమకు చేసిన ఈ అమూల్యా మైన తోడ్పాటు ఎన్నడూ మరువరానిదన్నారు. అప్పుడు ఆ చేయూత లేకపోతే ఏమై యుండేదో అన్నారు ఇద్దరూకూడా.

అదృష్టము ఉండాలి. అదృష్టమూ, సడలని ప్రయత్నమూను. ఈరెండిం టిలో ఏది లోపించినా, వ్యక్తి పైకి రాలేడు. ఎవరో కొందరు, ఏ ఒక్కరో, ఇద్దరో విశేష ప్రయత్నము లేకపోయినా, అదృష్టము ఉండబట్టి సాటివారు అందుకోలేనట్టి ఉన్నతపదవులను అందుకుంటారు. కాని, ఎక్కువగా, కార్యదీక్ష, నిరంతర యత్నము ఉన్నవారే, అదృష్టం సహాయంతో ఇంకా ఇంకా పెద్ద అంత స్థును జేరుకో గలుగుతారు.

ఆగస్ట్ 1936; 'ఉదయిని' ఆరవ సంచిక వచ్చింది. ముద్దులు మూటగటుతూ ఉన్నది సంచిక. జనార్దనరావు సంకల్పము అతను ఆశించినట్టు పరిణమిస్తోంది.

కాని, పంతకాలము నిలుస్తుంది, హూరీప గాలిలో ఈ దీపము! సరిగ్గా ఆసమయానికి నవ్యసాహిత్య పరిషత్తు తరపున ప్రతిభ మొదటి సంచిక కూడా వెలువడింది. ఆ సందర్భంలో ఉదయిని సంపాదకుడు కొంపెల్ల జనార్ధనరావు తన 'కిరణాలు'లో ఇలా అంటున్నారు :

....కేవలము ధన్యాధుల ప్రత్యేకాదరాన్ని ఆధారము చేసుకొని కాక, తదీయుల దీక్షోత్సాహములయందే ఆశ పెట్టుకొని యేర్పడ్డ నవ్యసాహిత్య పరిషత్తు దేశాన్ని ఆకర్షిస్తున్నదంటే దాని ఉనికికి కావలసినంత శుభకామన చేకూరినదన్న మాట. దాని ముఖ్యమైన పరికరం నవ్యసాహిత్య పరిషత్పత్రిక 'ప్రతిభ' వెల్వడింది. వ్యక్తులుగా నవ్యసాహిత్యపరిషాదులున్నూ 'ఉదయినికి' ప్రాపులైనవారై, సంస్థ తరపున 'ప్రతిభను' వెలువరించడానికి నడుము కట్టినారంటే 'ప్రతిభకూ,' 'ఉదయినికీ' గల నెయ్యము మాట చెప్పనక్కరలేదు. 'ప్రతిభ' 'ఉదయిని'కి తోడై యాత్రాగతికి జీవమూ సొగసూ పెంపొందించ గలదనే ఆశ తప్పక సార్ధకము కాగలదు.

ప్రతిభకూ ఉదయినికీ చాలా స్నేహము. కాని, తెనుగువారు రెండు మంచి పత్రికలను పోషింపలేక పోయారు. చివరకు, ప్రతిభ కూడా ఆగిపోయింది ఆదరణ లేక. హోరుగాలే గెలిచింది. అటువంటి దీపకళికలు మరి ఇక వెలుగలేదు.

ఈ ఉదయినిలో కృష్ణశాస్త్రి పద్య మొకటి ఉన్నది : 'ఒకనాటి రేయి'. వ్రాస్తున్నాను అన్నాడు కాని ఇంతవరకు నేను చదువలేదు. అచ్చులో, అందులో ఉదయినిలో అతని కవిత చూచి ప్రాణము లేచి వచ్చింది. ఎంత చక్కగా వ్రాస్తాడు!

ఒక నిముసంపు నిద్దురయు నోత్తని నా కనురేకు లెన్నడే
నిక ముకుళింపవేమొ చదలేటి సుమాలయి, నిర్నిమేషలౌ తా

సాగుతున్న యాత్ర

రకల విధాప వేసటలు రాసి నిరీక్షణ శ్యామికాప్రతో
ళికల పదే పదే కలవరించెడి కోరిక చీల్చుచుందునా!

ఈ శరదిందుమూర్తి హాసియింపడు చల్లదనాల జల్లులా
శాశల, నా దరిద్ర గగనాంతర సైకత పాళి కూడ జ్యో
త్స్న శిశిరమ్ము కాదు, కరిచాయల పాయలు పాయలై నిశా
కైశిక మూరకే ఇముడకే ముడిలో విడబారు నెల్లడన్.

అచ్చంగా కృష్ణశాస్త్రి ఊహా, కృష్ణశాస్త్రి భావమూ కాదూ? ఎంతో అను కుంటాను ఈ చక్కని పద్యం ఇంగ్లీష్ చేసి ఇంకా ఇంకా ఎక్కువమందికి ఆనంద మును పంచిపెట్టుదామని. కాని, అతను చిత్రించిన బొమ్మలు ఎంత ప్రస్ఫుటంగా కనిపించినా వానిని గురించిన వర్ణన ఎంత చక్కని ఇంగ్లీష్‌మాటలలోనైనా సరిగా కుదరడములేదు. మాట వరసకు "ఈ శరదిందుమూర్తి హాసియింపడు చల్లదనాల జల్లులు" ఈ భావం ఇంగ్లీష్‌లోకి తేగలను ఇంత అందంగాను — ఒకవేళ ఇంకా అందంగానూ—భాషామాధుర్యం మాట అటుంచి. కాని, 'కరిచాయల పాయలు పాయలై నిశాకైశిక మూరకే ఇముడకే ముడిలో విడబారు నెల్లెడన్'—ఈ బొమ్మ ఎలా గియ్యను, ఇంగ్లీష్‌లో? ఆ సంప్రదాయమే వేరు, మరి.

ఐతే ఒక చిత్ర మేమంటే ఇంగ్లీష్ కవిత్వముతో విశేషమైన పరిచయము లేకపోతే ఈ పద్యము అవతరించి ఉండదు ఈ రూపాన. షెల్లీ, కీట్స్, ఈట్స్, రవీంద్రుడు, ఇక్బాల్ వీరి రచనలలో ఎంతో ఎంతో పరిచయము లేకపోతే ఎంత ఉద్వేగమున్నా, ఇంతటి అనుభవపరంపర గాని, ఇన్ని ఇన్ని అందమైనభావనలు గాని, ఇన్ని ఇన్ని అద్భుతమైన చిత్తరువులుగాని కనిపించి ఉండేవి కావు కృష్ణ పక్షములోనూ ఊర్వశీ ప్రవాసములలోనూ బదరికలోనూ. ఒక విధంగాచూస్తే, ఆంగ్ల కవితా తెలుగు కవితా అద్భుతంగా సమ్మిశితమైన ఒక అపూర్వమైన

## సాగుతున్న యాత్ర

సాహిత్యసమ్మేళనము కృష్ణశాస్త్రి రచన, అని తోస్తుంది. ఆ రచనలోని అనుభవ సంపద, ఈ రచనలోని లాలిత్యము, ఆ రచనలోని సుకుమారభావాలూ ఈ రచనలోని శబ్దమాధుర్యమూ, కలసి ఎంతఅందాన్ని, ఎంతటి ఆనందాన్ని ఇయ్య కలుగుతున్నాయి!

ప్రోయవు చైత్రమాస పదముల్ హరిదంత పదమ్ములందు; శూ
న్యాయతనాంగణాన మిహికాంగముతో చలికారు తొందరల్
సేయును, వెంటవెంటబడి చీరగ శైశిర జీర్ణ పర్ణవా
తాయతరోదనమ్ములో జరామయ విశ్వసన స్వనమ్ములో.

రగులు విషాద హాలాహల రౌరవ కీల హృదంతరాలగా
ల్పగ నను లోన దాల్పగ భరమ్మొ! వియోగ కుటీరమ్మిది నే
డీ గతికి రేబవళ్ళ నొకటే పనిగా తపియించు సోరణం
పు గనుల పల్కరించు నలుమూలల యేడుచు బారు బారునన్!

ఎంత చక్కని కవిత్వం! ఒకరి ఆత్మను మరి ఒకరు ఇంత చక్కగా ప్రదర్శింపగలరా? నా భావాలన్నీ ఎంత చక్కగా ప్రదర్శించాడు, కవిగా, నా స్నేహితుడు!

## ౧౬

ఏ పువుదండ గుత్తునని యెప్డు దొడంగితినో
అతిప్రయత్నాపచితమ్ములౌ సుమము
లన్నియు విస్మృత యత్ప్రపంచ ధూళీ
పరమాణుకోటుల విలీనములై
పొడమాసిపోయెనో, చేడె నేటి కీ సుమము
చేకొని చేతు బునః ప్రయత్నమున్.

పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వెంకటేశ్వరరావు

అమలాపురం మకాములో ఎర్రవంతెన ప్రక్కన రహదారీ వసారాలో కూర్చొని ఉదయినిలోని ఈ పద్యము చదువుకుంటున్నాను నేను. చిన్నప్పటి నుంచీ నాకు పువ్వులు గ్రుచ్చటమంటే మహా సరదా. మా అక్కయ్య స్నేహితురాలు నేర్పింది నాకు మల్లెమొగ్గలు చక్కటి చెండ్లులా కట్టడము. మొగ్గలు వికసించాక, కిక్కిరిసినపువ్వులు ఉక్కిరిబిక్కిరి చేస్తాయి మత్తుకలిగించే సువాసనతో

బెంగుళూరులోనూ పువ్వులు కొనడానికి వెళ్ళినప్పుడు పూలఅమ్మి అందిచ్చిన సరాలను చేత్తో పుచ్చుకోకుండా, ప్రక్కనే కూర్చున్న వాళ్ళ అమ్మాయి మూడు పేటల అరటి నారదారాల మధ్య అతిసుకారంగా అల్లుతూన్న "సంపెంగ పట్టె"ను చూస్తూ, మెరపులిలా కదలిపోతూన్న ఆ అమ్మాయి సన్నని వ్రేళ్ళ

వాకచక్యానికి విస్తుబోయి చూస్తూ అలాగే ఉండిపోయేవాడను ఎంతోసేపు. పూల వాళ్ళు నన్ను చూచి నవ్వేవారు. ఆ తర్వాత శ్రీరంగంలోనూ అల్లాగే. తెల్ల సంపెంగలు, ఎర్ర గన్నేరు పువ్వులు, కస్తూరి పచ్చ, కురువేరు, వట్టివేళ్ళ కలిసి "కదంబం" కడతారు — చూస్తూంటే కళ్ళు భ్రమిసిపోతాయి ఆ అందానికి.

చాలాసార్లు అంటూ వచ్చాను నేను స్నేహితులతో : "ఈఉద్యోగంలోంచి విరమించుకున్నాక, నేను పూలదండలు గ్రుచ్చుతూనే కాలము పుచ్చుతాను" అని. రకరకాల పూలదండలను ఎంతో అందంగా అల్లగలను అనే ధైర్యం ఉంది. కాని ఒక్కటే బాధ. ఈ చేత్తో సంపెంగ పువ్వుల దండను అందిస్తూ ఆ చేత్తో ఆమెవద్దనుంచి డబ్బు తీసుకోవడము ఎలా ? పూలతో వ్యాపారమెలా ?

ఉదయినిలో ఇంకా ఇలా ఉంది :

ఒక్కొక్క సుమమ్మె ఏర్చి నీకుపదసేయ
గుణము కొంత నిట్టు లల్లన గ్రుచ్చుచుండ
బూర్వ పూర్వ గ్రథితమైన పూలు రాలె;
మొదలు కన్పించ దీ సూత్రమునకు నాథ !

ఎంత చక్కగా వ్రాశారు కవులు ! ఎంత సహజంగాను, ఎంత అనుభవ నీయంగానూ ఉన్నది, ఈ భావము! కాని, ఇందు ఏదో గంభీరమైన అంతరార్థ మున్నూ ఉన్నది "మొదలు కన్పించ దీ సూత్రమునకు !"— ఆలోచించిన కొలదీ ఏవో అపూర్వ భావాలు, ఆత్మను హత్తుకుపోయేవి గోచరిస్తాయి.

ఇంకా మరీ అందంగా అంటున్నారు కవులు :

సాగుతున్న యాత్ర

పూలు రాలుగాక, పాలుపోక తుది మొదల్
నిలుచు సూత్రమైన నే గ్రహించి
రాలినట్టి పూలమాలిక దెత్తునా ?
సాక్షిగాగ నా ప్రయత్నములకు.

అందంగానూ ఉన్నది, ఎంతో బాధాకరంగానూ ఉన్నది. చక్కగా అమరిన పూలమాల ఎంతటి అపరిమితమైన ఆనందాన్నిస్తుందో అంతకు పదివేల రెట్లు ఎక్కువ బాధ కలిగిస్తుంది రాలినట్టి పూలమాలిక. కాని కొందరి జీవితాలు అటువంటివే. రాలినట్టి పూలమాలికలే అని. కాని, ప్రయత్నములకు సాక్షిగా అదే పదివేలు : మనఃపూర్వకమైన ప్రయత్నాలకు సాక్షిగా ఉంటే, రాలిన పూలమాలా అంగీకారమే జీవుల బాగోగులను విలువకట్టే ఆ దివ్యవ్యక్తికి.

ఆ రోజులలో గ్రామఫోన్ రికార్డులు అంటే నాకు వెర్రి సరదా. బెంగుళూర్ నాగరత్నం పాటలు, ఒకటో రెండో కోయంబత్తూరు తాయి పాటలు. నారాయణ అయ్యంగార్ గోటువాద్యము, మహబూబ్ జాన్ పాట, హీరాబాయి బలోదేకర్ పాట, ఇటువంటివన్నీ సేకరిస్తూ ఉండేవాడను. ఒకొక్కప్పుడు ఇంట్లో బియ్యం నిండుకున్నా ఆనాడు వచ్చిన అబ్దుల్ కరీమ్‌ఖాన్ రికార్డ్ కొనుక్కువచ్చి, ఆ ఒక్క పాట మరీ మరీ వింటూ ఉండి పోయేవాడను – ఇంటి గొడవ ఏమీ పట్టించుకోకుండా. వీణ ధనం వాద్యం వింటూ ఉంటే అన్నపానీయాలు అక్కర లేదు, నిజంగా.

అమలాపురంలో గ్రామఫోన్ షాప్ పెట్టుకున్న సూచిరాజు "పాప" నాకు స్నేహమయ్యాడు. "పాపగార్ని" ఎరుగనివారు లేరు కోనసీమలో. "పాపా" వాడ్రేవు జగ్గరాజూ – వీరిద్దరూ అందరికీ పరిచితులే. అందరూ వీరిద్దరినీ ఆప్యాయతతో పలకరించేవారే. ఎటొచ్చీ జగ్గరాజు మంచితనము. ఆంధ్రదేశం

యావత్తూ ప్రసరించింది. ఎవరి విషయమో కాశీలో మదనమోహన మాలవ్యాతో మాట్లాడడానికో, ఢిల్లీలో అన్సారీతో చెప్పడానికో, వాల్తేరులో రాధాకృష్ణను ఒప్పించడానికో ఎప్పుడూ ఏదో అర్జంట్ పనిమీద ఉంటాడు జగ్గరాజు. తన విషయం ఏమీ పట్టించుకోడు. అటువంటి లోకసేవకులు చాలా అరుదు—ఒకరో ఇద్దరో ఉంటారు ఈ తరంవారిలో. కోరా ఖద్దరు దుస్తులూ, చేతిలో ఒక జోలి, ముఖాన పెద్ద ఇంత కుంకుమ బొట్టు, పేటెంట్ ఐన చిరునవ్వుతో 'డరోతీ' స్టీమర్‌లోనో, చామర్లకోట స్టేషన్‌లోనో, మద్రాస్‌లో పార్థసారథి గుడిలోనో, బెంగుళూర్ లాలాబాగ్ తోటలోనో చూడవచ్చు జగ్గరాజును. ఎప్పుడూ అతని జేబులో ఆరు సంపెంగ పువ్వు లుంటాయి. ఎక్కడ సేకరించి ఉంచుతాడో వాటిని, అల్లంతదూరానసనే నన్ను చూచి ఆనవాలు గట్టి గబగబా నాకేసి వస్తాడు. "సాంబమూర్తిగారు రమ్మన్నారు, అర్జంటుగా వెళ్ళిపోతున్నాను, మళ్ళా కనిస్తాను" అంటూ నా చేతిలో ఒక సంపెంగ పువ్వు ఉంచి, తుర్రు మంటాడు జగ్గరాజు. ఆ మళ్లా కనిపించడము ఎప్పటికో: ఏ హవురా ప్లాట్‌ఫారమ్ మీదనో, ఏ కనక దుర్గ గుడిలోనో!

'పాప' కూడా అటువంటివాడే. ఎటొచ్చీ అతని వ్యాపకము ఎక్కువగా కోనసీమలోనే. సంపన్నులూ, సాధారణులూ కూడా అతనివల్ల ఏదో మేలును పొందినవాళ్లే. బళ్ళవాళ్లూ బస్ డ్రైవర్లూ ఎంతో ప్రేమతోనూ భక్తితోనూ చెప్పు కుంటారు. "పాప"కు తెలియని సర్కార్ ఉద్యోగస్థుడు లేడు. అతనిమాట ఎంతో పాటిస్తారు ఎటు ంటి పెద్ద ఉద్యోగీ, చిన్న ఉద్యోగీ కూడా.

పాప ఇంట్లో కూర్చుని ఆవేళనే వచ్చిన క్రొత్త రికార్డ్‌లు చూస్తున్నాను. నాకు చాలా ఇష్టమైన మైసూర్ చౌడయ్య సప్తతంత్రులు వయొలిన్ వింటున్నాను. 'పాప' ఏదో పని చూచుకుంటున్నాడు. గుమ్మంలో అందమైన జట్కాబండి ఆగి ఒక యువకుడు లోనికి వచ్చాడు. 'పాప' లేచి వెళ్ళి ఆయనకు స్వాగతము చెప్పి లోనికి తీసుకువచ్చి కూర్చోపెట్టాడు. అదేదో ఊరు ముఖాసాదారు, వీరికి మీ లాగనే గ్రామఫోన్ రికార్డ్‌లు అంటే వెర్రి ప్రీతి. క్రొత్త రికార్డ్‌లను చూడడానికి

వచ్చారు అని నాతో చెప్పి, నేను ఫలానా అని వారితో చెప్పాడు. ఆయన పడక కుర్చీలో కూర్చొని, ఏదో ఆలోచిస్తూ ఉండిపోయారు. నా కిష్టమైన క్రొత్త రికార్డ్లను వింటూనే, నేను ముఖాసాదారు కోసమని మంచి మంచి రికార్డ్లు తీసి ఉంచసాగాను, ఆయన నన్ను అలా సెలెక్ట్ చెయ్యమని చెప్పకపోయినా. పల్లడం సంజీవరావు ఫ్లూట్, వీణ ధనం భైరవి రాగాలాపన, అబ్దుల్ కరీమ్ "పియాబినా", ద్వారం వెంకటస్వామి నాయుడు కల్యాణిరాగాలాపన, కస్తూరి రంగరంగ పాట, మహ్మద్ రఫీ ఘజల్, ఇటువంటివి అతి ప్రశస్తమైనవి ఒకఇరవై రికార్డ్లుఏరి ముఖాసాదారు ముందు ఉంచాను; "ఇవి చాలా మంచివి. దమవంటి వారివద్ద తప్పక ఉండదగినవి" అంటూ. ఆ అబ్బాయి ఏవేవో కలలు గంటున్నారు కాబోలు, నా మాటలకు ఉలిక్కిపడి లేచారు. నా సెలెక్షన్ చూశారు. నాతో ఏమీ అనకుండా, కుర్చీనుంచి లేచీ నుంచుని "వెళ్తానండి, పాపగారూ! వేరే అర్జంట్ పని ఉంది. ఆనక మనిషిని పంపుతాను. క్రొత్తగా వచ్చిన డ్రామా సెట్లు, కామిక్ పాటలు పంపండి ఒక డజను" అంటూ వెళ్ళిపోయారు ఆయన.

నా ఆశాభంగమును చూచిన 'పాప' నవ్వుతూ అన్నాడు : నాకు తెలుసు, మీరు వృథాగా శ్రమపడుతున్నారని. "మీరు కోరిన సంగీతము ఎందరికి నచ్చుతుంది అనుకున్నారు? నూటికి ఏ ఇద్దరికో! ఆ ఇద్దరిలో ఒకరు మీరు, రెండవ వాణ్ణి నేను. అంతే !!

నిజమే! పుదీనా పువ్వు పరిమళానికి అలవాటుపడి, పూటకు పన్నెండు కిళ్లీలు నమిలివేసే వారెందరికి తెలుసు, అచ్చపు పచ్చకప్పురపు తావు ఇయ్యగల అపూర్వమైన ఆనందము!

స్నేహితుడు కొంపెల్ల జనార్దనరావు స్వగ్రామము అమలాపురానికి సమీపాననే ఉన్న గంగలకుర్రు. గంగలకుర్రు ఊరు చాలా బాగుంటుంది—ముఖ్యంగా, జనార్దనరావు ఇల్లు ఉన్న ప్రదేశం ఒక ఋషివాటికలా ఉంటుంది. చుట్టూ కొబ్బరి తోటలు, పనసతోటలు, మధ్య మధ్య ఆకుపచ్చని వరిచేలు. ఆ తోటల మధ్య

## సాగుతున్న యాత్ర

ఒక వెయ్యి వంకరలు తిరిగి ప్రవహిస్తూంది గోదావరి చిన్న పాయ ఏదో. ఆ అందమైన పర్ణశాలలో ఉన్నారు జనార్దనరావు తల్లి అతని సోదరుడు సూర్యారావూ అక్కగారు కవయిత్రి చావలి బంగారమ్మా.

ఒక సంవత్సరాది పండుగకు ఈ పర్ణశాలకు వెళ్లాను నేను. జనార్దనరావు పట్నంలో ఉన్నారు. ఆ హాయదారి జబ్బు ఇంకా అంటలేదు అతనిని. అతనికి ప్రతిగా పండుగకు ఇంటికి వచ్చిన తమ్మునిగా ఆదరించారు బంగారమ్మ నన్ను. కవయిత్రి తాను క్రొత్తగా రచించిన అందమైన పద్యం చదివి వినిపించారు నాకు.

అందాలు తానె చూసింది,

నీటిలో చందాలు తానె చెప్పింది

నాతోటి,

ఒడ్డున్న మందార ఒంగి బొట్టెట్టుకుని

అందాలు తానె చూసింది !

సొగసెల్ల చూసేను సొమ్మసిలి పోయేను,

చెట్లంటి పాములే చెరువెల్ల పాకేయి

అందాలు తానె చూసింది !

ఆ వింతల్ని చూసింది,

అప్పుడే ఆకాశ మడలిపోయింది

## సాగుతున్న యాత్ర

గజ గజా ఒణికి తొగట్లపై ఒరిగింది,
సూర్యుడే చెట్టెక్కి చూడ భయపడ్డాడు !

అందాలు తానె చూసింది !

జుట్టెల్ల విరియబోసింది
మందార బొట్టెట్టె చెదిరి రాలింది
గట్ల గుండెలు కలగ మెట్ల కన్నులు చెదర -
ఒంగున్న మందార ఒంగియే ఉండి ఆ

అందాలు తానె చూసింది

నాతోటి
మందార మాటలాడింది.

ఈ జీవితంలో నేను చూచిన ఏబదికి పైగా సంవత్సరాది పండుగలలోకి అల్లా మరీమరీ విలువ కలదిగా భావిస్తాను నేను అలా గంగలకుర్రులో పర్ణశాలలో గడపిన ఆ పండుగె రోజును. వారి ఆప్యాయపు స్మృతి అలాగునే ఉండి పోతుంది విడువని పరిమళంగా.

నా అమలాపురపు పర్యటనము నాకు మరొకందుకున్నూ మరీ మరీ జ్ఞాపకం ఉంటుంది. ఆ రోజులలోనే ఒక పర్యాయం ఒక అపూర్వమైన అను రాగపు జల్లు కురిసింది నాపైన. సంఘమర్యాదల రీత్యా, నాఅలవాట్ల రీత్యా నా జీవితంలోకి ఈ వింత ఆనందము వచ్చి ఉండకూడదు. కాని, ఎలా వచ్చిందో, వచ్చింది అతి విచిత్రమైన అనుభవము.

## సాగుతున్న యాత్ర

సాధారణంగా, ఇద్దరు వ్యక్తులు ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకున్నప్పుడు వారి ఆప్యాయత పరస్పరము సరిసమానంగా ఉంటుంది అనుకుంటాము. కాని, ఈ బాంధవ్యంలో మాత్రము ఆ వేపే ఎక్కువగా మొగ్గింది మా అనురాగపు త్రాసు. ఇది నన్ను ఆమె దెస మరింత బాధ్యుణ్ణి చేసింది. ఇలా అవతలవారికి మరింత విలువ కలవారము మనము అని తెలిసినపుడు హృదయం అనిర్వచనీయమైన కృతజ్ఞతాభావంతో నిండిపోతుంది. ఏ పూర్వజన్మ సుకృత ఫలమో అనిపిస్తుంది ఈ అపూర్వపు ప్రేమ సంపద.

ఇన్సూరెన్స్ పనిమీద ఎక్కడెక్కడో తిరిగి, ఏరాత్రివేళనో అక్కడకు జేరిన నా కొరకు సిద్ధంగా అమర్చబడి ఉండేవి వెండి గిన్నెలో, ఏలకుల పొడి చల్లిన వేడి వేడి ఆవుపాలు, పళ్లెంలో చక్కెరకేళీ అరటిపండ్లు. నేను పాలు త్రాగుతూ పండు తింటూన్నంతసేపూ నా ప్రక్కనే నిలుచుని విసనకర్రతో విసరుతూ ఉండేది ఆ ప్రేమంపురాశి. ఇలా సేవ చెయ్యడములో ఎంత ఆనంద మున్నదో వారికి! దీపపువత్తి సన్నగించివచ్చి, పడకకుర్చీలో కూర్చుని ఉన్న నా పాదములను తాకుతూ నా ఒడిలో తల ఉంచుకుని, నన్ను కబుర్లు చెప్పమని వింటూ ఉండేది. తమలపాకులు చీల్చి ఇస్తో అప్పుడప్పుడు, తల పైకెత్తి ఊరికే నా ముఖంకేసి చూసేంది. ఏదో అడుగబోతున్నది అనుకునే వాడను, ఏమీ అడిగేది కాదు.

వట్టి అమాయకురాలు. కోనసీమలోనేపుట్టి, కోనసీమలోనే పెరిగిన ఆ బాల ఎన్నడూ గోదావరి దాటి ఎరుగదు! ఏవో కొన్ని తెలుగు ప్రబంధాలతో కాస్త కాస్త పరియమో ఏమో గాని, ఒక్క ఇంగ్లీష్ మాట రాదు. కాని, గంటల తరబడి మాట్లాడుతూ ఉండిపొయ్యే వాళ్ళము. బయటిలోకమును గురించి తెలుసుకోవాలని ఉండేది ఎంతో ఆబేల మనస్సులో. పట్నవాసపువారుఎటువంటి దుస్తులు ధరిస్తారు, ఎలా ముస్తాబు అవుతారు, ఏఏ విషయాలను గురించి మాట్లాడుకుంటూ ఉంటారు, ఏ ఏ వ్యాపకాలలో ఎక్కువ ఆసక్తి వారికి అని, ఊరికే ప్రశ్నిస్తూ ఉండేది నన్ను. ఒకసారి అన్నాను నేను "పోసీ, నాతో రారాదూ! కార్‌లో తీసుకువెళ్ళి కాకినాడ,

రాజమహేంద్రవరమూ, విశాఖపట్నమూ, మద్రాసూ చూపిస్తాను. నీవు అనుగుతున్న వారినందరినీ నీవే స్వయంగా చూద్దువుగాని" అని. "బాబోయ్! నేను రాను! నాకు భయం" అన్నది వెంటనే. ఒక్కక్షణం ఆగి, మళ్లా అన్నది: "ఇలాగే ఉండనియ్యండి నన్ను! మీకు మనస్సు వచ్చినపుడు చూచి వెళుతూ ఉండండి నన్ను, అంతేచాలు!!" అని. "ఎక్కడనుంచి వస్తుంది ఈ ఆప్యాయత? ఏదేవతలు కురిపిస్తారు ఈ తేనెవాన" అనుకునేవాణ్ణి నేను.

ఒకసారి, సౌదాయపాలెం వెళుతూండగా, ఒక అమ్మాయి పొలంనుంచి వస్తూ పచ్చిగడ్డి మోపుపైన ఒక మొగలి పువ్వును ఉంచి నెత్తిన పెట్టుకొని నా కెదురుగా కనిపించింది. కార్ ఆపి, "అమ్మాయీ! ఈ మొగలిపువ్వు ఎంతకిస్తావు?" అన్నాను నేను. ఇన్ని చిరుగవ్వలు గలగల కదలించిన నువ్వనంతో అన్నది, ఆ అమ్మాయి: "అమ్మడానికి కాదు బాబూ! నా సొంతానికి తెస్తున్నానండి, మా పొలంనుంచి" అని. నేను వెంటనే ఒక అర్ధరూపాయకాసు ఆమె చేతిలోఉంచబోతూఅన్నాను: "పువ్వు నాక్కావాలి" అని. "డబ్బులెందుకండిబాబూ! సంబరపడుతున్నారు. పట్టుకెళ్ళండి, ఇదుగోనండి పువ్వు!" అంటూ మొగలి పువ్వు నా చేతికిచ్చింది. డబ్బు తీసుకోలేదు. డ్రైవర్ వెంకటేశ్వర్లు "తప్పు! అయ్యగారు సంతోషంతో ఇచ్చిన డబ్బులు ఒద్దనకూడదు, తప్పు!!" అని మందలిస్తే గాని పుచ్చుకోలేదు ఆమె పైకమును. ఆ సొమ్ము తీసుకుని నవ్వుతూ వెళ్ళిపోయింది పచ్చిగడ్డిమోపు నెత్తి నెత్తుకొని.

ఆ మొగలిపువ్వు తీసుకువచ్చి ఇక్కడ ఇయ్యగా, ఈ అమాయకురాలు అపార్థం చేసుకుంటూ అన్నది: "పల్లెటూరివారము, మోటువారము అనేనా మొగలి పువ్వు తెచ్చారు. ఆ మొగలి రేకులు తలలో పెట్టుకున్న నన్ను చూచి నవ్వాలనేనా మీ ఉద్దేశము!" అన్నది కాస్త రోషంలో.

నేను నిర్ఘాంతపోయాను. నా కేమి తెలుసు, అమలాపురం ప్రాంతంలో

మొగలి పువ్వులు మోటుగా భావిస్తారు మనవారనీ పాటకపు జాతివారే పెట్టుకు మురిసిపోతారు అనీ! "అబ్బే! అలా కాదు!! నాకు మొగలిపువ్వు చాలా ఇష్టము. సెలవలకు ఇంటికి వెళ్ళినప్పుడల్లా విజయనగరంనుంచి మొగలిపువ్వులు తీసుకు వెళ్లేవాడను నేను. మా చెల్లెలు మొగలి రేకులతో జడఅల్లించుకుని మురిసిపోవడం చూచి ఎంతో ఆనదించేవాడను" అన్నాను నేను.

"నిజంగా! నిజంగానా!! మీ కంత ఇష్టమా, మొగలి పువ్వులు! అయితే, ఇదుగో ఇప్పుడే పెట్టుకుంటా నా తలలో!" అంటూ మధ్యరేకులు తీసి, కొంగుతో తుడిచి మడిచి తన జడలో దురుముకుని, నా వద్దకు వచ్చి, "బాగున్నాయా, నా తలలో!." అన్నది. ఇంతటి అమాయకత్వముంటుందా లోకంలో!

వెన్నెలరాత్రులందు దక్షిణపు వసారాలో మల్లెపందిరకు ప్రక్కనేఉన్న తిన్నెపైన గోడకు జేర్లబడి అలాగే ఉండిపోయేవాళ్ళము చంద్రుణ్ణి చూస్తూ. ఆ వెన్నెలలో ఒత్తుగా వికసించిన మల్లెపువ్వులు పందిరపైన పిండారబోసినట్టు ఉండేవి. పువ్వులను అలాగే చూస్తూనే ఉండాలి. ఒక్క పువ్వైనా కొయ్య కూడదు—మచ్చుకు ఒక పువ్వు అయినా, అని ఒకనిబంధన ఏర్పరచుకునేవారము, కాని, రాత్రి సాగగా, సాగగా ఆ మల్లెల సౌరభాన్ని ఊరికే ఆఘ్రాణిస్తూ ఉండలేక చప్పున లేచివెళ్ళి, ఒక్క దోసెడు పువ్వులు కోసి, చెండుగా గ్రుచ్చి నా ఒళ్లో పడవేస్తేగాని ఆమెకు తోచేది కాదు. ఆమెను నా ఒడిలోకి తీసుకుని, ఆ చెండు ఆమె జడలో తురిమేవాడను. "మీ కిచ్చిన పువ్వులు నా తలలో తురుమడ మేమిటీ! బాగుంది వరస!!" అంటూ లేనికోపంలభినయిస్తూ, మళ్లా వెళ్లేది మల్లె పందిర వైపు మరిన్ని పువ్వులు కోసి ఇంకో చెండు కట్టే ఉద్దేశ్యంతో. ఆమెను చెయి పట్టుకులాగి పువ్వులు కోయకూడదు అనేనిబంధనను జ్ఞాపకం చేసేవాడను! ఆమె వింతగా నవ్వేది.

ఇటువంటి ఒకానొక వెన్నెలరాత్రిని చంద్రునికి ఎంతో దగ్గరగా కని

పించింది వెన్నముద్దలా పెద్ద నక్షత్ర మొకటి, ధగ ధగ లాడుతూ - శుక్రుడను కుంటా. ఎంతో కాంతివంతంగా ఉంది చంద్రునికి అంత దగ్గరగా ఉన్నా ఆ నక్షత్రము. ఆ నక్షత్రాన్ని చూపిస్తూ అన్నది ఆమె "చూడండి! చూడండి!! ఎంత పొత్తుగాఉన్నాయో ఆనక్షత్రమూ చంద్రుడూను. చంద్రుడు మీరూ నక్షత్రాన్ని నేనూ! అని, కిలకిలా నవ్వింది. కాని, ఉత్తరక్షణమే వర్ణింప నలవికాని బెంగ ఆవహించింది ఆమె ముఖమంతా. నన్ను అంటిబెట్టుకున్న ఆమె లేత శరీరము కంపించి పోయింది. కొలకుల నిండిన కన్నీటిని ఇట్టే అపుకుంటూ ఆమె అన్నది: "రేపటికి ఎంత దూరమై పోతాయో నక్షత్రమూ చంద్రుడూను, మన లాగే—" అంటూ ముఖము అటు త్రిప్పుకుంది,

ఎలా గ్రహించిందో ఆమె, రేపు నేను వెళ్ళిపోతున్నాననీ, ఇకమళ్ళా మేము కలుసుకోమేమోననీ! నేనే చెపుదామనుకున్నాను — ఏ తెల్లవారుజాముననో. కాని, నేను చెప్పకుండానే ఆమె తెలుసుకుంది. ఆమె ముఖమును నావైపు త్రిప్పుకుంటూ, బుజ్జగిస్తూ, నాలో లేని ధైర్యం తెచ్చుకుంటూ అన్నాను: "అబ్బే! అబ్బే!! అలా అధైర్యపడకూడదు, తప్పకుండా మళ్ళా కలుసుకుంటాముగా" అని.

కాని, ఆమెక్కు అటువంటి ఆశ లేదు.

ముప్పది ఏండ్ల క్రిందటి మాట. శేషజీవితంలో ఎప్పుడో ఒకపర్యాయం మళ్ళీ వెళతాను నేను, ఆమెవద్దకు. దీపాలవేళకు వారి ఇల్లు జేరుతాను నేను. ముందుగా తెలియజెయ్యను నా రాక గురించి. కాని, వీధి గుమ్మ మెక్కి గడప దాటి ఇంటిలో అడుగు పెట్టేసరికి ఆమెకు తెలిసిపోతుంది — ఎక్కడో నూతి దగ్గర ఏదో పనిలో ఉన్న ఆమెకు తెలిసిపోతుంది. తులసి కోటవద్ద ప్రమిదలో వత్తి వెలిగిస్తున్న ఆమె జ్యోతిని వణికే చేతులతో దీపపు గూటిలో అమర్చి,

# సాగుతున్న యాత్ర

గబగబ వస్తుంది నడవాలోకి నావద్దకు. అడుగులు తడబడుతూ వస్తుంది గబ గబ !

ఆమె మట్టెల చప్పుడు వినిపిస్తూంది నాకు.

ఆప్యాయంలో నేనందిస్తున్న మొగలి రేకులను రెండు చేతులతోనూ పుచ్చుకొని కళ్ళ కద్దుకుంటుంది; రెండు మూడు పర్యాయాలు. ఈ కంటికీ, ఆకంటికీ. ముహూర్తకాలము నిశ్శబ్దము—జంట హృదయాల దడదడ తప్ప.

మాటలు రావు; భాష ఉపకరింపదు, ఆ నిమిషము.

# ౨౦

క్షీరము మున్ను నీటి కొసగెన్ స్వగుణంబులు దన్ను జేసటన్
క్షీరము దప్తమౌటగని చిచ్చురికెన్ వెతచే జలంబు దు
ర్వార సుహృద్విపత్తిగని వహ్ని జొరంజనె దుగ్ధ మంతలో
నీరము గూడి శాంతమగు, నిల్చు మహాత్ముల మైత్రి ఈగతిన్.

భర్తృహరి సుభాషితము

చిన్నప్పుడు మా పినతండ్రి కృష్ణమూర్తిగారు తరుచు ఉదాహరిస్తూ ఉండే వారు భర్తృహరి శ్లోకాలను సందర్భానుసారంగా. చాలా అందమైన భావము సుమా, అనుకునే వాడనేగాని, పెద్దయ్యాకగాని తెలియలేదు ఇటువంటి సుభాషితపు నందలి పూర్తి అందము. స్నేహభావాన్ని ఎంత చక్కగా విశదపరచారు కవి :

క్షీరనీరన్యాయము సుప్రసిద్ధము. స్నేహమంటే అలా ఉండాలి. తనతో కలిసినంతనే నీటికి తన స్వరూపాన్ని ఇచ్చివేసింది క్షీరము. పొయిమీద ఉంచగా, ఆ వేడికి పాలు కాలుతున్నాయి అనే బాధ భరింపలేక ముందుగానే నీళ్ళు నిప్పు లోకి ఉరికాయట! స్నేహితుని అనుసరించి వెంటనే పాలున్నూ నిప్పు పాలు కావడానికి సిద్ధమగుతూండగా, నీళ్ల చల్లగా, పాలు శాంతించినవట! మంచివారి మధ్య స్నేహం ఇంత అన్యోన్యంగా ఉంటుంది.

అమలాపురం క్లబ్‌లో మా టెన్నిస్ బృందములో ఒకాయన కాస్త పెద్ద వారు, కొంచెం పూర్వకాలపు మనిషి, వకీలు సోమేశ్వరరావు చాలా మంచివారు. అమాయకులు కూడాను. కుర్రకారు మెంబర్లు కొందరు ఆయనను ఎప్పుడూ ఏదో

చిలిపి విషయంగా హేళన చేస్తూ ఉండేవారు. ఇది నాకు ఇష్ట ముండేది కాదు. ఏదో అవకాశం కల్పించుకుని ఆయనతో ఊరికే సరదాగా మాట్లాడుతూ ఉండి పోయే వాడను నేను — తతిమ్మావారు ఆయన జోలికి రాకుండా. ఒక రోజున టెన్నిస్ ఆట అయిపోయిన కాస్సేపటికి పేకాటలోనికి వెళ్లేవారు పేకాటలోకి ఇంటికి వెళ్లిపోయేవారు ఇంటికీ వెళ్లుతూండగా సోమేశ్వరరావుగారు తామున్నూ లేచి టెన్నిస్ రాకెట్ తీసుకుని తమ ఇంటివైపు బయలుదేరారు కాలి నడకను. నేను కాసేపు క్లబ్‌లో వీరితోనూ వారితోనూ కబుర్లు చెప్పి ఇవతలకు వచ్చి నా టూసీటర్ సిట్రాయన్ కార్ ఎక్కి బయలుదేరాను, బంగళాకు వెళ్ళక ముందు అలా షికారుగా గోదావరి వైపు వెళ్లివద్దామని. ఒక ఫర్లాంగు వెళ్లేసరికి నా యెదుట కాలి నడకను వెళుతూన్న సోమేశ్వరరావుగారు కనిపించగా, కార్ ఆపి ఆయనను నా ప్రక్కన కూర్చోపెట్టుకున్నాను. మొదట ఆయన అన్నారు: "ఎందుకు మీకు శ్రమ? ఇంటికి నే నెప్పుడూ కాలి నడకనే వెళ్లుతాను. రోజంతా కోర్టులో నిలబడి వాదించే వారికి ఇదే శాస్త్ర వ్యాయామం" అని. "అబ్బే! నాకేమి శ్రమ? ఇద్దరమూ కలిసి అలా గోదావరివైపు షికార్‌గా వెళ్లి వద్దాము, ఆ తర్వాత మిమ్మల్ని మీఇంటి వద్ద దిగపెడతాను" అంటూ బెండమూరులంక వేపు కార్ పోనిచ్చాను.

సూర్యాస్తమయ సమయం. గోదావరి ఎంతో బాగుంది. వరద గోదావరి. ఏ వెయ్యిమైళ్ళ అవతలనో బయలుదేరిన నది ఎన్నో పిల్లనదులను తనలో కలుపుకొని నురగలు గ్రక్కుకుంటూ వడి వడిగా సాగిపోతోంది సముద్రుని కలుసుకోవాలనే తహతహతో. ఆ దృశ్యాన్ని చూస్తూ అలాగే ఉండిపోయాము చాలా సేపు వకీలుగారూ నేనూ.

తిరిగి వస్తూ, ఆయనను వారి ఇంటి వద్ద దిగపెడుతూండగా, ఆయన అన్నారు: "ఒక్కక్షణం లోనికి వచ్చి వెళ్ళండి" అని.

వారితో కూడా వారి ఇంట్లోకి వెళ్లాను. బంగాళా పంపిణీ ఇల్లు. చుట్టూ కొబ్బరితోట. ఎంతో ప్రశాంతంగా ఉంది. దక్షిణపు వేపు వసారాలో పడక

కుర్చీలు అమర్చి ఉన్నాయి. నన్ను కూర్చోమని చెప్పి ఆయన లోనికి వెళ్ళి, కాళ్లూ చేతులూ కడుగుకొని వచ్చి కోట్టు దుస్తులు తీసివేసి, మల్లు పంచె, పైమీద దువ్వాలుతో వచ్చి నా ప్రక్కన కూర్చున్నారు.

"ఈ రాత్రి మా ఇంటనే భోంచేయాలి మీరు" అన్నారు సోమేశ్వరరావు. ఆయన ఆదరణకు సంతోషిస్తూ, "భోజనానికేమి? ఎప్పుడైనా భోంచేయవచ్చు. నేను స్నానమూ అదీ చెయ్యాలి, వ్రాసుకునే పని కూడా ఉన్నది. రేపు రాత్రి తప్పక వస్తాను" అన్నాను.

"సరే, అల్లాగే. మీ వీలు చొప్పునే కానివ్వండి. రేపే రండి. రేపు బహుశా నేను క్లబ్‌కి రాను. మీరే తిన్నగా వచ్చివెయ్యండి" అన్నారు.

మరునాటి రాత్రి వారితో కలసి భోంచేసి, తమలపాకులు వేసుకుంటూ ఉండగా, ఆయన అన్నారు: "నేను మనస్సు విప్పి చెప్పుతున్నాను. మీవంటి మంచి వారిని నేను ఇదివరకు చూడలేదు. నాకు చాలా అనుభవమున్నది. తెల్లారితే, రక రకాల ప్రకృతుల వారిని చూస్తూఉంటాము. కాని, మీలాగ అవ్యాజంగా ఒకరిపైన ఇలా సద్భావం చూపేవారు చాలా అరుదు. ఐనా, మీ సంప్రదాయము గొప్పది. మీ నాన్నగారిని నేను ఎరుగుదును. నేను మద్రాస్‌లో బి. ఎల్. చదువుతూండగా అప్పుడప్పుడు వారి పేర్మన వినగుతూండేది. అప్పుడు మీరు చాలా చిన్నవారు. మీ కుటుంబ విషయాలున్నూ నాకు కొన్ని తెలుసు. మీరు పడినకష్టాల గురించిన్నీ విని ఉన్నాను ఆ కష్టాల మూలాననే మీలో ఇతరులయెడ ఇంతటి ఆర్ద్రభావం కలిగినదేమో ఒకవేళ. క్లబ్‌లో మీరు నాదెస చూపుతున్న సౌజన్య భావమూ నిన్న సాయంత్రము కార్ ఆపి నన్ను కూడా తీసుకు వెళ్ళడమూ, త్రోవ పొడుగునా మీ మాట తీరూ — ఇటువంటివి నన్ను మీ దెస బంధించి వేశాయి. నాదెస మీరు చూపిన మంచితనానికి ప్రతిగా నేను చేయకలిగినది ఏమీ లేదు. ఏదో దేవుడు ఇంత ఇచ్చాడు. దానిలో సాగిపోతోంది సంసారం. మావాడు ఒకడు ఎఫ్. ఏ. చదువుతున్నాడు మద్రాస్‌లో. ఆ పరీక్ష పూర్తి అయ్యాక ఎమ్. బి.

చదువుతాడు. ఉమామహేశ్వరరావు ప్రాక్టీస్ ప్రారంభించేసరికి అతనికి ఉపయోగ పడేటట్టు ఒక పదివేలకు పాలసీ పుచ్చుకుంటున్నాను మీ కంపెనీలో. కాగితాలు మీ వద్ద ఉన్నాయా ? సంతకం చేసి ఇప్పుడే సొమ్ము చెల్లిస్తాను" అన్నారు.

నేను ఆశ్చర్యపోయాను. నా ఇన్స్యూరెన్స్ వ్యాపకములో ఇది అపూర్వమైన అనుభవం. ఆ మధ్య ఎప్పుడో ఒకసారి ఒక గుజరాతీ మిల్లు యజమాని తాడేపల్లిలో తమ ఇంటికి నన్ను భోజనానికి పిలిచి, నాకు క్రొత్త బట్టలు కట్టబెట్టి, ఒక పదిహేను వేలకు ఇన్సూర్ చేశారు — బందర్ నుంచి బెజవాడవస్తూ అతనినీ అతని భార్యనూ, చంటివానినీ నాతో కూడా కార్లో ఎక్కించుకు తీసుకు వచ్చినది జ్ఞాపక ముంచుకుని, ఇక్కడ మళ్లీ సోమేశ్వరరావు. ఎంత మంచివారు ఈయన! లోకము చెడ్డది, చెడ్డది, అంటారు గాని, ఇటువంటి వారుండగా లోకము చెడ్డది ఎలా అవుతుంది?

"కాగితాలు కార్‌లోనే ఉన్నవి, వెళ్ళి తీసుకువస్తాను సంతోషంతో. కాని, మీరు చూపుతున్న ఈ ఆప్యాయతకు నేను తగను. మీ విషయంలో నేను చేసినది ఏమీ లేదు. నన్ను అనవసరంగా శ్లాఘిస్తున్నారు. నాకు మీరు ఏవిధంగానూ బాధ్యపడి ఉండలేదు"—అని నేను ఇంకా ఏమో చెప్పబోతూండగా, ఆయన నా మాటలకు అడ్డము వచ్చి, ఎంతో ప్రేమతో అన్నారు : "నాయనా! హృదయపు విలువ హృదయానికి తెలుసు. వెళ్లు, కాగితాలు పట్టుకురా. మీ పుస్తకం చూచి, చెక్కు ఎంతకు వ్రాయాలో చెప్పు!" అన్నారు.

నా అదృష్టాన్ని నేను నమ్మలేకపోయాను నేనే. కొన్ని నెలలు విపరీతంగా శ్రమపడినా లభింపని పాలసీ ఒక్క క్షణంలో, అయాచితంగా రాలింది నాచేతిలో, ఏమిటీ వింత!—అనుకున్నాను.

చెక్‌బుక్ తీస్తూ, ఆయన ఆఫీస్ కాగితాలతో బాటు ఇలస్ట్రేటెడ్ వీక్లీ కూడా బయట ఉంచారు సోమేశ్వరరావు. ఒకసారి చూస్తానని చెప్పి, వీక్లీ పేజీలు

తిరగవేస్తూఉండగా వారు పూర్తిచేసిన క్రాస్ వర్డ్ పజిల్ కనిపించి వారిని అడిగాను : "ఈ పజిల్స్‌లో ఆసక్తి ఉన్నదా మీకు; అంత తీరిక ఉన్నదా మీకు" అని.

"ఏదో, ఇదో వ్యాపకము!" అన్నారు ఆయన.

తరువాత అమలాపురంలో కొన్నాళ్ళుండి, బెజవాడ చేరాక ఆయన పాలసీ ఆయనకు పంపించాను. ఆ తర్వాత ఒక నెల రోజులకు కాదోలు, మన్నాలపులాపురం వెళ్ళినప్పుడు వారింటికి వెళ్లాను. ఇంట్లో ఎవరూ కనిపించలేదు. ప్రక్క ఇంటిలో వాకబు చెయ్యగా, ఆ ఇంటివారు, కూచిమంచివారనుకుంటాను, ఇలా అన్నారు :

"ఏమిటి! మీకు తెలియదా? సోమేశ్వరరావుగారు ఇప్పుడు మద్రాస్‌లో కాపురము. నెలా పదిహేను రోజుల క్రితము వీక్లీ క్రాస్‌వర్డ్ పజిల్స్‌లో వారికి పాతిక వేల రూపాయలు బహుమతి వచ్చింది! మద్రాస్ హైకోర్ట్‌లో ఎడ్వకేట్‌గా ఉన్న ఆయన అన్నగారితో కలిసి అక్కడే ప్రాక్టీస్ చేస్తున్నారు సోమేశ్వరరావుగారు ఇప్పుడు" అన్నారు!

* * *

అమలాపురం ప్రాంత పర్యటనలో నాతో కూడా మాన్యులు రాఘవరావు వ్యవసాయశాఖ డిప్యూటీ డైరెక్టర్ రామస్వామి, పోలీస్‌శాఖ డిప్యూటీ సూపరింటెండెంట్ విజయరంగం — ముగ్గురూ ఉంటూఉండేవారు. విజయరంగమూ నేనూ నా టూ సీటర్ సిట్రాయన్ కార్‌లోనూ వారిద్దరూ వారి కార్లోనూ కోనసీమ అంతటా తిరిగాము. వారి పనులు వారు చూచుకుంటూ, సమయానుకూలంగా నన్ను ఆ ప్రాంతాలలో కలవారికీ, పలుకుబడి కలవారికీ పరిచయం చేస్తూఉండేవారు ఆ ముగ్గురు ఆఫీసర్లూను. తరువాత నా అంతట నేను వెళ్లి ఈ పరిచయాన్ని నా ఇన్సూరెన్స్ బిజినెస్‌కు ఉపయోగించుకోవాలని ఉద్దేశ్యంగాని, అది అంతగా నెర

పేరలేదు. వారితో కలిసి కోనసీమలో అన్ని ఊళ్లూ మాత్రం చక్కగా చూచాను, నేను.

రామస్వామి బలే సరదా మనిషి. ఆయన గొప్ప క్రికెటియర్. టెన్నిస్ ఆటగాడు కూడాను. కేంబ్రిడ్జిలో ఉండగా ఈ ఆటలలో ఆయన "క్రేంబ్రిడ్జి బ్లూ" అనే బిరుదును సంపాదించుకున్నారు కూడాను. సౌజన్యశీలుడు. ఏవేవో విషయాలను గురించి ఊరికే కబుర్లు చెప్పుకుంటూ ఉండేవారము మే మిద్దరమూ. విజయరంగమూ, రాఘవరావుగారూ చాలా దోస్తీగా మాట్లాడుకుంటూ ఉండేవారు.

విజయరంగము మిక్కిలి స్నేహశీలి. ఆయన ఒక పర్యాయం మా పినతల్లి తమ్మునితో కలిసి బెంగుళూర్‌లో మా ఇన్‌స్టిట్యూట్‌కు వచ్చి నాతో నాలుగు రోజులు ఉన్నారు ఒక పది ఏండ్ల క్రితము. ఆ రోజులు జ్ఞాపకమున్నాయి ఆయనకు. అమలాపురం బంగళాలో రాఘవరావు నన్ను ఆయనకు పరిచయం చేయబోగా, ఆయన అన్నారు: "ఇంకా నయం! వీరినే ఎరుగనా? బెంగుళూర్‌లో వీరి ఆతిథ్యం ఎలా మరిచిపోగలను నేను" అని.

అమలాపురం పర్యటన అయాక రాజమహేంద్రవరంలో ఉండగా ఒకసారి విజయరంగాన్ని చూడడానికి వెళ్లాను. ఆ వెళ్ళుట చాలా తమాషాగానే జరిగింది. రాజమహేంద్రవరం మెయిన్ రోడ్‌లో ట్రాఫిక్ నిబంధనలు చీటికీ మాటికీ మారుతూ ఉండేవి ఆ రోజులలో. ఈ మార్పులు నాకు సరీగా అవగాహన అయ్యేవి కావు. ఒకచోట నాకు ఎదురుగా నిలుచునిఉన్న హెడ్‌కానిస్టేబుల్ చేయి పైకెత్తి సన్నాపి, దగ్గరకు వచ్చి "ఏదీ మీ లైసెన్స్!" అన్నాడు. నా లైసెన్స్ చూపాను. "ఈ ఊళ్లో ఎక్కడ మీ మకాము?" అన్నాడు.

"కేరాఫ్ విజయరంగం, డిప్యూ. ఎస్. పి. నేను అక్కడికే ఇప్పుడు వెళుతూంట!" అన్నాను.

డిప్యూటీ. ఎస్. పి. పేరు వినేసరికి హెడ్‌కానిస్టేబుల్ వెల్లపోయాడు. ప్రతిమలా నిలబడి నాకు మిలిటరీ సెల్యూట్ చేశాడు. తరువాత ఏమి చెయ్యాలో తెలియక బిత్తర చూపులు చూస్తున్నాడు.

చిరునవ్వు నవ్వుతూ నేను అన్నాను: "విజయరంగం బంగాళా ఎక్కడున్నదో నాకు సరిగ్గా తెలియదు. నీకు వేరే అర్జెంట్ పని లేకపోతే వారివద్దకు తీసుకువెళ్తావా నన్ను" అని. అని, కార్ తలుపు తీసి నా ప్రక్కన ఎక్కించుకున్నాను అతనిని. త్రోవలో పూల అంగడివద్ద ఆగి, అప్పుడే కడియం నుంచి వచ్చిన ఇన్ని ఎడ్వర్డ్ గులాబీ పువ్వులు తీసుకుని, హెడ్‌కానిస్టేబుల్ త్రోవ చూపగా తిన్నగా విజయరంగం వద్దకు వెళ్లాను.

విజయరంగం తోటలో పచారు చేస్తున్నారు. కార్ ఆగగానే హెడ్‌కానిస్టేబుల్ తొందరగా కార్ దిగి, ఈ వైపు పరుగెత్తుకునివచ్చి నావైపు తలుపుతీసి తలుపును పట్టుకు నుంచున్నాడు, స్టెడీగా, పువ్వులు పుచ్చుకుని నేను కార్ దిగే వరకూ. తరువాత కార్ తలుపు మూసి నా వెనుక నుంచున్నాడు, నాకు అంగ రక్షకునిలా!

పువ్వులను అందుకుంటూ, విజయరంగం చిరునవ్వు నవ్వుతూ అన్నారు: "పోలీస్ ఎస్కార్డ్‌తో వచ్చారే మా ఊరు!" అని. హెడ్‌కానిస్టేబుల్ డిప్యూటీ. ఎస్. పి. కి సెల్యూట్ చేసి వెళ్లిపోయాడు.

టీ త్రాగుతూండగా, విజయరంగం అన్నారు: "అన్నట్లు, అమలాపురంలోనే చెబుదాము అనుకున్నాను. ఏ కారణంవల్లనో మరచిపోయాను. నేను ఇంతవరకూ ఇన్సూర్ చెయ్యలేదు—ఎందరో ఏజెంట్లు పీడించినా, ప్రప్రథమంగా మీ కంపెనీలో ఇన్సూర్ చెయ్యాలని ఉన్నది, ఒక పది వేలకు. అమలాపురంలోనే చెప్పాలనుకున్నాను, మరచిపోయాను. మీవద్ద కాగితాలుంటే ఆ పని ఇప్పుడే పూర్తిచేద్దాము" అన్నారు.

ఆ విజయరంగమే ఇప్పుడు మన పోలీస్‌శాఖకు అధిపతిగానో, ఉపాధి పతిగానో ఉన్నారు.

కాని, నా ఇన్సూరెన్స్ వ్యాపకంలో ఇటువంటి అదృష్టము ఎన్నాళ్లో నిలువ లేదు. ఈ పని చాలా కష్టమైన పని. ఎక్కడో కాకతాళన్యాయంగా ఇటువంటి కేసులు ఒకటి, రెండూ సంధిల్లుతాయి, గాని ఏజెంట్లు సరిగా పని చెయ్యరు. అనేక ప్రతి బంధకాలు. విపరీతపు ఖర్చు. ఆశకొద్దీ విశాఖపట్నం నుంచి నెల్లూర్ వెళతాను కార్‌లో ఏకాఏకీని — అక్కడ ఉన్న పరపతి సంఘాల డిప్టీ రిజిస్ట్రార్ నాకెంతో బిజినెస్ ఇప్పిస్తారనే నమ్మకంతో. ఏమీ లేదు ఆశాభంగం తప్ప. ఈ కార్ ప్రయాణపు ఖర్చు అంతా నేనే భరించాలి. పైగా, ఆంధ్ర ప్రదేశ మంతటా పర్యటనం చెయ్యడానికి వీలుగా నేను కాకినాడలో ఒక ఆఫీసు, విశాఖపట్నంలో కూడా ఒక ఆఫీసూ ఉంచాను. వీటికై అయ్యే అదనపు ఖర్చు నేనే భరించాలి. అంచేత, నా వ్యక్తిగత ప్రాబల్యంవల్ల, కంపెనీకి ఇదివరకు మన ప్రాంతంలో లేని పేరుప్రతిష్ఠలు సంపాదించానన్న మాటేగాని, ఆర్థికంగా చాలా నష్టపడి పోయాను నేను. ఇదీ, మరి కొన్ని పరిస్థితులూ ఏకమై నేను నా ఇన్సూరెన్స్ పని లోంచి విరమించుకోవలసిన అగత్యం ఏర్పడింది. "ఇక ఇతను ఈ పనిలో ఉండరాదు. ఇతను మానుకున్నాక, ఆంధ్రలో వేరే ఆఫీస్ అవసరం లేదు మాకు. బెజవాడలో బ్రాంచి మూసివేసి, కాగితాలూ ఆఫీస్ సామగ్రి అంతా పట్నం పంపి వెయ్యండి" అని హుకుం జారీచేశారు, కలకత్తా నుంచి డైరెక్టర్లు.

కలకత్తానుంచి వచ్చిన కంపెనీ ఇన్‌స్పెక్టర్ బాగ్చీ చాలా ఆశ్చర్యపోయారు, "ఇదేమిటి! నువ్వు ఇంత మంచివాడవు; ఇంతటి సంస్కారము కలవాడవు; ప్రతిభావంతుడవు. ఊళ్లో అందరూ నిన్ను ఇంతగా గౌరవిస్తున్నారు. నీ బిజినెస్ ఫెయిల్ అవడము ఏమి వింత ఇది!" అని.

నేను నవ్వి ఊరుకున్నాను,

ఆ మధ్యాహ్నమే, ఆఫీస్ మూసివేసి, కాగితాలూ, సామగ్రీ అంతా వప్పించి పంపివేశాము. రైల్వే గుడ్స్ క్లార్క్ రంగయ్య, మా పాలసీ హోల్డర్, మూడేసి నెలల కొకసారి మా ఆఫీసుకి వచ్చి తన ప్రీమియం పైకము చెల్లించి వెళుతూ ఉంటాడు. నేనంటే అతనికి ఎంతో గౌరవము. అతనే వచ్చి బీరువాలకు చాపలు చుట్టించి సరిగా బందోబస్తుచేసి సామానంతా పట్టించుకు వెళ్ళి వాగెన్‌లో వేయించాడు. వెళుతూ వెళుతూ అన్నాడు: "మీరు లేకపోతే ఊరే చిన్నపోతుంది. మేము ఈవేపు రానే రాము ఇక!" అని, ఎంతో జాలిగా.

బాగ్చీని కలకత్తా మెయిల్ ఎక్కించి, కార్ నిండా పెట్రోల్ పోయించుకుని, తిన్నగా మద్రాస్‌కు ప్రయాణమయ్యాను నేను.

మద్రాస్‌లో నాన్నగారిని చూచాను. చిరునవ్వు నవ్వుతూ, అన్నారు. ఆయన ఇంగ్లీష్‌లో: "సో, యుఆర్ ఎ ఫ్రీ మాన్ నౌ!" అని. అనగా, "నీవు మళ్ళా లంకెలు లేనివాడ వయ్యావు" అని. వాయిదా షరతులపైన నాకు కార్ ఇచ్చిన కంపెనీ వారికి ఫోన్ చేస్తూ నాన్నగారు అన్నారు కంపెనీ మానేజర్ రావుతో "మావాడు మీరు అతని కిచ్చిన కార్ మీకు అప్పజెప్పడానికి వస్తున్నాడు, అప్పగించుకోండి. బాకీ వాయిదాలు నింపాదిగా చెల్లిస్తాడు" అంటూ, నా ఉద్యోగం పోవడం విషయం కూడా చెప్పారు రావుతో.

నా గుండె గతుక్కుమంది. "ఎలాగ, నా కార్‌ను నేను వదలివేయడము! మూడేళ్ళు, రాత్రింబవళ్లు నాతో వుండి, నా ఊహలను, నా అనుభవాలను, నాఆశలను, నా నిరాశను, నాతో సరిసమానంగా పంచుకున్న ఈ కార్‌ను నేను వదలుకోవలెనా! ఇది తప్పదా?" అనుకున్నాను.

కన్నులు నీరుగ్రమ్మిన నా ముఖముకేసిచూస్తూ, నాన్నగారు అన్నారు: "మీ అక్కయ్యకు టెలిగ్రామ్ ఇచ్చాను. ఈ రాత్రే నీ ప్రయాణము. ఆమె వద్ద కొంతకాలముఉండు. నింపాదిగా ఉద్యోగప్రయత్నము చెయ్యొచ్చును" అని,

తర్వాత, అన్నారు చాలా ప్రేమతో : "ఎ రోలింగ్ స్టోన్ గాదర్స్ నోమాస్ !
(దొర్లుతూన్న బొమ్మ రాయికి పాచి అంటదు) ఇదీ ఒకందుకు మంచిదేమో !
ఈ వ్యాపకము నుంచి బయట పడటమే మేలేమో ! ఎవరికి తెలుసు ?_ ముందు
నీవు ఏ వ్యాపకంలో రాణిస్తావో !", అని.

జీవితసంగ్రామంలో అన్ని విధాల ఓడిపోయిన నేను తలవంచుకు వచ్చి
వేశాను వారి సమక్షము నుండి.

కంపెనీ వారి గుమాస్తా కార్‌ను స్వాధీనం చేసుకుంటూ ఉండగా, కార్ డాష్
బోర్డుకు మధ్యగా నేను అమర్చిన చదువుకునేబల్బ్‌ఫిట్ంగ్‌ను చూచి అత
డన్నాడు : 'ఇది కార్‌తో వచ్చినది కాదు, మీ స్వంతం, తీయించి ఇస్తాను" అని,
మెకానిక్‌చేత, దానిని తీయించి ఇచ్చాడు నాకు. ఆ దీపము క్రిందనే అంటించి
ఉన్న విజిటింగ్ కార్డ్ పైన వ్రాసివున్న అక్షరాలూ చదివాడు, గోపాలరావు !

ఈ వెడయూర్పు గాడ్పు టలయింపుల గ్రుచ్చిన దండ ఛిన్నమై
పూవు రేకు లూ డి పడపోయె; మిగి చ్చితి ప్రేమ వాసనా
ప్లావిత తంతు వద్దియురెవ్వైతేవో నా మెడ నీ మృణాల రే
ఖా పర హ స్తమం దభయ కంకణమై ధరింతువో సఖి !.

అని.

పదిలంగా ఆ కార్డును ఒలిచి, జేబులో వేసుకున్నాను.

ఇవతలకు వచ్చి, రాజబాటను కాలి నడకను వెళుతూ అనుకున్నాను ; ఆ

## సా గు తు న్న యా త్ర

వాడు, గర్వంతో, "ప్రభూ" అని ఉండవలసిన చోట "సఖీ" అని దిద్ది వ్రాసాను కాని, నిజానికి, అసలుపాఠము, "ప్రభూ" యే, సరి :

"అడ్డి యురివైతువా నా మెడ, నీ మృణాల రేఖా
పరహస్తమం దభయ కంకణమై ధరింతువో ప్రభూ!"

—ఇదే సరియైన పాఠము అనుకున్నాను.

పట్టుమని పది వారాలైనా కాలేదు, అమలాపురం బంగాళాలో కూర్చుని ఉదయినిలోని కాటూరి వారి పద్యాలు చదివి. వారి మాటలు ఇంత చప్పున ఇంత సూటిగా, నాకే అన్వయిస్తాయి అనుకోలేదు, ఆ నిమిషం నేను :

పూలు రాలగాక, పోలి పోక తుది మొదల్
నిలుచు సూత్రమైన నే గ్రహించి
రాలినట్టి పూలమాలిక దెత్తునా ?
సాక్షిగాగ నా ప్రయత్నములకు !

రాలినట్టి పూమాల చేతబుచ్చుకునే రైలుఎక్కాను, నేను ఆపదలలో నన్ను ఆదుకునే మా అక్కయ్య వద్దకు వెళ్ళడానికి — అక్కడ, తల దాచుకోడానికి.

ఎలా పరిణమిస్తుందో భావి జీవితము !

కలిత విపత్తి దండ పద ఘట్టన సేయుచు మన్నుఁ గైవడిన్ ఖలు
డు విధాత పిండితముగా నొనరించి నితాంత చింతయన్
బలితపు సారెపై నిలిపి పాయక డెందము ద్రిప్పుచున్న వా
డలమి కులాలు రీతి, దెలియంగలవారమె యేమి సేయునో !

భర్తృహరి

★ ★

★